# ఆంధ్రప్రదేశ్ గురించి

* 1971 జనాభా లెక్కల ప్రకారం, ఆంధ్రప్రదేశ్ జనాభా భారతదేశ జనాభాలో 7.93 శాతానికి. ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణం భారతదేశ విస్తీర్ణంలో 9 శాతానికి సమానం.

* ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణం 2,75,109 చ. కి. మీటర్లు.

* 1971 లో సేకరించిన లెక్కల ప్రకారం, ఆంధ్రప్రదేశ్ జనాభా 4,33,94,951 వుంది. దేశ జనాభా 54,69,55,945.

* 1971 లెక్కల ప్రకారం, రాష్ట్ర జనాభాలో అక్షరాస్యులు 24.56 శాతం మంది వున్నారు. 1961 లో 21.19 శాతం. భారతదేశం మొత్తం మీద వున్న అక్షరాస్యుల శాతం 1971 లో 29.35 1961 లో 24.03 శాతం.

* మన రాష్ట్రంలో జనాభా సాంద్రత చ. కి. మీ. 1 కి 157 మంది. హైదరాబాదు జిల్లాలో సాంద్రత చ. కి. మీ. 1 కి 362. అన్ని జిల్లాల కంటే యిది ఎక్కువ. అదిలాబాద్ జిల్లాలో జనాభా సాంద్రత 79 మంది. అన్నిటికంటే యిది తక్కువ.

* రాష్ట్రంలో తలసరి సగటు ఆదాయం (1960-61 నాటి ధరలు) మొదటి ప్రణాళిక అంతానికి రూ. 281 లు, రెండవ ప్రణాళిక అంతానికి రూ. 306 లు, మూడవ ప్రణాళిక అంతానికి రూ. 333 ల చొప్పున ఉంది. నాలుగవ ప్రణాళిక ముగింపు నాటికి తలసరి సగటు ఆదాయం రూ. 430 లకు పెరుగుతుంది.

* రాష్ట్రంలో 1,000 అడుగుల లోతు మేరలో సుమారు 1,000 మిలియన్ టన్నుల బొగ్గు నిక్షేపాలు వున్నాయి. 2,000 అడుగుల లోతు మేరలో 1,320 మిలియన్ టన్నుల బొగ్గు నిక్షేపాలు లభించగలవని అంచనా.

* భారతదేశంలో, బారైట్స్ ఉత్పత్తిలో ఆంధ్రప్రదేశ్ దే అగ్రస్థానం. దేశంలో ఉత్పత్తి అయ్యే బారైట్స్ లో 90 శాతం మొదలు 95 శాతం వరకు రాష్ట్రంలో ఉత్పత్తి అవుతున్నది.

* అభ్రకం ఉత్పత్తిలో బీహారు, రాజస్థాన్ రాష్ట్రాల తరువాత స్థానం ఆంధ్రప్రదేశ్ ది.

# ఆంధ్ర ప్రదేశ్

సంపుటి : 18 — జనవరి 1974 — పుష్యం—మాఘం, 1895 శా. శ. — సంచిక : 3

ప్రధాన సంపాదకులు :
పెండ్యాల వామనరావు

సంపాదకులు :
ఈరంకి వెంకట సుబ్బారావు




దేశమును ప్రేమించుమన్నా
మంచియన్నది పెంచుమన్నా
వట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్

మొదటి అట్ట : 1973 డిసెంబరు 10 న ప్రమాణ స్వీకారానంతరం ముఖ్యమంత్రి గవర్నరుతో కరచాలనం చేస్తున్నదృశ్యం

మూడవ అట్ట : ఆంధ్రప్రదేశ్ హస్తకళాఖండం ఒక దానికి చివరి నగిషీలు చెక్కుతున్న దృశ్యం

చివరి అట్ట : చిత్తూరు జిల్లాలోని హార్లీస్ కొండలమీది విశ్రాంతి గృహం

సాలు చందా : ఆరు రూపాయలు

వెల: 50 పైసలు

రిజిస్టరు నెం : 133

పేజీ

# ఆంధ్రప్రదేశ్ లో సత్వరాభివృద్ధి

ప్రజాస్వామికంగా ఎన్నికైన సభ్యులతో శ్రీ జలగం వెంగళరావు గారి నాయకత్వంలో ప్రజా ప్రతినిధుల మంత్రి వర్గం ఏర్పాటు కావడంతో ఆంధ్రప్రదేశ్ చరిత్రలో ఒక నూతన అధ్యాయం ప్రారంభమైంది. రాష్ట్రంలో ఆరు అంశాల పథకం వల్ల ఆంధ్రప్రదేశ్ సమైక్యత పరిరక్షింపబడి, రాష్ట్ర సమగ్రత దృఢపడగలదు. ఇంతేకాదు, రాష్ట్రంలోని వెనుకబడిన ప్రాంతాల శీఘ్రతర అభివృద్ధికి, రాష్ట్రరాజధానిని ఒక క్రమానుగతంగా అభివృద్ధిపరచడానికి, విద్యాసంస్థలలో ప్రవేశానికై స్థానికులకు ప్రాధాన్యత ఇవ్వడానికి, జిల్లా స్థాయిలో నాన్‌గజిటెడ్ ఉద్యోగాలలో నేరుగా ఉద్యోగం యిచ్చే విషయంలో స్థానిక అభ్యర్థులకు ముందుగా ప్రాధాన్యత యివ్వడానికి, సర్వీసులకు సంబంధించిన యిబ్బందులను పరిష్కరించేందుకు వీలుగా పరిపాలనా సంబంధమైన ఉన్నతాధికార విచారణాసంఘాన్ని ఒక దానిని ఏర్పాటుచేయడానికి యీ ఆరుఅంశాల పథకం వీలు కల్పిస్తున్నది.

వెనుకబడినతనానికి గల అసలుకారణాలను పరిశీలించి, వాటిని పరిష్కరించి ప్రాంతీయ ఆర్థిక అసమానత్వాన్ని తొలగించడం ఆరుఅంశాల పథకం లక్ష్యాలలో ఒకటి. రాష్ట్ర ప్రణాళిక అభివృద్ధి సంస్థను ఆంధ్ర, రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలకు ప్రాంతీయ అభివృద్ధి సంఘాలను ఈ ఉద్దేశంతోనే ఏర్పాటు చేయడం జరిగింది. అధికార బాధ్యతలను స్వీకరించిన వెంటనే ముఖ్యమంత్రి రాష్ట్రప్రజలకు శక్తివంతమైన, నిష్కళంకమైన పరిపాలనను అందించగలనని యిచ్చిన హామీకి అన్ని వర్గాల ప్రజలూ తమ హర్షామోదాలను ప్రకటించారు. ఏ అసంతృప్తికైనా ఉపాధిఅవకాశాలు లేకపోవడం, ఆర్థికాభివృద్ధి కొరవడడమే కారణమని అనేక బహిరంగసభలలో ముఖ్యమంత్రి స్పష్టంచేశారు. నిరుద్యోగాన్ని నిర్మూలించడానికి అవసరమయ్యే ఉద్యోగాలతో పోల్చి చూస్తే ప్రభుత్వం కల్పించే ఉద్యోగాలు అతి స్వల్పం కనుక ముఖ్యమంత్రి పేర్కొన్నట్టు పారిశ్రామికీకరణకు ఒక కార్యక్రమాన్ని చేపట్టి, శీఘ్రతర అభివృద్ధికి వివిధ పథకాలను అమలు పరచడం చాలా అవసరం.

ఆరు అంశాల పథకానికి ఆమోదం లభించడం, ముఖ్యమంత్రి అన్నట్టు, తెలుగు మాట్లాడే ప్రజల సమైక్యత విషయంలో ఆంధ్రప్రదేశ్ ప్రజలు ఏకచిత్తులని వెల్లడైంది. రాష్ట్రభవిష్యత్తూ, రాష్ట్రసంక్షేమమూ నాలుగున్నరకోట్ల తెలుగు ప్రజల సమైక్యత మీదనే ఆధారపడివున్నాయని కూడా యిది స్పష్టంచేస్తోంది. తెలుగు మాట్లాడే ప్రజల ఒకే చరిత్ర, ఒకేభవిష్యత్తు అనే బలమైన పునాదుల మీద ఆంధ్రప్రదేశ్ ఏర్పాటైందని ప్రత్యేకించి చెప్పనక్కరలేదు. రాష్ట్రంలో లభ్యమయ్యే అపారమైన వనరులన్నిటినీ సక్రమంగానూ, క్రమబద్ధంగానూ వినియోగించుకొన్నప్పుడే ఆంధ్రప్రదేశ్ గణనీయమైన ప్రగతిని సాధించి, ఒక పటిష్టవంతమైన, సుస్థిరమైన ఐశ్వర్య విలసితమైన రాష్ట్రంగా రూపొందగలదు. విచ్ఛిన్నకర శక్తులూ, వేర్పాటుధోరణులూ ఎప్పుడూ ప్రజలకు హానికలిగించడానికే తోడ్పడతాయి. అంతఃకలహాలవల్ల అంతిమంగా బాధపడేది ప్రజలే.

1956 లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పటినుంచీ అనేక రంగాలలో రాష్ట్రం అభివృద్ధిని సాధిస్తూవస్తూన్నది. ఈ అభివృద్ధి ఇటీవలి కాలంలో రాష్ట్రాన్ని కదిలించివేసిన రెండు ఆందోళనలవల్లా, రెండు తుఫానులవల్లా, మూడు కరువులవల్లా, యింకా అనేక కారణాలవల్లా కుంటుపడిపోయిందనడంలో సందేహం లేదు. రాష్ట్ర సమగ్రత దెబ్బతినడానికి కారణమైన కొన్ని అంశాలన్నీ తొలగించి, రాష్ట్ర సమైక్యత బలపడడానికి దోహదంచేసే కొన్ని ఏర్పాటులను కల్పించడానికి ఆరు అంశాల పథకం ఉద్దేశించబడింది. "తెలుగు ప్రజల సమైక్యతమీదా, సమగ్రతమీదా అపారమైన విశ్వాసం నాకు వుంది. ఎంతో క్లిష్టమైన పరీక్షా సమయాలలో కూడా నేను యీ విశ్వాసాన్ని వదులుకోలేదు. రాష్ట్ర సమగ్రతను పరిరక్షించడానికి నిరంతరంగా పరిశ్రమిస్తూ, యిరుప్రాంతాల ప్రజలకు వీలయినంత ఎక్కువ సంతృప్తిని కలిగించడానికి చిత్తశుద్ధితో కృషిచేస్తాను." అని ముఖ్యమంత్రి స్పష్టీకరించారు. వెనుకబడినతనాన్ని గాని, అభివృద్ధిలో హెచ్చుతగ్గులనుగాని తొలగించడానికి రాష్ట్రాన్ని చీల్చడం ఏ విధంగానూ పరిష్కారం కాదు అని సమగ్ర ఆంధ్రప్రదేశ్ కొరకు ఎల్లవేళలా దృఢంగా నిలబడిన శ్రీమతి ఇందిరాగాంధి గట్టిగా నొక్కిచెప్పారు. ఆంధ్రప్రదేశ్ వేల సంవత్సరాలుగా ఒక ప్రత్యేకమైన సాంస్కృతిక బంధంతో ముడివేసుకుని వున్నదనీ, చరిత్రలో చాలా కాలంపాటు యీ ప్రాంతాలన్నీ ఒకే పరిపాలనకింద వున్నాయనీ ప్రధాని అన్నారు. ఈ సుదీర్ఘమైన చరిత్రవల్లనే తెలుగు ప్రజలు ఉద్దీప్తులై ఒక సమగ్ర ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుకావడానికి అనేక దశాబ్దాలపాటు పోరాడవలసివచ్చింది. ఆంధ్రప్రదేశ్ విచ్ఛిన్నం కాకుండా వుండడానికి చిత్తశుద్ధితో వీలయిన చర్యలన్నీ తీసుకోవాలని ఆమె స్పష్టం చేశారు. ప్రధాని ఆశీస్సులు పుష్కలంగా వున్న మన ముఖ్యమంత్రి అభివృద్ధికార్యక్రమాలకు సంబంధించి త్వరత్వరగా నిర్ణయాలు తీసుకుంటూ తన మంత్రివర్గానికి ఆదర్శంగా వ్యవహరిస్తున్నారు. ముఖ్యమంత్రి ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో చేసిన పర్యటనలలో ప్రజలు చూపిన అభిమానాన్ని బట్టి చూస్తే ఇరుప్రాంతాలకు న్యాయం చేకూరడానికీ, ప్రజలకు ఉపాధి సౌకర్యాలు కల్పించబడడానికీ, వెనుకబడినతనం తొలగిపోడానికి ఆరు అంశాల పథకాన్ని శక్తివంతంగా అమలు పరచే విషయంలో ప్రజలు చాలా ఆసక్తితో వున్నారని అర్థమౌతుంది.

—పి. వి. ఆర్.



# ‘ కలిసికట్టుగా పురోగమిద్దాం ”

## శ్రీ జలగం వెంగళరావు

(ముఖ్యమంత్రి డిశంబరు 10 వ తేదీన రాత్రి 7-45 గం. లకు ఆంధ్రప్రదేశ్ ప్రజలను ఉద్దేశించి ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంనుంచి చేసిన రేడియో ప్రసంగం పూర్తిపాఠం యీ దిగువ యివ్వబడినది.)

“ మన ప్రియతమ ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీ, ఇతర కేంద్ర నాయకుల ఆశీస్సులతో, కాంగ్రెసు లెజిస్లేచర్ పార్టీ లోని నా సహచరుల అండదండలతో, తోటి కాంగ్రెసు వాదుల ఆదరాభిమానాలతో, మీ అందరి సంకల్ప బలంతో, ప్రథమ ప్రజా సేవకుడ నన్న వినమ్ర భావంతో నేడు ముఖ్యమంత్రి పదవిని స్వీకరించాను.

ఒక క్లిష్ట సమయంలో ఈ గురుతర బాధ్యతను స్వీకరిస్తున్నానన్న విషయం నాకు తెలుసు. అయితే, కేంద్ర నాయకుల ఆశీస్సులు, రాష్ట్ర ప్రముఖుల ప్రోత్సాహం, వివిధ వర్గాలవారు నా పట్ల చూపుతున్న ఆదరాభిమానాలు నాకెంతో ధైర్యోత్సాహాలను కలుగజేశాయి. నాయందు విశ్వాసముంచి, రాష్ట్రానికి, దేశానికి యధాశక్తి సేవ చేయ డానికి నాకు ఈ మహదవకాశం కల్పించిన పెద్దలకు, సహచరులకు, రాష్ట్ర ప్రజానీకానికి కృతజ్ఞతాభి వందనా లర్పించుకుంటు న్నాను.

క్లిష్ట సమస్యలు ఎదురైనప్పుడు, ముఖ్య నిర్ణయాలు తీసుకోవలసినప్పుడు, వివిధ వర్గాలవారు, వ్యక్తులు స్వేచ్ఛగా తమ తమ అభిప్రాయాలను వ్యక్తం చెయ్యటం, సుదీర్ఘంగా చర్చలు జరగటం ప్రజాస్వామ్యంలో సహజమే. అంతమాత్రం చేత ఎవరిపట్లా ద్వేషభావం ఉండనవసరం లేదు. అందరం కలిసి భావికర్తవ్యాన్ని గురించి ఆలోచించుకొని కలిసికట్టుగా ముందుకు సాగిపోవల సిందే. మన రాష్ట్రం ఎదుర్కొంటున్న జటిల సమస్యల పరిష్కారానికి మీ అందరి సంపూర్ణ సహకారాన్ని నేను అర్థిస్తున్నాను. ప్రగతి పథంలో రాష్ట్రాన్ని పురోగమింప జేసే మహత్తర కృషిలో అన్ని ప్రాంతాల వారు, అన్ని వర్గాలవారు సంపూర్ణ సహకారాన్ని అందజేయగలరన్న విశ్వాసం నాకు ఉంది.

ఆంధ్రకేసరి ప్రకాశం, దేశభక్త కొండా వెంకటప్పయ్య, కాశీనాధుని నాగేశ్వరరావు, బూర్గుల రామకృష్ణారావు, సర్దార్ జమలాపురం కేశవరావు మొదలైన మహాపురుషుల తపః ఫలితంగా, తెలుగు ప్రజల చిరవాంఛిత స్వప్నం సఫలమై 1956 లో సమగ్రాంధ్ర రాష్ట్రం అవతరించిందన్న విషయం మీ అందరికీ తెలుసు. ఆదర్శ రాష్ట్రం అంటే ఇది అని సగర్వంగా చూపదగిన విధంగా ప్రకృతి తెలుగు ప్రాంతాన్ని తీర్చిదిద్దింది. ఒకే భాష, ఒకే సాహిత్యం, ఒకే సంస్కృతి కలిగి ఉండటంఅనే అనుబంధం తోపాటు, ఒక ప్రాంతం మరొక ప్రాంతానికి దోహదకారిగా ఉండటం అనే పరిస్థితి కూడా తెలుగు ప్రజల సమైక్యతకు ఒక బలమైన ప్రాతిపదిక. ఎన్ని తుఫానులనైనా, ఎన్ని గృహచ్ఛిద్రాలనైనా అధిగమించగల మహత్తర శక్తి ఈ అనుబంధాలకు కలదనే విషయాన్ని చరిత్ర పదే పదే స్పష్టం చేసింది. అందుచేత, శతాబ్దాల ఎడబాటు అనంతరం కష్టపడి సాధించుకున్న ఈ సమైక్యతను సుదృఢం చేసుకుంటూ, రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధికి, సోషలిస్టు సమాజ స్థాపనకు, బలహీన వర్గాల సంక్షేమానికి మనమందరం భుజం భుజం కలిపి పనిచెయ్య వలసిన అవసరం ఉన్నదని సవినయంగా మనవి చేస్తున్నాను.

గత నాలుగైదు సంవత్సరాలలో తల ఎత్తిన కొన్ని వైషమ్యాల వల్లనేమి, జరిగిన దురదృష్టకర సంఘటనల వల్లనేమి, అనేక కష్ట నష్టాలు సంభవించాయి. కొందరు అసువులను సైతం కోల్పోయారు. వారి కుటుంబాలకు, కష్ట నష్టాలకు గురైన

ఇతరులకు నా ప్రగాఢ సానుభూతి తెలియ జేస్తున్నాను. ఈ నాలుగైదు సంవత్సరాలలో చెలరేగిన సంక్షోభాల మూలంగా రాష్ట్ర ఆర్థికాభివృద్ధికి తీవ్ర అంతరాయం కలిగిన విషయం కూడా మీకు తెలుసు. దీనికి తోడు ప్రకృతి కూడా అప్పుడప్పుడు ప్రతికూలిస్తూనే వచ్చింది. పదడుగులు ముందుకు వేయడానికి బదులు, రాష్ట్రం ఎంతో వెనుకబడిపోయింది. గతంలో జరిగిన ఈ లోపాన్ని సరిదిద్దుకొని పక్కన రాష్ట్రాలతో సమానంగా పురోభివృద్ధిని సాధించాలంటే, మనమంతా విభేదాలను విస్మరించి ద్విగుణీకృతోత్సాహంతో కృషి చేయవలసి ఉంటుందని నేను ప్రత్యేకించి చెప్పనవసరంలేదు.

ఉద్యోగాల విషయంలో అన్ని ప్రాంతాల వారికి, అన్ని వర్గాల వారికి న్యాయం చేకూర్చడానికి, వెనుకబడిన ప్రాంతాల సర్వతోభివృద్ధిని సాధించడానికి ప్రధాన మంత్రి సహాయ సహకారాలతో ఆరు సూత్రాల పథకాన్ని రూపొందించుకొన్న విషయం మీకందరికీ తెలుసు. స్థానికులకు ఉద్యోగావకాశాలు లభింపజేసే విషయంలో స్పష్టమైన, కచ్చితమైనఏర్పాట్లు చేయగలమని, ఏ ప్రాంతం వారికీ అన్యాయం జరగకుండా జాగ్రత్త వహించగలమని హామీ ఇస్తున్నాను. సర్వీసుల విషయంలో ఏర్పడిన వివాదాలు చాలవరకు పరిష్కారమైనట్టు విన్నాను, ఇంకా మిగిలి ఉన్న వివాదాలన్నిటినీ సామరస్య పూర్వకంగా, న్యాయంగా పరిష్కరించడానికి సత్వర చర్యలు తీసుకొని, ఉద్యోగులంతా ఎటువంటి వైషమ్యాలు లేకుండా, అభివృద్ధి కార్యక్రమాల నిర్వహణపై దృష్టిని కేంద్రీకరించడానికి అనువైన వాతావరణాన్ని సృష్టించడానికి శాయశక్తులా కృషి చేయగలనని మాట ఇస్తున్నాను. ఈ వివాదాల పరిష్కారంలో సహకరించ వలసిందిగా వివిధ ఉద్యోగుల సంఘాలకు విజ్ఞప్తి చేస్తున్నాను. ఈవిధంగానే వెనుక బడిన ప్రాంతాల సర్వతోభివృద్ధి విషయంలో కూడా ప్రత్యేక శ్రద్ధ వహించగలనని హామీ ఇస్తున్నాను. ఆరుసూత్రాల పథకాన్ని రాష్ట్రప్రజలు యావన్మందీ ఆమోదించటం హర్షదాయకం. మీ సహాయ సహకారాలతో ఈ పథకాన్ని తు. చ. తప్పకుండా అన్ని ప్రాంతాల వారికి న్యాయం చేకూరే విధంగా అమలు పరచడానికి శక్తి వంచన లేకుండా కృషి చేయగలనని మనవి చేస్తున్నాను.

మనమంతా మన ప్రధాని నాయకత్వాన సోషలిస్టు సమాజ స్థాపనకు, దారిద్ర్య నిర్మూలనకు, బలహీన వర్గాల సముద్ధరణకు కంకణం కట్టుకున్నాము. ఇందుకు గాను కాంగ్రెసు పార్టీ అనేక అభ్యుదయ విధానాలను కార్యక్రమాలను రూపొందించింది సామాన్య ప్రజానీకంలో మన ప్రధాన మంత్రి రేకెత్తించిన బ్రహ్మాండమైన చైతన్యం మూలంగా ఈ అభ్యుదయ విధానాలను కార్యక్రమాలను అమలుపరచడానికి నేడు అత్యంత అనుకూలమైన వాతావరణం ఏర్పడింది. ఈ విషయమై కాంగ్రెసు పార్టీ చేసిన వాగ్దానాలను చెల్లించటం బలహీన వర్గాల సంక్షేమానికి ఇంకా అనేక కార్యక్రమాలను రూపొందించి, వారి జీవన ప్రమాణాలను పెంపొందించటం నా ప్రథమ కర్తవ్యంగా భావిస్తున్నానని మనవి చేస్తున్నాను.

మన రాష్ట్రంలో తల పెట్టిన అభ్యుదయ కార్యక్రమాలలో భూసంస్కరణలను ప్రధానంగా చెప్పుకోవచ్చు. భూవసతికి గరిష్ఠ పరిమితిని విశేషంగాతగ్గించి తద్వారా లభించే మిగులు భూమిని పేదలకు పంచి పెట్టడానికి ఒక కొత్త శాసనం అమలులోకి వచ్చినవిషయం మీకందరికి తెలుసు. ఎవరు ఎన్ని అడ్డంకులు సృష్టించడానికి ప్రయత్నం చేసినా సరే ఈ చట్టాన్ని కట్టుదిట్టంగా, అతి త్వరగా అమలు జరిపి, మిగులు భూములన్నిటినీ స్వాధీనం చేసుకొని, భూములులేని పేదలకు పంచి పెట్టడానికి కృత నిశ్చయంతో ఉన్నానని మనవి చేస్తున్నాను. అతి త్వరగా భూములను పంచి పెట్టడమే గాక, అట్టి భూములలో పంటలు పండించుకొనడానికి పేద రైతులకు తగు ఆర్థిక సహాయం, తదితర సౌకర్యాలు కల్పించడానికి కూడా ఏర్పాట్లు చేయవలసి ఉంటుందని కూడా గుర్తిస్తున్నాను.

"జై హింద్"

వ్యవసాయరంగంలో మనది పైచేయి అని ప్రతీతి కాని వ్యవసాయ రంగాన్ని ఇంకా వృద్ధి చేయడానికి అవకాశము ఉన్నది; వృద్ధి చేయవలసిన అవసరమూ ఉన్నది. మన ప్రాజెక్టులను పూర్తిచేసి భూగర్భ జలాల వినియోగానికి పెద్ద ఎత్తున కృషి చేసినట్లయితే, లక్షలాది ఎకరాల భూమికి నీటి పారుదల సౌకర్యం లభించి అధికోత్పత్తికి, బలహీన వర్గాల ఆర్థికాభ్యున్నతికి ఎంతో దోహదం కలుగుతుంది ఈ విధంగానే ఎరువుల సక్రమ పంపిణీకి తదితర సౌకర్యాల కల్పనకు కట్టుదిట్టమైన చర్యలు తీసుకోవలసి ఉంటుందని భావిస్తున్నాను. పారిశ్రామికాభివృద్ధి వీటన్నిటి కంటె ముఖ్యం. రాష్ట్రంలో లక్షలాది యువకులు శ్రామికులు జీవనోపాధి లేక నిరుత్సాహ పడుతున్నారు. వీరికి జీవనోపాధి కల్పించాలన్నా రాష్ట్రాన్ని సౌభాగ్యవంతం చేసుకోవాలన్నా పెద్ద ఎత్తున కొత్త పరిశ్రమలను స్థాపించుకొనటం వినా మరొక మార్గంలేదు. రాష్ట్రాభివృద్ధికి ఉదారంగా ఆర్థిక సహాయం అందజేయగలమని కేంద్ర ప్రభుత్వం వారు హామీ ఇవ్వడం సంతోషకరం. కేంద్రం నుండి సాధ్యమైనంత సహాయం పొంది రాష్ట్రంలో లభ్యం కాగల వనరులను కూడా సమీకరించి రాష్ట్ర పారిశ్రామికాభివృద్ధికి శక్తివంచన లేకుండా కృషిచేయాలన్నది నా ప్రధాన ఆశయాలలో ఒకటని మనవి చేస్తున్నాను.

ఏది సాధించాలన్నా పరిపాలన సమర్ధ వంతంగా, పటిష్టంగా, కళంకరహితంగా ఉండాలి. శ్రేయో రాజ్య సిద్ధాంతానికి పూర్తిగా అంకితం కావాలి. అట్టి కళంక రహితమైన, చైతన్య వంతమైన, సమర్ధ వంతమైన పరిపాలనను రాష్ట్రప్రజానీకం నా నుండి ఆశించ వచ్చునని హామీ ఇస్తున్నాను.

రాష్ట్రాభ్యుదయానికి ఆర్థికంగాను, సాంఘికంగాను ఎటువంటి తారతమ్యాలు ఉండని నవ సమసమాజ నిర్మాణానికి మనమంతా మళ్ళీ మరొకసారి ప్రతిజ్ఞ గైకొనాలి. శాంతి సౌభాగ్యాలతో అలరారే సీమగా ఆంధ్ర ప్రదేశ్‌ను తీర్చిదిద్దుకోవాలి. అదే నా ఆశయం ఈ కృషిలో సహకరించ వలసిందిగా మళ్ళీ మరొకసారి మీ అందరికీ విజ్ఞప్తి చేస్తున్నాను.

మూడు సంవత్సరాలు పనిచేశారు. ఈ పదవీకాలంలో పారిశ్రామికాభివృద్ధి విషయాలలో అనేక సమిష్టి సంస్థల ఏర్పాటుకు కృషి చేశారు. 1960 నుండి 63 వరకు కేంద్ర ప్రభుత్వ రంగంలో మన భారత హెవీ ప్లేట్స్ అండ్ వెస్సెల్సు సంస్థకు అధ్యక్షులుగా పని చేశారు.

శ్రీ బసిరెడ్డి గారు ఆంధ్ర ప్రదేశ్ పారిశ్రామిక అభివృద్ధి మండలికి రెండవ సారికూడా అధ్యక్షులుగా నియమింపబడ్డారు. వారి కృషి ఫలితంగానే ఇండో నిప్పన్ ప్రెసిషన్ బేరింగ్స్ సంస్థ బాగా అభివృద్ధి చెందింది.

1971 సెప్టెంబరులో వారు నరసింహారావు మంత్రివర్గంలో మధ్య తరహా నీటి పారుదల శాఖ మంత్రిగా చేరారు. గత మంత్రివర్గంలో, యీ శాఖకు తోడుగా, కోర్టుల మంత్రిత్వశాఖను కూడా నిర్వహించారు. గత సంవత్సరం ఆందోళన జరిగినప్పుడు మంత్రివర్గం నుండి మిగతా 9 మంది మంత్రులతోపాటు రాజీనామా చేశారు.



## శ్రీ జె. చొక్కారావు

శ్రీ జువ్వాది చొక్కారావు గారు 1921 లో కరీంనగరంలో జన్మించారు. వీరు ఆంధ్ర మహాసభలో చేరారు. ఇది తరువాత హైదరాబాదు స్టేట్ కాంగ్రెసుగా అవతరించింది. స్వాతంత్ర్యపోరాటంలో వీరు ప్రముఖ పాత్ర వహించారు. వీరు 1949 నుంచి 1954 వరకూ హైదరాబాదు స్టేట్ కాంగ్రెసుయొక్క కార్యవర్గ సంఘంలో సభ్యులుగా పనిచేశారు. తర్వాత, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీ ప్రధాన కార్యదర్శిగాను, ఆ తర్వాత దానికి ఉపాధ్యక్షులుగాను పనిచేశారు.

పంచాయతీ రాజ్ పథకం అమల్లోకి వచ్చిన తరువాత వారు కరీంనగర్ జిల్లా పరిషత్తుకు తొలి అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. 1962 ఫిబ్రవరివరకు అదే పదవిలో వున్నారు. మళ్లీ 1964 జూలైనుంచి 1967 జనవరి వరకు జిల్లా పరిషత్తు అధ్యక్షులుగా పని చేశారు. వీరు పరిషత్తు అధ్యక్షులుగా పనిచేసిన కాలంలో జిల్లాలోని గ్రామప్రజల సంక్షేమం కొరకు అనేక అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టారు. వీరి పదవీకాలంలోనే అనేక పాఠశాలలు తెరువబడినాయి. గ్రంథాలయోద్యమంలో చాలా శ్రద్ధవహించారు. శ్రీ చొక్కారావుగారు అనేక విద్యాసంస్థలలో కార్యనిర్వాహక సభ్యులుగా పనిచేశారు. కరీంనగరం జిల్లా విద్యా సంక్షేమసంస్థ కార్యదర్శిగా జిల్లా హస్తకళా వస్తువుల సలహా సంఘసభ్యులుగా పనిచేశారు.

శ్రీ చొక్కారావు గారు 1957 లో ఆంధ్రప్రదేశ్ సహకార భూమి తనఖా బ్యాంకు ఉపాధ్యక్షులుగా ఎన్నికయ్యారు. ఈ కాలంలో కరీంనగర్ తాలూకా వ్యవసాయ సహకార సంస్థ, హైద్రాబాదు వ్యవసాయ సహకార సంస్థల అభివృద్ధికై కృషిచేశారు. 1967 నుండి 1971 వరకు తెలంగాణా ప్రాంతీయ సంఘం అధ్యక్షులుగా పనిచేశారు. ఆ తరువాత నరసింహారావు మంత్రి వర్గంలో పరిశ్రమలశాఖను నిర్వహించారు. వీరు 1967 నుండి శాసనసభా సభ్యులుగా వున్నారు. గత సాధారణ ఎన్నికలలో శాసన సభకు ఎన్నికయ్యారు.

## శ్రీ కోదాటి రాజమల్లు

1925లో జన్మించిన శ్రీ కోదాటి రాజమల్లు గారు బొగ్గుగని కార్మికుని కుటుంబానికి చెందిన వారు. ప్రారంభ దశలో ఆదిలాబాదు జిల్లా బెల్లంపల్లిలో విద్యాభ్యాసం కొనసాగించి, నాగపూర్ విశ్వ విద్యాలయం నుండి పట్టభద్రులైనారు. ఆయన తన విద్యార్థి దశ నుండి రాజకీయాలలో ప్రత్యేక ఆసక్తి కనబర్చారు.



సోషలిజంలో ప్రగాఢ విశ్వాసం గల శ్రీ రాజమల్లు గారు సోషలిస్టుగా రాజకీయ జీవితం ప్రారంభించారు. కార్మికోద్యమాలలో ప్రముఖపాత్ర వహిస్తూ 1954 నుండి ఆరు సంవత్సరాల పాటు బెల్లంపల్లికి చెందిన 10,000 మంది సభ్యులు గల తాండూరు బొగ్గుగని కార్మికుల సంఘం ప్రధాన కార్యదర్శిగా వ్యవహరించారు. ఆదిలాబాదుజిల్లా సోషలిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి పదవి నిర్వహించారు. ఆవడి కాంగ్రెసు మహాసభ నాగపూర్ ఎ.ఐ.సి.సి. సమావేశాల తర్వాత శ్రీ రాజమల్లుగారు యితర సోషలిస్టు శాసన సభ్యులతోపాటు కాంగ్రెసులో చేరారు.

శ్రీ రాజమల్లుగారు 1952 లో ప్రథమంలో ఆదిలాబాదుజిల్లా లక్సెట్టిపేట రిజర్వుడు నియోజకవర్గం నుండి హైద్రాబాదు శాసన సభకు ఎన్నికైనారు. అప్పటి నుండి ఆయన శాసన సభ్యునిగా కొనసాగుతున్నారు. 1957 లో సోషలిస్టుపార్టీ టికెట్టుపై చెన్నూరు నియోజక వర్గం నుండి ఎన్నికైనారు. 1962 లోను 1967 లోను అదే నియోజకవర్గం నుండి కాంగ్రెసు పార్టీ టిక్కట్టుపై ఎన్నికైనారు. 1967 లో తెలంగాణా ప్రాంతీయ సంఘం ఉపాధ్యక్షులైనారు. రాష్ట్ర మంత్రి వర్గంతో చేరిన కారణంగా శ్రీజె.చొక్కారావు గారు రాజీనామా చేయడంతో శ్రీ రాజమల్లు తెలంగాణా ప్రాంతీయ సంఘం అధ్యక్షులుగా ఎన్నికైనారు. 1972 లో జరిగిన ఎన్నికలలో తిరిగి ఆయన రాష్ట్ర శాసన సభకు ఎన్నికైనారు. తెలంగాణా ప్రాంతీయ సంఘం అధ్యక్షులుగా కొనసాగినారు.

ఆంధ్ర ప్రదేశ్ సమగ్రతను పరిరక్షించడానికి ప్రాంతీయ సంఘం ముల్కీ నియమాలను రద్దు చేయాలని ప్రథమంగా ప్రతిపాదించారు.



## శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజు

శ్రీ సాగి సూర్యనారాయణ రాజుగారు విశాఖపట్నం జిల్లా నర్సీపట్నం తాలూకా తంగేడు గ్రామంలో 1903 నవంబరు 1వ తేదీన జన్మించారు. వీరు విజయనగరంలోని మహారాజా కాలేజీలో చదివారు. గాంధీజీ పిలుపు అందుకొని చదువుకు స్వస్తి చెప్పారు. శ్రీ రాజుగారు, 1952లో జరిగిన ప్రథమ సాధారణ ఎన్నికలలో పాయకరావు పేట నియోజకవర్గం నుండి మద్రాసు శాసన సభకు ఎన్నికైనారు. 1955 మధ్యంతర ఎన్నికలలో ఆంధ్ర శాసన సభకు నర్సీపట్నం, పాయకరావు పేట ద్విసభ్య నియోజకవర్గంనుండి తిరిగి ఎన్నికైనారు. 1967 లోను, 1972 ఎన్నికలలోను వీరు అదే నియోజకవర్గంనుండి ఎన్నికయ్యారు.

శ్రీ రాజు గారు వివిధ హోదాలలో జిల్లా కాంగ్రెసు, రాష్ట్ర కాంగ్రెసు కమిటీలలో పనిచేశారు. విశాఖపట్నం జిల్లా పరిషత్తు ప్రథమ అధ్యక్షులు. ఏటికొప్పాక చక్కెర ఫ్యాక్టరీ అధ్యక్షులుగా పనిచేశారు. తిరుమల–తిరుపతి ట్రస్టుబోర్డు సభ్యులుగా పనిచేశారు. వీరు 1963–67 కాలంలో ఎ.ఐ.సి.సి. సభ్యులుగా వున్నారు. 1967లో కాంగ్రెసు లెజిస్లేచర్ పార్టీ ఛీఫ్ విప్‌గా వ్యవహరించారు. తరువాత శ్రీ బ్రహ్మానందరెడ్డి మంత్రి వర్గంలో అటవీశాఖ మంత్రిగా పనిచేశారు. గత సంవత్సరం ఆందోళన జరిగినపుడు మిగరా 9 మంది మంత్రులతో పాటు వీరు మంత్రి వర్గంనుంచి రాజీనామా చేశారు.



## శ్రీ మహమ్మద్ ఇబ్రహీం అలీ అన్సారీ

శ్రీ మహమ్మద్ ఇబ్రహీం అలీ అన్సారీ గారు 1917 జూన్ 10వ తేదీన మహబూబ్ నగర్‌లో జన్మించారు. మొదట్లో హైదరాబాదులోని సెయింట్ జార్జ్ గ్రామర్ స్కూల్లో ఆతర్వాత అలీఘర్ ముస్లిం యూనివర్సిటీలో విద్య నభ్యసించారు. బొంబాయి టెక్నికల్ ఇనిస్టిట్యూట్ నుంచి ఎ.ఎమ్.ఐ.టి.లో డిప్లొమా పొందిన అనంతరం 1939 లో నిజాం ప్రభుత్వంలో అటవీ శాఖలో ఉద్యోగంలో చేరారు. 1946 లో వీరు ఆ ఉద్యోగానికి రాజీనామా చేశారు.

ఆ తరువాత రెండేండ్లకు కాంగ్రెసు సంస్థలో చేరి మహబూబ్ నగర్ జిల్లా కాంగ్రెసు కమిటీ సభ్యులుగా మంచి పేరు తెచ్చుకున్నారు. 1951 లో పురపాలక సంఘానికి కౌన్సిలర్‌గా ఎన్నికయ్యారు. మహబూబ్ నగర్ పట్టణ పురపాలక సంఘం అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. 1955 లో మహబూబ్ నగర్ సహకార కేంద్ర బ్యాంకు ఉపాధ్యక్షులుగా ఎన్నికయ్యారు.

1960 లో మహబూబ్ నగర్ స్థానిక పరిపాలనా సంస్థల నియోజక వర్గం నుంచి సభ్యులుగా ఎన్నుకొనబడ్డారు. రెండేండ్ల తర్వాత జిల్లా ముస్లిం వక్ఫ్ బోర్డు అధ్యక్షులుగా నామినేటు చేయబడ్డారు. 1965 లో మహబూబ్ నగర్ మార్కెట్ కమిటీకి అధ్యక్షులుగా ఎన్నికయ్యారు.

1967 సాధారణ ఎన్నికల్లో వీరు మహబూబ్ నగర్ నియోజక వర్గం నుంచి రాష్ట్ర శాసన సభకు ఎన్నికయ్యారు. శ్రీ బ్రహ్మానందరెడ్డి మంత్రి వర్గంలోను, 1971 సెప్టెంబరులో శ్రీ పి. వి. నరసింహారావు మంత్రి వర్గంలోనూ, వీరు ఆరోగ్య, వైద్య శాఖల మంత్రిగా పని చేశారు.



## శ్రీ వాసిరెడ్డి కృష్ణమూర్తి నాయుడు

శ్రీ వాసిరెడ్డి కృష్ణమూర్తినాయుడు గారు శ్రీకాకుళం జిల్లా, బొబ్బిలి తాలూకాలోని పినపత్తి గ్రామంలో 1922 ఆగస్టు 16 వ తేదీన జన్మించారు. మద్రాసులోని గిండీ ఇంజనీరింగ్ కళాశాలలో ఎల్. సి. ఐ. కోర్సు అభ్యసించారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించారు. తరువాత ఒక సంవత్సరంపాటు చదువు మానివేశారు. పిమ్మట 1946 లో ఎల్.సి.ఐ. కోర్సు పూర్తి చేశారు.

శ్రీకృష్ణమూర్తినాయుడు గారు అయిదు సంవత్సరాలకు పైగా జిల్లా కాంగ్రెసు కమిటీ సభ్యులుగా వున్నారు. 1956 లో వీరు సోషలిస్టు పార్టీలో చేరి మూడేండ్ల తర్వాత ఆ పార్టీకి రాజీనామా చేశారు. సోషలిస్టు పార్టీ టిక్కెట్టు మీద చీపురుపల్లి నియోజక వర్గం నుండి పార్లమెంటుకు

ఎన్నికయ్యారు. 1962 సాధారణ ఎన్నికలలో బొబ్బిలి తాలూకా బలిపేట శాసన సభా నియోజక వర్గం నుండి కాంగ్రెసు అభ్యర్థిగా ఎన్నికయ్యారు. 1968 లో శాసన మండలి సభ్యులైనారు.

శ్రీ నాయుడుగారు 1962 లో శ్రీకాకుళం జిల్లా పరిషత్తు ఉపాధ్యక్షులుగా పనిచేశారు. మరుసటి సంవత్సరం అధ్యక్షులైనారు. 1964 లో ప్రదేశ్ కాంగ్రెసు కమిటీ సభ్యత్వం పొందారు. మూడు సంవత్సరాల తర్వాత ఎ.ఐ.సి.సి. సభ్యులుగా ఎన్నికైనారు. 1968 నుండి ఎ. పి. సి. సి. ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు. 1967 లో రాష్ట్ర హౌసింగ్ బోర్డు సభ్యులయ్యారు.

1969 లో ఎక్సైజు, విద్యుచ్ఛక్తి శాఖల మంత్రిగా పనిచేశారు. 1971 సెప్టెంబరులో శ్రీ పి.వి. నరసింహారావు మంత్రివర్గంలో విద్యుచ్ఛక్తి శాఖా మంత్రిగా పనిచేశారు. ఆ సంవత్సరం ఆందోళన జరిగినప్పుడు మంత్రివర్గంనుంచి రాజీనామా చేసిన మంత్రులలో వీరుకూడా ఒకరు.



## శ్రీ బి. సుబ్బారావు

శ్రీబత్తిన సుబ్బారావు గారు తూర్పు గోదావరి జిల్లా రాజమండ్రి తాలూకా, కొలమూరులో జన్మించారు. విద్యార్థిదశనుండి ఆయన రాజకీయాలు, సాంఘిక సేవాకార్యక్రమాలలో ఉత్సాహంతో పాల్గొంటూ సమాజంలోని బడుగువర్గాల అభ్యున్నతికి కృషి చేశారు.

తూర్పు గోదావరి జిల్లా బూరుగుపూడి నియోజక వర్గంనుండి ఆంధ్రప్రదేశ్ శాసన సభకు ప్రప్రథమంగా ఎన్నికైనారు. ఆ తర్వాత అదే జిల్లాలోని కడియం నియోజక వర్గనుండి ఎన్నికైనారు.

శ్రీ సుబ్బారావుగారు 1953 నుండి రాజమండ్రిలోని సహకార కేంద్ర బ్యాంకు డైరెక్టర్ల బోర్డులో డైరెక్టరుగా వ్యవహరిస్తున్నారు. బడుగువర్గాలకు అనేక క్షేత్ర కార్మిక సహకార సంఘాలను ఆయన నిర్వహించారు. హరిజనులకు యితర వెనుకబడిన తరగతుల వారికి యిండ్ల స్థలాలు, బంజరు భూములు, ప్రభుత్వ అంతభూములు పంపిణీ చేయడంతో ఆయన ప్రముఖ పాత్ర వహించారు. తూర్పు గోదావరిజిల్లా క్షేత్ర కార్మిక సహకార సంఘాల యూనియన్ అధ్యక్షుడుగా వ్యవహరించారు. ప్రభుత్వం ఏర్పాటు చేసిన రైతు సంఘం, భూమి విలువ మదింపు, ఆదాయం విషయాల సంఘం సభ్యులుగా ఉన్నారు. యువ శాసన సభ్యుల ఫోరమ్ కార్యవర్గ సభ్యులుగా కూడా వ్యవహరించారు. రాష్ట్ర క్షేత్ర సలహా సంఘం సభ్యులుగా ఉన్నారు.

శ్రీ బత్తిన సుబ్బారావుగారు 1971 సెప్టెంబరులో శ్రీ నరసింహారావు మంత్రి వర్గంలో చేరారు. గత సాధారణ ఎన్నికల తర్వాత ఏర్పడిన మంత్రి వర్గంలో సహకారశాఖ మంత్రిగా కొనసాగారు. గత సంవత్సరం జరిగిన ఆందోళన సందర్భంలో రాజీనామా చేసిన పదిమంది మంత్రులలో ఆయన కూడా ఉన్నారు.

## శ్రీ ఎల్. లక్ష్మణదాసు

శ్రీ లుకలాపు లక్ష్మణదాసు గారు 1918 జూన్ నెలలో శ్రీకాకుళం జిల్లా పాతపట్నం తాలూకా కొమనర్వపల్లి గ్రామంలో జన్మించారు. 1940లో ఆంధ్ర విశ్వ విద్యాలయం నుండి వాణిజ్య శాస్త్రంలో పట్టభద్రులయ్యారు. విద్యార్థుల ఉద్యమాలలో మొదటి నుండి వీరికి ఆసక్తి వుండేది. ఆంధ్ర విద్యార్థి సమాఖ్యకు ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు. 1942 లో అజ్ఞాతవాసంలో ఉన్నారు.



జిల్లా కాంగ్రెసు కమిటీకి నాలుగేళ్ల పాటు అధ్యక్షులుగాను, ఎనిమిదేళ్ల పాటు కార్యదర్శిగాను వున్నారు. 1952లో ప్రదేశ్ కాంగ్రెసు కమిటీకి సంయుక్త కార్యదర్శిగా వ్యవహరించారు. ఆ తర్వాత ఎ.పి.సి.సి.కి ప్రధాన కార్యదర్శి అయ్యారు.

1952 నుండి 1967 వరకు రాష్ట్ర శాసన సభలో పాతపట్నం నియోజకవర్గానికి ప్రాతినిధ్యం వహిస్తూ సభ్యులుగా వున్నారు. 1972 ఎన్నికల్లో పొందూరు నియోజక వర్గం నుంచి శాసన సభకు ఎన్నికయ్యారు. పద్దెనిమిదేళ్ళ పాటు ఎ.ఐ.సి.సి. సభ్యులుగా వున్నారు. శాసన సభకు సంబంధించిన అనేక సంఘాలలో పని చేశారు. వారువెనుకబడిన తరగతి కుటుంబానికి చెందినవారు.

శ్రీ లక్ష్మణదాసు గారు గత మంత్రి వర్గంలో గృహనిర్మాణశాఖను నిర్వహించారు.

## శ్రీ జి. రాజారామ్

శ్రీరాజారామ్ గారు 1924 ఆగస్టు 27 వ తేదీన నిజామాబాద్ జిల్లా ఆర్గుల్ గ్రామంలో జన్మించారు. నిజామాబాద్‌లో ప్రాథమిక విద్యాభ్యాసం చేశారు. ఉస్మానియా విశ్వ విద్యాలయం నుండి కామర్సులో పట్టభద్రులైనారు. 1947 లో హైదరాబాదు భారతదేశంలో విలీనం కావాలని జరిగిన ఉద్యమంలో ఆయన విద్యార్థి నాయకులుగా ప్రముఖపాత్ర వహించారు. పోలీసు చర్య తర్వాత కాంగ్రెసునుండి విడిపోయి సోషలిస్టు పార్టీలో చేరారు. నిజామాబాద్



జిల్లాలో సోషలిస్టు పార్టీ వ్యవస్థను ఏర్పాటు చేశారు. షక్కర్ నగర్ మజ్దూర్ సభ ఉపాధ్యక్షులుగా వ్యవహరించారు.

శ్రీ రాజారామ్‌గారు 1967 నుండి శాసన సభ సభ్యులుగా ఉన్నారు. 1967 లో నిజామాబాద్ జిల్లా బాల్కొండ నియోజక వర్గం నుండి పోటీలేకుండా శాసన సభకు ఎన్నికైనారు. 1972 ఎన్నికలలో కూడా వీరు అదే నియోజక వర్గం నుండి శాసన సభకు ఎన్నికైనారు. తెలంగాణా ప్రజా సమితిలో సభ్యులుగా వుండి, తెలంగాణా ప్రజా సమితి భారత జాతీయ కాంగ్రెసులో విలీనం అయిన ఫలితంగా శ్రీ రాజారాం గారు కాంగ్రెసులో చేరారు. గత సాధారణ ఎన్నికలలో వీరు తిరిగి అదే నియోజక వర్గంనుండి రాష్ట్ర శాసనసభకు ఎన్నికయ్యారు. క్రిందటి మంత్రిమండలిలో వీరు చేనేత మగ్గాలు, సహకార నూలు మిల్లులు, సహకార చక్కెర ఫ్యాక్టరీలకు సంబంధించిన మంత్రిత్వ శాఖను నిర్వహించారు.

## శ్రీ చల్లా సుబ్బారాయుడు

శ్రీ చల్లా సుబ్బారాయుడుగారు అనంతపురం జిల్లా తాడిపత్రి తాలూకాలోని చల్లవారిపల్లి గ్రామంలో రైతు కుటుంబంలో 1914 నవంబరులో జన్మించారు. వీరు 1938 లో రాజకీయాలలో ప్రవేశించారు. తాడిపత్రి హైస్కూలులో చదివిన తరువాత మద్రాసులోని పచ్చయప్ప కాలేజీలో చదివారు. 1932 లో బొంబాయి నుండి అక్కౌంట్సులో ప్రభుత్వ డిప్లొమా డి.ఎస్.ఎ. సంపాదించారు.

గాంధీజీ అడుగు జాడలలో నిర్మాణాత్మక కృషిలో పాల్గొని శ్రీ సుబ్బారాయుడు గారు అనంతపురం జిల్లాలో ఎనిమిదేళ్లగా ఖాదీ ప్రచారాన్ని కొనసాగించారు. తాడిపత్రిలో హరిజన హాస్టలు నడిపించే విషయంలో శ్రద్ధాసక్తులు చూపారు. వీరు 1938లో జిల్లాబోర్డు సభ్యులుగా పని చేశారు. అనంతపురం జిల్లా కాంగ్రెసు కమిటీలోనూ, ప్రదేశ్ కాంగ్రెసు కమిటీలోనూ సభ్యులుగా పని చేశారు. తుంగభద్ర హైలెవెల్ కాలువ ప్రాజెక్టు నిర్మాణం విషయంలో శ్రీ సుబ్బారాయుడు గారు ప్రముఖ పాత్ర వహించారు.

శ్రీ సుబ్బారాయుడు గారు కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ టికెట్టు పైన తాడిపత్రి నియోజక వర్గంనుండి ప్రథమ సాధారణ ఎన్నికలలో శాసన సభకు ఎన్నికైనారు.



1955లో అదే నియోజక వర్గంనుంచి సమైక్యకాంగ్రెసు టికెట్టు పైన శాసన సభకు ఎన్నికైనారు. 1967, 1972 సాధారణ ఎన్నికలలో కూడా వీరు తాడిపత్రి నియోజక వర్గము నుండి రాష్ట్రశాసన సభకు ఎన్నికైనారు.

1971 సెప్టెంబరులో శ్రీ పి. వి. నరసింహారావు మంత్రి వర్గంలో పౌర సరఫరా మంత్రిగా చేరారు. గత సంవత్సరం ఆందోళన జరిగిన సందర్భంలో యితర మంత్రులతో పాటు వారు మంత్రి వర్గంనుంచి రాజీనామా చేశారు.

## డా. సి. హెచ్. దేవానందరావు

డా. సి. హెచ్. దేవానందరావు గారు, 1932 ఆగస్టు 2వ తేదీన విజయవాడలో జన్మించారు. విద్యార్థి దశలోనే వీరు చాలా



తెలివైనవారుగా పరిగణింపబడేవారు. మొదట్లో పాఠశాల అధ్యాపకులుగా జీవితం ప్రారంభించారు. ఆ తర్వాత సికిందరాబాదు ప్రధాన కార్యస్థానంగా క్రైస్తవ మత బోధక వృత్తిని చేపట్టారు. క్రైస్తవులు, తదితర అల్పసంఖ్యాక వర్గాల వారికై తమ సేవలను పూర్తిగా అంకితం చేసి కృషి చేస్తున్నారు. వారు హోమియోపతి డాక్టరు.

డా. దేవానందరావు గారు ప్రపంచమంతా పర్యటించారు. డల్లాస్‌లో జరిగిన అంతర్జాతీయ క్రైస్తవ మహాసభలో ఆసియా దేశాల క్రైస్తవుల ఏకైక ప్రతినిధిగా పాల్గొని ప్రసంగించారు.

క్రైస్తవ మతానికి, క్రైస్తవులకు వీరు చేసిన సేవలకు గుర్తింపుగా 1963లో కాలిఫోర్నియాలోని ప్రపంచ స్థాయి క్రైస్తవ మిషన్ వీరికి అధ్యాత్మిక విషయాలలో డాక్టరేటు డిగ్రీని యిచ్చింది. డా. దేవానంద రావు గారు శాసన మండలి సభ్యులు.

1971 సెప్టెంబరులో శ్రీ పి. వి. నరసింహా రావు మంత్రివర్గంలో యాత్రా విషయాల మంత్రిగా చేరారు.

## శ్రీమతి ఎం. లక్ష్మీ దేవి



శ్రీమతి ఎం లక్ష్మీదేవిగారు అనంతపురం తాలూకాలోని కేసేపల్లి గ్రామంలో 1936 జూలై 1వ తేదీన జన్మించారు. బాల్యంలో మొదట హిందూపూర్‌లోగల గ్రామ సేవా మందిర్‌లో విద్యనభ్యసించారు అటు తర్వాత అనంతపురంలో ఉన్నత విద్య పూర్తి చేశారు. శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయం ను డి బి. ఏ. పట్టా పొందారు. విద్యార్థిదశ లోనే వీరు సాంఘిక సేవా కార్యక్రమాలలో ఎక్కువ ఆసక్తిని కనబరుస్తుండేవారు.

శ్రీమతి లక్ష్మీదేవిగారు పంచాయతీ రాజ్ శాఖలో స్త్రీ, శిశు సంక్షేమానికి సంబంధించిన విస్తరణాధికారిణిగా ఉద్యోగంలో ప్రవేశించారు. హరిజనుల, వెనుకబడిన తరగతుల వారి సంక్షేమానికి విశేషంగా కృషి చేశారు.

సాంఘిక సంక్షేమ రంగంలో మహిళలకు, శిశువులకు సంబంధించిన అనేక సంస్థలతోనూ, ఎన్నో మహిళా మండలుల తోను శ్రీమతి లక్ష్మీ దేవిగారు సన్నిహిత సంబంధం కలిగివున్నారు.

శ్రీమతి లక్ష్మీ దేవిగారు అనంతపురం జిల్లా కళ్యాణదుర్గ రిజర్వుడు నియోజక వర్గంనుంచి రాష్ట్ర శాసనసభకు ఎన్నికయ్యారు వీరు శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయం సిండికేటు సభ్యులు.

# మంత్రుల శాఖలు

ఉప ముఖ్యమంత్రి శ్రీ బి. వి సుబ్బారెడ్డి–వ్యవసాయం, ఆహారోత్పత్తి, న్యాయశాఖ కారాగారాలు, న్యాయస్థానాలు.

శ్రీ నూకల రామచంద్రారెడ్డి–ఆర్థిక, వాణిజ్య, పన్నుల శాఖలు

శ్రీ పెంచికల బసిరెడ్డి–పరిశ్రమలు.

శ్రీ జువ్వాది చొక్కారావు–రవాణాశాఖ.

శ్రీ కోదాటి రాజమల్లు–ఆరోగ్యం, వైద్య శాఖలు, దేశీయ వైద్యము.

శ్రీ సాగి సూర్యనారాయణరాజు–దేవాదాయ, ధర్మాదాయ శాఖలు.

శ్రీ మహమ్మద్ ఇబ్రహీం అలీ అన్సారీ–సమాచార, పౌర సంబంధాలు. వక్ఫ్, సాలార్ జంగ్ మ్యూజియం.

శ్రీ వాసిరెడ్డి కృష్ణమూర్తి నాయుడు–మధ్యతరహా నీటిపారుదల, వరద నిరోధక, మురుగుపారుదల పథకాల శాఖలు.

శ్రీ బత్తిన సుబ్బారావు–సహకారశాఖ.

శ్రీ లుకలాపు లక్ష్మణదాసు–కార్మిక, ఉపాధికల్పన, పునరావాస శాఖలు.

శ్రీ గెడ్డం రాజారాం : విద్యుత్ శాఖ.

శ్రీ చల్లా సుబ్బారాయుడు – పురపాలక పరిపాలనశాఖ, పట్టణాభివృద్ధి, నగర నీటి సరఫరా.

డాక్టర్ సి హెచ్. దేవానందరావు–యాత్రికశాఖ, రవీంద్ర భారతి, నగరానికి వచ్చే సాంస్కృతిక రాయబారవర్గాలు, గ్రంథాలయాలు.

శ్రీమతి లక్ష్మీదేవి – స్త్రీ సంక్షేమం, శిశు సంక్షేమం.

సాధారణ పరిపాలన, అంతరంగిక వ్యవహారాలు మున్నగు మిగతా శాఖలన్నీ ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావుగారే తాత్కాలికంగా నిర్వహిస్తున్నారు.

## బుద్ధభగవానుని బోధనలతో ప్రభావితుడైన

# జవహర్లాల్ నెహ్రూ





శ్రీ ఎం. ఎస్. రావు

అది 1952వ సంవత్సరం. పండిత జవహర్లాల్ నెహ్రూకూ, ఆయన కుటుంబ సభ్యులకూ వైద్యునిగా పని చెయ్యవలసిందిగా జవహర్లాల్ నెహ్రూ సచివాలయంవారు నన్ను ఆహ్వానించారు. అందుకు నేను ఒప్పుకున్నాను. అంటే నేను ఒక ఉత్కృష్టమైన బాధ్యతను నిర్వర్తించనున్నానన్న మాట. ఈ నియామకం నాకూ, నేను పనిచేస్తున్న సైనిక దళాల వైద్య సర్వీసుకూ ఎంతో గౌరవాన్ని తెచ్చిపెట్టింది.

జవహర్లాల్ నెహ్రూ విద్యాభ్యాసం పశ్చిమ దేశాలలో జరగడం వల్ల ఆయనకు పాశ్చాత్య అలవాట్లు, అభిరుచులు చాలా అబ్బేయి. ఆనాటి బ్రిటిషు అధికారుల సాహచర్యం వల్ల నాకు కూడా పాశ్చాత్య అలవాట్లు, అభిరుచులు అబ్బేయి. మా ఇరువురికీ కొన్ని సామ్యాలు ఉన్నాయన్నమాట. ఇందువల్ల నేను నెహ్రూగారితో ఎటువంటి ఇబ్బందీ లేకుండా మసులుకోగలిగాను. మేమిరువురం ఒకరినొకరం బాగా అర్థం చేసుకోగలిగాము.

నెహ్రూ గారి వైద్యునిగా నాకు మొదటి పదేళ్లలో పెద్దగా పని ఏమీ ఉండేదికాదు. స్వల్ప అస్వస్థతలకు చికిత్స చెయ్యడం, నెహ్రూగారు విదేశాలకు వెళ్లబోయే ముందు ఆయనకు టీకాలు వెయ్యడం వంటి చిన్న చిన్న పనులు చేస్తూ ఉండేవాణ్ణి.

నెహ్రూగారు మందులను ఏవగించుకొనేవారు. టానిక్కులు, విటమిన్ మాత్రలను కూడా ఆయన ఎక్కువగా స్వీకరించేవారు కారు. ఆయనది ఎంతో ఆరోగ్యవంతమైన శరీరం. ఇందుకు ఆయన ఎంతో గర్వపడేవారు. మందుల పట్ల ఆయనకు అయిష్టత ఉన్నప్పటికీ, వాటి ఆవశ్యకతను వివరించి చెప్పిన పక్షంలో ఆయన నాతో సహకరించి నేను ఇచ్చే మందులను పుచ్చుకునేవారు. నెహ్రూ గారి వైద్యునిగా నేను ఎలా నెట్టుకు రాగలుగుతున్నానా అని ఆయన సహచరులు ఆశ్చర్యపడేవారు. అసలు విషయం ఏమంటే చీటికి మాటికి మందులు మింగే తమ సహచరులను నెహ్రూగారు తిట్టేవారు.

నెహ్రూగారి బహుముఖ వ్యక్తిత్వాన్ని వర్ణించడం చాలా కష్టం. ఆయన జీవితంలో నాకు తెలియగా జరిగిన కొన్ని సంఘటనల గురించి మాత్రమే నేను చెప్పగలను. ఈ సంఘటనలు ఆయనకు తోటి మానవుల పట్ల ఉన్న దయనూ, ప్రేమనూ వెల్లడి చేస్తాయి.

నెహ్రూగారు తమ పనులకు వేళ తప్పకుండా హాజరయ్యేవారు. చెప్పిన వేళకు హాజరై తమ మూలంగా ఇతరులకు ఎలాంటి అసౌకర్యం కలుగకుండా చూచేవారు. నెహ్రూగారి జీవితం చివరి భాగంలో ప్రతి ఆదివారం ఉదయం 7 గం.లకు నేను గానీ నా సహచరులు గానీ ఆయనకు వైద్య పరీక్ష చేసే వాళ్లం. 7 గం.లు కావడానికి 5 నిముషాల ముందుగానే ఆయన పడకగదిలో ఆయన రాకకోసం వేచి ఉండేవాళ్లం. గడియారం ఏడు గంటలు కొట్టడం, ఆయన గదిలో అడుగుపెట్టడం–రెండూ ఒకేసారి జరిగేవి. నాకు తెలియగా ఆయన ఎన్నడూ కనీసం ఒక్క నిముషం కూడా ఆలస్యం చెయ్యలేదు. ఏ కారణం చేతనైనా నిర్ణీత వేళకు హాజరు కాలేకపోతే ఆయన ఎంతగానో బాధపడేవారు. ఒక రోజు ఆయన విదేశాలకు పోబోతూ రోగ నిరోధక ఇంజెక్షను చేయించుకొనే నిమిత్తం నాకు కబురు పెట్టారు. రాత్రి 7 గం॥లకు ఆయన రావలసి ఉన్నది కానీ ఆయన ఏదో కారణం వల్ల వేళకు రాలేకపోయారు. ఇందువల్ల మాకు కలిగిన అసౌకర్యానికి బాధపడుతూ ఆయన నాకు రెండు సార్లు టెలిఫోను చేశారు. చివరకు 7 గం.ల 30 ని.లకు ఆయన వచ్చారు. రాగానే మాకు కలిగిన అసౌకర్యానికి ఆయన మళ్లీ క్షమాపణ చెప్పారు.

నెహ్రూగారు తమ క్రింద పనిచేస్తున్న సిబ్బంది యోగ క్షేమాల పట్ల ఎంతో శ్రద్ధ వహించేవారు. నేను హిందీలో మాట్లాడినప్పుడల్లా ఆయన నన్ను ఎగతాళి పట్టించేవారు. ఇది ఆయనకు సరదా, "కల్నల్ రావుగారి స్వచ్ఛమైన హిందీని వినడానికి ఇదే మంచి తరుణం." అని ఎగతాళి చేసేవారు. దీనితో నేను హిందీలో మరిన్ని సంస్కృత పదాలు కలిపి మాట్లాడేవాణ్ణి. నా మాటలు ఆయనను మరింతగా నవ్వించేవి.

మౌలానా ఆజాద్ మృత్యువుతో పోరాడుతున్న సమయంలో ఆయన బ్రతికి బయటపడే అవకాశాలు లేవని మేము చెప్పినప్పుడు నెహ్రూగారు పడిన బాధ ఇంతా అంతాకాదు. ఆయన ఒక మూలకు వెళ్లి కళ్లు తుడుచుకోవడం నేను చూచాను. పండిత పంత్ మరణం కూడా నెహ్రూగారిని కదిలించివేసింది. ప్రముఖ నాయకులు ఎవరైనా తీవ్రమైన అనారోగ్యంతో బాధ పడుతున్నప్పుడు వారికి నేనూ, నా సహచరులూ చికిత్స చేసేవాళ్ళం. రాత్రింపగళ్ళు అక్కడనే ఉండేవాళ్ళం. అలాంటప్పుడు మాకు వేళకు భోజనం, ఇతర సౌకర్యాలు అమరేలా నెహ్రూ ఎంతో శ్రద్ధ వహించేవారు. ఇలాంటి ఒకటి రెండు సందర్భాలలో ఆయన మాకు వేడివేడి పాలు, రొట్టె పంపించేవారు.

బుద్ధభగవానుడి బోధనలు నెహ్రూగారిని ప్రభావితులను చేశాయని చెప్పడంలో నా కెటువంటి సందేహమూ లేదు. ఇతరుల పట్ల సహనం, ఇతరుల బలహీనతలను, తప్పులను క్షమించడం— ఈ గుణాలు ఆయనను ఎంతగానో శోభింపచేశాయి. ఇందుకు ఉదాహరణగా ఆయన కార్యదర్శులలో ఒకరు చెప్పిన సంఘటనను తెలియజేస్తాను. నెహ్రూగారు రాత్రి ఒంటిగంట, రెండు గంటల వరకు పనిచేసేవారని అందరికీ తెలుసు. ఇలా పొద్దుపొయ్యే వరకు ఆయన 'డిక్టేట్' చేసిన ఉత్తరాలను ఆయన కార్యదర్శులు మరుసటి రోజు ఉదయం 3 గం. ల కల్లా 'టైపు' చేసి సంతకాలకు సిద్ధం చెయ్యాలి.

చలి విపరీతంగా ఉన్న ఒకసారి రాత్రి తమ కార్యదర్శికి ఉత్తరాలు డిక్టేట్ చెయ్యడం ముగించి నెహ్రూగారు పడక గదికి వెళ్లిపోయారు. కానీ, ఆ తరువాత ఎందుకో ఆయన తిరిగి తమ 'ఆఫీసు' గదికి వచ్చారట. అక్కడ అయన తన కార్యదర్శి ఉత్తరాలు 'టైపు' చెయ్యడానికి బదులు నిద్రపోతూండడం గమనించారు. ఇది చూచిన ఆయన తన పడక గదికి తిరిగి వెళ్లి ఒక దుప్పటి తెచ్చి అతడి మీద కప్పేరు. దీపం ఆర్పివేసి సద్దుచేయకుండా గది వదలి వెళ్లారట. కొంతసేపైన తరువాత నిద్రలేచిన కార్యదర్శి జరిగిన గతి గ్రహించి ఎంతో భయపడుతూ పని పూర్తి చేశాడు. రెండవ రోజుగానీ, ఆ తరువాతగానీ నెహ్రూగారు ఈ విషయాన్ని ప్రస్తావించనే లేదట.

## నడు ముందుకు

శ్రీ శిష్టు కృష్ణమూర్తి

తరతరాలు
నరనరాలను కొరికేస్తూ
రుజ కన్న, జరకన్న
అపాయ కరమై
వేధిస్తున్న జడత్వాన్ని
ఛేదించు.

జడత్వం మంచు
ఆవరించి గడ్డకట్టిన గుండెలో
ఎక్కడో ఏ మూలో
అణిగి మణిగి
ఆనవాలు పట్టలేని స్థితిలో
నివురు కప్పిన చైతన్యాగ్నిని
శోధించి రగిలించు.

అనుకూల వాతావరణం
పరుల సహకారం
ఎదురు చూస్తూ
చేతులు తడుముకుంటూ
గోతులు త్రవ్వుకుంటూ
నీతులు వింటూ
నాతుల కంటూ
నీచునిగా పాచిలాగ
బండను కరుచుకొని వుంటావా?

ఏకాకి గానే
అవకాశాల సృష్టించు
అవరోధాల నిరోధించు
నవచైతన్య కాంతిని ప్రసరించు.
నడుంలేదు నడవలేదు సమాజం,
దాని సహాయాన్ని కాంక్షిస్తావా ?
ఎన్నడు చేరుతావు గమ్యం?
చేవగల్గి చేతనయి
చచ్చిన వానిలా వుంటావా ?
నీశక్తిని మేల్కొలుపు,
నీవ్యక్తిత్వాన్ని రగుల్కొలుపు
భావికాలపు తలపులు బ్రద్దలు కొట్టు
నవమార్గంలో నడుముందుకు.

# ఆంధ్రప్రదేశ్ ఐదవ ప్రణాళిక పెట్టుబడి రెండు వేల కోట్లుండాలి

(గత సంచిక తరువాయి)

ఆంధ్రప్రదేశ్‌లో నిరుద్యోగ సమస్య ఈ క్రిందివిధంగా పరిణతి చెందుతున్నది. 1960–61 నుండి గత పది సంవత్సరాలలో చదువుకున్న విద్యార్థులు పెరిగిపోతున్న వివరం ఈ క్రింది విధంగా ఉంది.

చదువుకున్న విద్యార్థులు

| వివరం | 1960–61 | 1964–65 | 1969–70 |
|---|---|---|---|
| సాధారణ కళాశాలలు | 44,259 | 36,809 | 1,66,585 |
| వ్యవసాయ కళాశాలలు | 693 | 1,034 | 1,264 |
| ఇంజనీరింగు కళాశాలలు | 2,734 | 4,233 | 6,941 |
| వైద్య కళాశాల | 4,698 | 5,814 | 6,719 |
| పశు వైద్యశాల | 592 | 546 | 578 |
| సాంకేతిక విద్య | 3,165 | 2,737 | 7,156 |
| ఉన్నతపాఠశాల | 5,53,181 | 8,82,696 | 10,48,687 |
| ఇందులో పరీక్షలు నెగ్గినవారు | | | |
| హైస్కూలులో | 25,773 | 40,197 | 51,903 |
| కళాశాలలో | 13,449 | 15,359 | 28,299 |
| ఇంజనీరింగు | 295 | 284 | 1,437 |
| వైద్య కళాశాల | 273 | 371 | 1,035 |
| వ్యవసాయ కళాశాల | 192 | 228 | 420 |
| పశువైద్య కళాశాల | 45 | 51 | 127 |

మెట్రిక్

| | 1971 | 1972 |
|---|---|---|
| హాజరు | 1,65,494 | 2,48,498 |
| పాసయింది | 88,816 | 1,04,162 |
| శాతం | 53.67% | 41.9% |

ఈ 1973 ఆగస్టు నెలలో ఆంధ్రప్రదేశ్ ఎంప్లాయ్‌మెంటు ఎక్స్ఛేంజిలలో అన్నింటిలో 36,414 మంది ఉద్యోగాల కెదురు చూస్తున్నవారు చేరగా, 3,376 మందికి ఉద్యోగాలు లభించినవి. ఇంకా 4,60,735 మంది ఉద్యోగాల కెదురు చూస్తున్నారని చెప్పితే ఎప్పటికి సమస్య పరిష్కారంగాను? ఇందులో 31,824 మంది షెడ్యూల్డు తరగతుల వారు, 2,213 మంది షెడ్యూల్డు జాతుల వారున్నారు. విద్యార్హతల వారీగా 11,001 మంది ఇంజనీరులు, డాక్టర్లు 29,914 మంది పట్టభద్రులు, 1,86,978 మంది మెట్రిక్యులేషన్ ప్యాసయిన వారున్నారు. ఈ రిజిష్టరులలో నమోదు కాని వారెందరున్నారో ఊహించకుండా వున్నాము. 327,64 మంది షెడ్యూల్డు తరగతుల వారు, 2,123 షెడ్యూల్డు జాతులవారు ఉన్నారు. విద్యార్హతల వారీగా 10,900 మంది, ఇంజనీరులు, డాక్టర్లు, 88,474 మంది పట్టభద్రులు, 88,774 మంది మెట్రిక్యులేషను ప్యాసయినవారు ఉన్నారు. ఈ రిజిష్టరులలో చేరనివారెందరున్నారో ఎవరికీ తెలియదుకదా. నాల్గవప్లాను పూర్తి అయ్యేటప్పటికి దాదాపు 12,000 మందికి ఉద్యోగావకాశాలు కల్పించగల పరిశ్రమలు నిలిచిపోతవి. నాల్గవప్లానులో అమలు జరుపవలసిందిగా కోరిన దాదాపు లక్షమందికి ఉద్యోగావకాశాలు కల్గించగల ప్లాను తీసుకొనలేదు. ఇక ఐదవ ప్లానులో 50,000 మందికి ఉద్యోగావకాశాలకు ప్లానులు వేస్తే అవీ తగ్గిపోయేటట్లు కనుపించుతుంది. ఈ మూడూ పూర్తిచేస్తే దాదాపు రెండు లక్షల ఉద్యోగావకాశాలు కల్గించవచ్చు. అసలు కేంద్రపరిశ్రమలు ఆంధ్రప్రదేశ్‌లోనే తక్కువ. అందులో రాయలసీమ, సర్కారులలో మరీ తక్కువ.

—శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య

ఈ రాష్ట్రంలో సమానాభివృద్ధి సాధించాలెనన్నా భారతదేశంలో సమానస్థాయి అందుకోవలెనన్నా కేంద్ర పరిధిలోగాని, రాష్ట్రపరిధిలోగాని, వ్యక్తులపరిధిలోగాని 800 కోట్ల విలువగల పరిశ్రమలు విశాఖ ఉక్కుకాక అదే అయిదవ ప్రణాళికలో ప్రారంభం అయి ఉద్యోగావకాశాలు కలిగించి పరిశ్రమలు సాధించకపోతే ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న అలజడికి అసంతృప్తికి నివారణోపాయం ఉండజాలదు. అవి ఎరువులది ఒకటి, మరొక నూనె పరిశుద్ధి కర్మాగారం, అల్యూమినియం తయారు, చిన్నకారు ప్రాజెక్టు, న్యూస్‌ప్రింట్, ఆర్డినెన్స్, వ్యాగన్ నిర్మాణం–బొగ్గుతో కార్బనైజేషన్ ప్లాంట్, రాగి, సీసం ప్రాజెక్టు, నేలబొగ్గుకోలలు, కళ్ళద్దాల ఫ్యాక్టరీ, సిమెంటు ఫ్యాక్టరీలు, టాంకరు నిర్మాణస్థలం, గ్యాస్ సిలెండరు నిర్మాణము, మరొక సిగరెట్టు ఫ్యాక్టరీ (చార్‌మినార్ ఉందికదా) రైల్వే ఇంజను నిర్మాణ ప్రాజెక్టులు ఏమన్నా వస్తే ఆంధ్రప్రదేశ్ తన వ్యవసాయ ఉత్పత్తితోబాటు పారిశ్రామిక ఉత్పత్తిని సమన్వయించుకొని నిరుద్యోగంలో కొద్దిభాగం అయినా నిర్మూలించుకొని పారిశ్రామికాభివృద్ధిలో నడువగలుగుతుంది. లేదా లేనేలేదు.

ఈనాటి సలహాదారుల పరిపాలనలో రాష్ట్రపతి పాలన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రణాళికా సంఘానికి (ప్లానింగు కమీషను) రెండు అంచనాలుగా ఐదవ ప్రణాళికముసాయిదా అందజేసింది. అందులో 177 కోట్లు కేంద్రం నిర్ణయించిన కనీసావసరాల ప్రోగ్రాంతో కలిసింది. అది మినహాయించింది ఒకటి. 177 కోట్లు కలిస్తే 1,277 కోట్లు ఈ177 కోట్లు మినహాయిస్తే 1,100 కోట్లుగా సూచనలు చేశారు. ఆ సూచన క్రింద నిర్ణయించిన వివిధ శాఖల వ్యయం అంచనా ఈ విధంగా ఉంది :

## 5 వ ప్లాను

(కోట్ల రూపాయలు)

| పద్దు | 4.వ.ప్లాను | 1,277 కోట్లప్లాను | 1,100 కోట్లప్లాను |
|---|---|---|---|
| వ్యవసాయం, వగైరా | 65.48 | 159.91 | 159.91 |
| నీటి పారుదల | 98.18 | 200.00 | 200.00 |
| విద్యుచ్ఛక్తి | 176.28 | 455.00 | 450.00 |
| పరిశ్రమలు, గనులు | 14.71 | 62.12 | 62.12 |
| రహదార్లు రవాణా | 15.50 | 73.88 | 43.88 |
| సాంఘిక సేవ | 56.92 | 310.60 | 168.87 |
| అవీఇవీ | 0.36 | 15.49 | 15.49 |
| మొత్తం | 427.49 | 1,277.00 | 1,100.00 |

గవర్నరు సలహాదారు శ్రీ హెచ్.సి. సరీన్ అయిదవ ప్రణాళికలో నాగార్జునసాగర్ ప్రాజెక్టు పూర్తి చేయబడుతుందని అందుకు 80 కోట్లు పడుతుందని అన్నారు. అదికూడా యిందులో ఉందో అదనంగా ఉందో తెలియదు. పరిశ్రమల విషయం వివరాలు తెలియవు. పరిశ్రమలకు ఇంతవరకు నాల్గు ప్రణాళికల్లో చేసిన వ్యయంలో 3.7 శాతం వ్యయం మాత్రమే. ఇపుడు 5.6 శాతం వరకు పెంచినందుకు సంతోషమేకాని ఈ శాతంతో నిరుద్యోగ నివారణ—ప్రాంతీయ అసమానతలు ఎప్పటికి సమన్వయం అయ్యేటట్లు–ఇందులో కనీసం 2,000 కోట్లు అయినా అంచనా వేయాలి.

కేంద్ర ప్రభుత్వపరంగా ఉన్న పారిశ్రామిక సంస్థలు ఎంత తక్కువగా ఉన్నవో చూడండి. వీటితోబాటు వివిధ రాష్ట్రాలలో చెల్లించబడుతున్న తలసరి పన్ను కూడా గమనించండి.

## కేంద్ర ప్రభుత్వ పరిశ్రమల పెట్టుబడి

| రాష్ట్రం | 1951–69లో | నాల్గవప్లాను వరకు | చెల్లించినపన్ను. |
|---|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 106.6 | 47.7 | 25.4 |
| అస్సాం | 51.0 | 54.9 | 18.6 |
| బీహార్ | 514.8 | 797.9 | 13.8 |
| గుజరాత్ | 59.0 | 26.0 | 35.7 |
| హరియానా | 8.5 | 6.0 | 38.3 |
| కేరళ | 91.8 | 54.1 | 29.0 |
| మహారాష్ట్ర | 55.0 | 100.6 | 44.0 |
| మధ్యప్రదేశ్ | 498.8 | 150.5 | 20.0 |
| మైసూరు | 64.8 | 17.7 | 30.6 |
| ఒరిస్సా | 423.4 | 16.0 | 13.3 |
| పంజాబ్ | 32.2 | — | 52.4 |
| రాజస్థాన్ | 40.1 | 93.1 | 20.9 |
| తమిళనాడు | 285.4 | 56.2 | 33.9 |
| ఉత్తరప్రదేశ్ | 178.3 | 47.4 | 15.8 |
| పశ్చిమ బెంగాల్ | 466.0 | 110.2 | 28.3 |
| ఢిల్లీ | 2.6 | 0.1 | .... |
| మొత్తం | 2,879.0 | 1,581·4 | 25.5 |

అంటే మొత్తము 4,460·4 కోట్లలో ఆంధ్రప్రదేశ్‌లో 154.3 కోట్లు మాత్రం.

ఆంధ్రప్రదేశ్‌లో పన్నుల భారం చూస్తే తలకు 25.4 రూ. యిప్పటికి పడింది. తలసరి సగటు ఆదాయం భారత దేశంఆదాయంలో తక్కువలో (భారత్ 590 అయితే ఆంధ్రప్రదేశ్ 544) ఉంటే తలసరి పన్ను చెల్లించడంలో మాత్రం సమానంగా (25.5) ఉన్నాం. అది ఎట్లా సాధ్యం అవుతుంది. ఆదాయంలో తక్కువ ఉండి పన్నులలో సమానంగా ఉంటే పన్నుల భారం అధికంగా వహిస్తున్నదన్నమాట. అదనపు వనరులను పన్నుల భారం పెంచడం సాధ్యం కాదని ఇదే ఋజువు చేస్తున్నది. నాల్గవ ప్రణాళికలో ప్లాను వ్యయం తలకు 97 కాగా 14 వరుసలలో ఉంటే పన్నుల భారంలో రెండవ వరుసలో ఉండి 30·37 భరించింది తలసరి.

రాజ్యాంగంలో ప్రాథమిక విద్య మొదటి పది సంవత్సరాలలో 12,14 సంవత్సరాల వారికి పూర్తి చేయవలెనన్నారు. రాజ్యాంగ నిర్దేశాన్ని వదిలివేశాం. 73, 74 లో 43 లక్షలు 1–5 తరగతులలో చదువుతుంటే 76 శాతంకు మాత్రమే ఇది అన్వయించింది. అంటే యింకా 24 శాతం నాలవవంతు సౌకర్యాలు కలిగించాలి. 6–8 తరగతులలో 30 శాతమే చదువుతున్నారు. ఈ మాత్రం కూడా సాధించలేకపోతే యేమయేటట్లు?

విద్యుచ్ఛక్తికి ఐదవ ప్లానులో ప్రాధాన్యత ఇవ్వకపోతే అటు పరిశ్రమలు లేవు. వ్యవసాయంలోను అభివృద్ధి సాగజాలదు. విద్యుచ్ఛక్తికి ఆంధ్రప్రదేశ్ ప్లానులో అత్యధిక ప్రాధాన్యత వచ్చి అమలు జరిగితేనేగాని అటు వ్యవసాయంగాని, ముఖ్యంగా పరిశ్రమలు గాని మనజాలవు. సీలేరు ప్రాజక్టు, రామగుండం, కొత్తగూడెం పూర్తి చేయడం సోమశిల అణువిద్యుచ్ఛక్తి పథకం సాధించడం జరగాలి. అందుకు కేంద్రం ఆదుకోవాలి. ఇప్పటికీ నడుస్తున్న నాగార్జున సాగర్, పోచంపాడు, తుంగభద్ర ఎగువకాల్వ, వంశధార నీటి పారుదల ప్రాజెక్టులు సగంలో మిగిలిపోయే విధానం లాభంలేదు. కృష్ణ, గోదావరి వివాదం ఏవిధంగా పరిష్కారం అవుతుందో ఆందోళనగానే ఉంది. ఏమైనా గోదావరి, పోలవరం బారేజీ స్కీము, సోమశిల స్కీములు ఈ ప్రణాళికలో చేరవలసి ఉంది.

అయిదవ ప్రణాళిక ఆంధ్రప్రదేశ్ ప్రజల జీవితవిధాన నిర్ణయంలో చాలా ప్రధానపాత్ర వహించ నున్నది. ఇందులో కేంద్రం తయారుగా అమలు జరిపే ప్రాజక్టులు, తమ సూచనచేసి(స్పాన్సర్) రాష్ట్రం అమలు జరిపే ప్రాజెక్టులు వీటి అన్నింటిని ఆంధ్రప్రజలు తమ దృష్టి ఈ నిర్మాణ కార్యక్రమాల మీద కేంద్రీకరించి కేంద్రం పైన ఆందోళన తెచ్చి సాధించకపోతే ఇంతవరకు వలెనే అయిదవ ప్రణాళికలో కూడా వెనుకపడి పోవడమే జరుగుతుంది. రాష్ట్ర ప్రభుత్వం 1,277 కోట్ల రూపాయల ప్రాజెక్టులు సూచన చేసింది. అప్పటికి ప్రజాప్రభుత్వం లేని లోటు కనిపించుతునే ఉంది.

కేంద్రం 1,100 కోట్ల రూపాయల ప్లానును మాత్రమే అంగీకరించనున్నదని అదే రాష్ట్ర ప్రభుత్వం తమ ద్రవ్యవనరులకు కనీసం 200 కోట్లకు పైగా సమకూర్చితేనే అని, అది సాధ్యం కాకపోతే 1,277 కోట్ల ప్లాను లేదు సరికదా 1,100 కోట్లకు కూడా తగ్గి

పోయి తీరుతుందని అన్నారు, అసలు ఈ 1200 కోట్లు గానీయండి లేక 1100 కోట్లు కానీయండి నాల్గవ ప్రణాళిక వ్యయానికి రెట్టింపు అనే సిద్ధాంతమే మూల సూత్రంగా తీసుకొంటే నాల్గవ ప్రణాళిక లోని 427.49 కోట్లు. ఈ నాటి ధరల ప్రకారం చూస్తే 1200 లేక 1100 సమానమే అవుతవని తేలుతుంది. 11-7-73న లోకసభలో విత్తమంత్రి (ఆర్థిక మంత్రి) 1960-61లో 100 గా ఉన్న రూపాయి విలువ 1962-63 లో 95-59 గా తగ్గిపోయిందని, అదే రూపాయి 1972-73 లో 48.31కి తగ్గిపోయిందని చేసిన ప్రకటన 1200-1100 కోట్ల అంచనా సగానికి సరితూగుతుందని తేలుతున్నది. అందుచే అవసరాలు ఆలోచించినా, నాటి, నేటి ధరలు అంచనా వేసినా ఆంధ్రప్రదేశ్ పంచవర్ష ప్రణాళిక విధిగా కనీసం 2000 కోట్ల వ్యయంగా ఉండేటట్లయినా ఉండాలి. ఆంధ్రప్రదేశ్‌లోని తెలంగాణా, రాయల సీమ, సర్కారులలోని వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి నీటిపారుదల గల డెల్టాలో ఆర్థికాభివృద్ధి ముఖ్యంగా డెల్టాలో మురిగి కాల్వల సమస్య పరిష్కారం కానిదే అధికోత్పత్తి పురోగమింప జాలదు. అందుచే 2000 కాకుండా 1200-1100 కోట్ల ప్రణాళిక అయితే 525 కోట్లు ఉండనే ఉంటుందన్నమాట.

ఈ అవధులన్నీ గమనించి, అవధిలేకుండా ఆకాశాన్ని అందుకుంటున్న ధరలు, అంతూ పొంతూ లేకుండా పెరిగిపోతున్న నిరుద్యోగం, అందు విద్యావంతులలో, విద్యార్థులలో-చదువుకున్న వారిలో నిరుద్యోగం వీటి అన్నింటి ప్రభావం సమాజం మీద ప్రభావితం అయినపుడు రానున్న ప్రమాదం పరిణామాలకు దారి తీయకుండా ఉండేందుకు ముందే జాగ్రత్త పడడానికి కనీసం ఆంధ్రప్రదేశ్‌లో ఐదవప్లాను 2,000 కోట్లకు పెంచకపోతే గరీబీ హటావో, గరీబీ బిఠావో అయిపోవడం సహజం. ఈ ప్రమాదాన్నుండి రాష్ట్రాన్ని రక్షించటం, అనుకున్న ప్లాను వ్యయం అడిగే ప్రజలకు నిజమగు ఉత్పత్తి కార్యక్రమాలను పెంచకపోతే గరీబీ హటావో, గరీబీబిఠావో అవుతుంది. ప్రపంచబ్యాంకు అధ్యక్షులు శ్రీ మెక్‌నమారాతమ వార్షిక నివేదిక సమర్పిస్తూ 1973 సెప్టెంబరు 24వ తేదీన అభివృద్ధి దేశాలలో జాతీయ సంపదపై వర్గాలకు చెందిన 40 శాతముకు 75 శాతం పోతున్నదని మరి కింది వర్గాలకు చెందిన 40 శాతానికి ఏమందుతుందో? అన్నారు. ఇది మనస్సులో వుంచుకోవలసివుంది.

ఆంధ్రప్రదేశ్ సమస్యల పరిష్కారం విషయంలో ఆరు సూత్రాల పథకం సందర్భంగా భారత ప్రధాని ఇందిరాగాంధీ ఉదారంగా విరాళాలు యిస్తానని నమ్మబలికినట్లు మన నాయకులు ప్రకటిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్‌కు అభివృద్ధి మండలి యేర్పరచవలెనని దానికి 200కోట్ల శాశ్వతనిధి యేర్పరచి ఖర్చుఅయినపుడల్లా-దానిని భర్తీ చేస్తుండవలెనని ఇదివరలో కోరడం జరిగింది. ఆమె వాగ్దానము చేసిన విరాళాలు, వీరు కోరిన 200 కోట్లు ఈ పైన ఉదహరించిన ప్లానులోనే కలిసివున్నవనే ప్రమాదం రాకుండా చూచుకోవలసివుంది.

ఆంధ్రప్రదేశ్ అభ్యుదయానికి ఇదివరకెన్నడూ లేనంత ఆశాజనకంగా కేంద్రం ఈ ఐదవ ప్రణాళికలో ఉపాధి కల్పన, పరిశ్రమల స్థాపన జరపకపోతే ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ పథకంలోకి పోవడం ఆశగానే మిగిలిపోవలసి వస్తుంది. ఈ ప్రమాదం నుండి బయటపడవలసివుంది. ఈప్లాను సమయం యెంతవచ్చినా పై పై వర్గాల వారికి పోయే దుర్దశవస్తే ఆంధ్రప్రదేశ్‌లో వున్న 40 శాతం బీదవర్గాల గతియేమి కానున్నట్లు? ఈ 40 శాతం బీదరికాన్ని తొలగించడమే భారతదేశపు ఐదవ ప్రణాళికధ్యేయమని ప్రణాళికా వైఖరిలో విశదీకరించిన విషయం అందరికీ తెలిసిందేకదా. అందుచే జరగబోయే వ్యయం శ్రీ మెక్‌నమారా చెప్పే 40 శాతం వారికి 75 శాతం పోకుండా జాగ్రత్తపడాలి. క్రింది వర్గాలకుపయోగపడేటట్లు చేయాలి. అందుకు ప్రభుత్వంపూనుకునేటట్లు చేయాలి. ఆంధ్రప్రదేశ్ సస్యశ్యామల యగుఅన్నపూర్ణగా మాత్రమేగాక, సిరిసంపదలతో తులతూగే రత్నగర్భగా వెలయవలసివుంది. ఇందుకు తగిన పట్టుదల, కార్యదీక్ష నిర్మాణాత్మక ప్రవృత్తితో ప్రజాఉద్యమాల స్వరూపంలో ఆంధ్రప్రజానీకం కదలాలి-కదిలి సాధించాలి.

సీమ సర్కారు మన్యం నిజాము వలస
దాస్యకృత తారతమ్యాల తత్వమెరిగి
ఐదుకోటుల ఆంధ్రులు అనుదినంబు
కలిసిమెలసి నడువకున్న కలదె ముక్తి॥

## ప్రజాస్వామ్యం

మనం ఆకాంక్షించే మన స్వాతంత్ర్య రక్షణ, సాంఘికాభివృద్ధి సంతట మనం నిర్మించుకున్న ప్రజాస్వామ్య వ్యవస్థలోనే సాధించగలమని మన ఉద్దేశ్యము. పార్లమెంటరీ ప్రజాతంత్రాన్నే మనం ఎందుకు ఎంచుకున్నాం? భవిష్యత్తులో ఉత్తమ ఫలితాలను ఇవ్వగలదని మనం అనుకున్నాం కాబట్టి. అయితే మనం ఆశించిన ఆ ఉత్తమ ఫలితాలు ఏమిటి? అవి మన లక్షోప లక్షల ప్రజల సంక్షేమం, వారి ఆనందం.

—నెహ్రూ

# "గాంధీవనం"—పెదపాడు ఉత్పత్తి పథకం

శ్రీ సిద్దాని నాగభూషణం

"పేదప్రజలు అనుకొనే స్వరాజ్యమే నేను అనుకొనే నిజమైన స్వాతంత్ర్యం. ఆకాశాన్నంటే మేడలలో నివసించే ధనికులకు కావలసిన జీవితావసరాలు–పేద ప్రజల జీవితావసరాలు ఒక్కటే. అంటే మేడలు, భవనాలు, పేద ప్రజలకు ఉండాలని కాదు. మానవ జీవిత సౌఖ్యానికి కేవలం అవే సాధనాలు కూడా కాదు. పేదవారికి వాటి అవసరమే లేదు. కాని ధనికుడు అనుభవించే ప్రతీ జీవితావసరం సామాన్య ప్రజానీకం అనుభవించాలి. కనీససౌకర్యాలు హామీలేకుండా అనుభవించే స్వాతంత్ర్యం సంపూర్ణ స్వరాజ్యం కాదని నా అభిప్రాయం"–అన్నారు పూజ్య బాపూజీ. గాంధీజీ కలలుగన్న ఈ గ్రామరాజ్యం సాధన కోసం పంచాయతీ రాజ్యం స్థాపించబడింది. ఈ పంచాయతీరాజ్యం వల్ల గ్రామాలలో కొన్ని కనీస సౌకర్యాలు ఏర్పాటు చేయబడినాయి. కాని అన్ని పంచాయతీలు పౌర సౌకర్యాలను ఏర్పాటుచేశాయని అనటానికి వీలు లేదు. పశ్చిమగోదావరి జిల్లాలోవున్న గ్రామపంచాయతీల పరిస్థితి కూడా అంతే. నిర్మాణపు పనులలో మేటి నిపుణుడు అయిన సర్ ఆర్థర్ కాటన్ మహాశయుడు గౌతమీ నదిపై ధవళేశ్వరం వద్ద నిర్మించిన ఆనకట్ట కారణంగా డెల్టా ప్రాంతం పచ్చని పొలాలతో పసిడి పంటలతో కలకలలాడుతూంది. కాని మెట్టప్రాంతమైన ఏలూరు తాలూకా మొదలైనవాటి పరిస్థితి దానికి పూర్తిగా విరుద్ధం. ఈ తాలూకాలో కనుచూపుమేరలో పచ్చతనానికి నోచుకోలేని ప్రదేశాలుకూడా వున్నాయి.

## గ్రామపంచాయతీల ఆదాయం

పంటలు పుష్కలంగా పండేచోట గ్రామపంచాయతీల ఆదాయం కూడా బాగానే ఉంటుంది. కారణం ఆ భూముల విలువ ఎక్కువ. వాటిపై సెస్సుల విధింపు, వాటి మార్పిడికివచ్చే స్టాంపు డ్యూటీ కూడా ఉంటుంది. వాటిలో వాటా పంచాయతీకే వస్తున్నది. ఆ ఆదాయంతో కార్యక్రమాల్ని పంచాయతీలు నిర్వహించుకొనవచ్చును. కాని సిబ్బంది జీత భత్యాలకు ఎక్కువ ఖర్చుపెట్టడం వల్ల పంచాయతీలు అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టడానికి చాలినన్ని నిధులు ఉండటంలేదు. పంచాయతీరాజ్యం అవతరణ తొలిరోజుల్లో ప్రభుత్వం పంచాయతీలకు ఆర్థిక సహాయం ఉదారంగా భారీ ఎత్తున చేస్తుండేది. కాని ప్రభుత్వం, ఆర్థిక పరిస్థితి అంతంత మాత్రంగా ఉండటంవల్ల పంచాయతీలకు చేయవలసిన ఆర్థిక సహాయంచేయలేకపోతున్నది. పంచాయతీలు పన్నులు పెంచటంవల్ల గ్రామ ప్రజలకు వాటి చెల్లింపు తలకుమించిన భారమవుతుంది. పన్నులు పెంచుదామన్నా వీలులేని పరిస్థితి ఈనాడు ఏర్పడింది. 500 రూపాయలు విలువగలిగిన ఇళ్ళకు పన్నుచెల్లింపు మినహాయింపు ఉత్తర్వు ప్రభుత్వం యిచ్చింది. తత్ఫలితంగా పంచాయతీలకు రావలసిన ఆదాయంకూడా తగ్గిపోయింది. ప్రభుత్వం చైతన్యవంతమైన భూసంస్కరణలు అమలుపరచటానికిగాను "భూముల మార్పిడిని" నిలుపుదల చేసింది. ఈ భూముల మార్పిడివల్ల వచ్చే స్టాంపు డ్యూటీ పంచాయతీలకు రావటం తగ్గిపోయింది. పంచాయతీల పరిస్థితి నానాటికి దిగజారి పోతున్నది. పౌర సౌకర్యాలు కల్పించలేకపోతున్నాయి. మంచినీటి బావులు ఎండిపోతున్నా రహదారులస్థితి అధ్వాన్నమైనా–మురుగుకూపాలుగా గ్రామాలు తయారయినా ఏంచేయలేని నిస్సహాయ స్థితిలోవున్నాయి యీ గ్రామ పంచాయతీ . సంస్థ అయినా సమర్థవంతంగా, పటిష్టంగా పనిచేయాలంటే ఆ సంస్థ ఆర్థికంగా పరిపుష్టి పొందాలి. ఎప్పుడూ ఏ సంస్థా ఒక వ్యక్తి మీదగాని, ప్రభుత్వంపైగాని ఆధారపడి వున్నంత కాలం అవి అనేక యిబ్బందులకు గురికావలసిఉంటుంది. అందుచే గాంధీజీ "స్వయం చలో పంచాయతీలు" కావాలని అంటూండేవారు. ఉన్న పంచాయతీలను ఆ విధంగా ఎప్పుడు రూపొందించగలం? గ్రామంలోపంచాయతీ పరంగాఉన్న ఆస్తులను పూర్తిగా వినియోగించి సంస్థను పటిష్టంచేయాలి. నిర్వీర్యంగా, నిర్జీవంగా ఉన్న పంచాయతీలనుపునరుజ్జీవం చేయాలి. ఆనాడే గ్రామీణ భారతావనికి భాగ్యోదయం.

## జిల్లా అభివృద్ధి మండలి

1967వ సంవత్సరంలో ఏర్పాటుచేయబడిన జిల్లా అభివృద్ధి మండలి కొన్ని కార్యక్రమాలను చేపట్టి నిర్వహించింది. ముఖ్యంగా తూర్పుగోదావరి జిల్లాలో "రంగుల చెరువు" ప్రాంతాన్ని బాగుచేసి "సుందర వనం"గా రూపొందించడమేగాక పంచాయతీలకు ఆదాయం వచ్చే ఒక ఉమ్మడి ఆస్తిగా రూపకల్పన చేసింది. ఈ పథకం అమలు పరచటం ద్వారా సంపాదించిన అనుభవాన్ని వినియోగించి పశ్చిమ గోదావరి జిల్లాలో "పెదపాడు చెరువు" అభివృద్ధి పథకాల్ని చేపట్టడం జరిగింది.



పెదపాడు చెరువు పునరుద్ధరణ : త్రవ్వకం పనులు జరుగుతున్నదృశ్యం

## కొత్త చెరువు

పశ్చిమ గోదావరి జిల్లా కేంద్రమైన ఏలూరుకు 18 కిలోమీటర్ల దూరంలోవున్న పెద్దపాడుసమితికేంద్రమైనపెద్దపాడులో ఒక చెరువు వుంది. ఆచెరువు పేరు బ్రాహ్మణచెరువు. విస్తీర్ణం 92.13 ఎకరాలు.ఆ చెరువులో 10.41 ఎకరాల భూమిని పశ్చిమ గోదావరి జిల్లా ఉన్నత పాఠశాలకు కేటాయించడమైనది. రాజకీయ బాధితులు పట్టాపొంది 32.53 ఎకరాలు సేద్యం చేసుకొంటున్నారు. రజకుల చెరువుగా 7.48 ఎకరాల భూమి కేటాయించడమైనది. ప్రభుత్వపరంగా నిరుప యోగంగా 1.22 ఎకరాల భూమి ఉన్నట్లు ప్రభుత్వం రెక్కార్డుల్లో నమోదు అయింది. మొత్తం భూమి 51.63 ఎకరాలు పోను 39.46 ఎకరాలు చెరువుగర్భం ఎందుకూ పనికిరాకుండా పడివుంది. చెరువులో నీరుపెట్టటానికి 1.04 ఎకరాలు వదిలివేయ బడినాయి. 39.46ఎకరాల విస్తీర్ణం కలిగిన చెరువు "కొత్త చెరువు" అనే పేరుతో వాడుకలో వుంది.

పేరుకు ఈ చెరువు "కొత్త చెరువు" కాని ఈ చెరువు పాత బడి పోయింది. దోమలకు ఆలవాలమయింది. నాచు, డెక్క, ఈ చెరువుకు అలంకార ప్రాయాలు. దుర్గంధ భూయిష్టమై రోగాలకు పుట్టినిల్లుగా మారిన ఈ చెరువు పెదపాడు పంచాయతీ అధీనంలో వుంది. ఈ చెరువు వల్ల ఆదాయం కూడా పంచాయతీకి అంతగా రావడం లేదని లెక్కలవల్ల తెలుస్తోంది. చేపల పెంపకంవల్ల 1966 సంవత్సరంలో 1400 రూపాయలు, 1967వ సంవత్సరంలో 1,000 రూపాయలు, 1968వ సంవత్సరంలో 2,100 రూపాయలు, 1969వ సంవత్సరంలో 1500 రూపాయలు, 1970వ సంవత్సరంలో 1,210 రూపాయలు ఆదాయం ఈ చెరువువల్ల ఆ పంచాయతీకి వచ్చింది. జమ్ము అమ్మకంవల్ల 1966వ సంవత్సరం నుంచి 455 రూపాయలు, తామర పువ్వుల అమ్మకంవల్ల 668 రూపాయలు ఆదాయం వచ్చింది. మొత్తం గత ఐదేళ్ళలో 8,253 రూపాయలు చెరువువల్ల ఆదాయం లభించింది ఈ పెదపాడు గ్రామపంచాయతీకి.

నిరుపయోగంగా పడివున్న ఈ చెరువు పరిస్థితి జిల్లా అభివృద్ధి దృష్టికి వచ్చింది. పశ్చిమ గోదావరిజిల్లా అభివృద్ధి మండలి ఒక పథకాన్ని రూపొందించింది. ఈ పథకం క్రింద కొత్తచెరువు ప్రాంతాన్ని చేపల పెంపకం, కొబ్బరిమొక్కల పెంపకం, కూరగాయలు, మేలురకం పశువులగడ్డి పెంపకం చేపట్టడం జరిగింది. ఈ చెరువు పథకం క్రింద మేటబడిన చెరువులో మట్టిని తీసివేసి 40 అడుగుల వెడల్పాటి గట్లను ఏర్పరచటం, చేపల పెంపకానికి అనువుగా నాలుగు సామాజిక చెరువులుగా ఏర్పటు చేయటం, ఈ పథకం అమలుపరుస్తున్న ప్రాంతంలోచుట్టూరా రహదారులను ఏర్పాటు చేయటం, విహారయాత్రాకేంద్రంగా ఈ ప్రాంతాన్ని రూపొందించటం ముఖ్యమైన కార్యక్రమాలు.

జిల్లా కలెక్టరు జిల్లా అధికారులు సమావేశం ఏర్పాటుచేసి ఈ పథకాన్ని ఏవిధంగా అమలుపరుస్తే బాగుంటుందో చర్చించారు. ఈ పథకానికి పెట్టుబడిపెట్టే విషయం కూడా నిర్ణయించబడింది. ఈ పథకానికి మూడు పంచాయతీ రాజ్య సంస్థలు పెట్టుబడి పెడితే బాగుంటుందని నిర్ణయించబడింది. కారణం ప్రభుత్వం నుంచి ఏవిధమైన ఆర్థిక సహాయం పొందే అవకాశం లేదుగనుక మొదట్లో ఈ పథకానికి కాపలాదారునికి ఉండటానికి కావలసిన యిల్లుకయ్యే ఖర్చు, మత్స్య పరిశ్రమల శాఖాధికారి కార్యలయానికి అయ్యే ఖర్చు, మినహా లక్ష రూపాయలని అంచనా వేయబడింది. పశ్చిమ గోదావరి జిల్లా పరిషత్తు 25,000 రూపాయలు, పెట్టుబడి పెడితే, పెదపాడు సమితి 25,000 రూపాయలు పెదపాడు సమితిలోని పంచాయతీలు 50,000 ల రూపాయలు పెట్టుబడిపెడతాయి.

పంచాయతీల వాటాను జిల్లా పంచాయతీ ఆఫీసరు వసూలు చేసి జమకట్టడం జరిగింది. పెదపాడు బి.డి ఓ. పెదపాడు సమితి వాటాను ఇచ్చారు. ఇచ్చటి జిల్లాపరిషత్తు కూడా పెట్టుబడి ఇచ్చింది. ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు ఈ పథకానికి అనుమతి సూచకంగా పథకాన్ని తయారు చేశారు.

## "ముమ్మర కార్యక్రమ" పథకం

ఈ పథకం అనుకొన్న దానికంటే బృహత్తరమైన పథకంగా రూపొందించ బడుతూంది. ఈ పథకంలో మొదట్లో మట్టి త్రవ్వకం పనులు ప్రారంభించబడాయి. ఈ పథకం పనులు



ఎండిపోయిన చెరువులో పశువులుమేస్తున్న దృశ్యం

చురుకుగా సాగుతున్నప్పుడు ధనాభావం వల్ల పనులు ఆగిపోతాయేమో ననే భయం ఉండేది. అదే సమయంలో భారత ప్రభుత్వం ఒక పథకాన్ని రూపొందించి అమలుపరచమని జిల్లాకలెక్టరుకు నిధులు అందజేసింది. ఈ పథకమే "ముమ్మర కార్యక్రమ పథకం". ఈ ముమ్మర కార్యక్రమం క్రింద ఉత్పత్తిని పెంచే పథకాలను గ్రామాల్లో అమలు పరచాలి. అమలుపరచే పథకాలు జిల్లా ప్రణాళికతో లయబద్ధం కావాలి. ఈ పథకం అమలుపరచటం ద్వారా ప్రభుత్వ పరంగా ఆదాయం యిచ్చే వనరులు కల్పించబడాలి. ఈ పథకం క్రింద "పనులు" అమలు చేయటానికి కావలసిన సాధన సామగ్రికి కూడా నిధులు కేటాయించబడతాయి. ఈ ముమ్మర కార్యక్రమం జిల్లాలో 1000 మందికి పనులు కల్పించేవిగా వుండాలి. బ్లాకులను బట్టి ఇంకా ఎక్కువ మందికి పనులు కల్పించవచ్చు. కుటుంబంలో ఏ ఒక్కరికీ ఉద్యోగ ఉపాధులు లేకపోతే ఈ పథకం ఉపాధి పనులు కల్పిస్తుంది. "బృహత్తర పథకం (Master Plan)" అధ్వర్యంలో గ్రామీణ రహదారుల పనులు, భూమి మరమ్మత్తులు, పంచాయతీ స్థలాల అభివృద్ధి, మురుగునీటి పారుదల, గట్లను అభివృద్ధి పరచటం, భూగర్భ జలాల వినియోగపు పనులు, మంచినీటి కార్యక్రమం—నీటిని నిలువజేసే చిన్నతరహా సేద్యపనరుల నిర్మాణపు పనులు, పునరుద్ధరణ కార్యక్రమాలు, భూసార పరిరక్షణకు సంబంధించిన పనులు—వన సంపద పెంపొందించే పనులు ఈ ముమ్మర కార్యక్రమం క్రింద చేపట్టదానికి వీలుఅయ్యే పనులు. ఈ ముమ్మర కార్యక్రమానికి సంబంధించిన నిధులు జిల్లా కలెక్టర్ ఖర్చుచేయమని ప్రభుత్వం ఉత్తర్వులు జారీచేసింది.

పెదపాడు ఉత్పత్తి పథకం పని 1972 జనవరి 6వ తారీఖున ప్రారంభించబడింది. మట్టిపనులు ముందుగా చేపట్టడం జరిగింది. నిధుల కొరత ఏర్పడుతుందన్నప్పుడు అదనపు ఆర్థిక సహాయం కోసం జిల్లా కలెక్టరును కోరడమయింది. ఈ పథకం ధ్యేయం భారత ప్రభుత్వం అమలు జరుపనున్న ముమ్మర కార్యక్రమం క్రింద నిర్వహించబడిన పనుల ధ్యేయం ఒక్కటే. ఈ కారణంగా జిల్లా కలెక్టరు యోచించి ముమ్మర కార్యక్రమం నిధులనుంచి లక్ష రూపాయలను కేటాయించారు.

## పథకం నిర్వహణ

పెదపాడు ఉత్పత్తి పథకం అమలుపరచటానికి ఒక సంఘం (కమిటీ) ఏర్పాటు చేయబడింది. జిల్లా పరిషత్తు అధ్యక్షులు, జిల్లా అభివృద్ధి మండలి అధ్యక్షులు, జిల్లా కలెక్టరు అజమాయిషీలో పశ్చిమ గోదావరి జిల్లాకు చెందిన వివిధ అధికార్లు జిల్లా పరిషత్తు కార్యదర్శి, సాంద్ర వ్యవసాయ పథకం ప్రాజెక్టు ఆఫీసరు, జిల్లా పంచాయతీ ఆఫీసరు, జిల్లా వ్యవసాయ శాఖాధికారి, మత్స్య శాఖ సహాయ సంచారకులు, జిల్లా పశు సంవర్ధక శాఖాధికారి, ఏలూరు రెవిన్యూ డివిజినల్ ఆఫీసరు, పెదపాడు సమితి అధ్యక్షులు, పెదపాడు మండలి వికాసాధికారి, సంఘ సభ్యులుగా వ్యవహరిస్తూ ఈ పథకాన్ని అమలు పరుస్తారు. ఎప్పటికప్పుడు ఈ పథకం అమలులో నిర్వహణలో సాధించిన ప్రగతి విషయమై జిల్లా పరిషత్తు ఒకటవ స్థాయీ సంఘంలో సమీక్షిస్తుంది. పంచాయతీ రాజ్య సంస్థలకు ఈ పథకం ప్రయోగాత్మకమైనదిగా ఉపయోగపడుతుంది కనుక జిల్లా కలెక్టర్, జిల్లా పరిషత్తు అధ్యక్షులు అజమాయిషీలో ఈ పథకం పెట్టబడింది.

పెదపాడు ఉత్పత్తి పథకం పనులు చురుకుగా సాగిపోయాయి. చెరువును అయిదు చెరువులుగా మార్చటం జరిగింది. గట్లనుపోసి గట్లను కట్టుదిట్టం కూడా చేయడమైనది. ఇప్పుడు చెరువు గర్భాలు 22 ఎకరాల 20 సెంట్ల భూమి. ఈ పథకంలో ఉన్న చెరువులలో నీరుపెట్టడానికి ఒక కాలువ త్రవ్వించ బడింది. దాని విస్తీర్ణం ఒక ఎకరం 87 సెంట్లు. ఏర్పాటుచేసిన చెరువు గట్ల విస్తీర్ణం 12 ఎకరాల 35 సెంట్లు. ఈ చెరువు గట్లపై 1972 సంవత్సరం జూలై ఒకటవ తేదీన 650 కొబ్బరి మొక్కలు నాటబడ్డాయి. ఒక సంవత్సరం వయస్సు కలిగిన 2000 కొబ్బరి మొక్కలు వేయబడ్డాయి. 2 లక్షల 40 వేల మేలు రకం పచ్చగడ్డి మొక్కలు 4 ఎకరాల 29 సెంట్ల భూమిలో నాటడం జరిగింది. వాస్తవంగా చూస్తే ఈ పథకం ప్రాజెక్టులోవున్న ప్రతి అంగుళం భూమి వినియోగంలోకి తీసుకొనిరాబడింది.

ఒకనాడు అందవిహీనముగావున్న చెరువు ఈ నాడు నిండు జవ్వనిలా సర్వాంగ సుందరంగా శోభిల్లుతుంది. ప్రకృతి సౌందర్యం ఒక చోట ప్రోగుచేసినట్లుగా వుంటుంది—ఎదుగుతున్న కొబ్బరిచెట్లు ఈ ప్రాంతాన్ని రమణీయమైన ఒక విహారయాత్రా కేంద్రంగా మార్చివేశాయి. ప్రాజెక్టు ప్రాంతంలో నీరును ఏర్పాటుచేసి ప్రతిరోజు కాని, వారానికి రెండు మూడు రోజులుగాని విహారానికి చోటును ప్రవేశ పెట్టడానికి యోచింప బదుతూంది. ప్రకృతి సౌందర్యానికి కరువైన ఏలూరు ప్రజలకు సుందర ప్రకృతిని ప్రసాదించే పథకం యిది.

## లాభాలు

పెదపాడు ఉత్పత్తి పథకం అమలు పరచిన సంవత్సరం తిరుగకముందే 1972-73 సంవత్సరంలో చేపలవల్ల ఆదాయం లభిస్తుంది. చేపల అమ్మకం, కూరగాయలు పెంపకానికి చెరువు గట్లను కౌలుకు యివ్వడంవల్ల 20,000 రూపాయలు ఆదాయం ఉంటుందని అంచనా. ఈ పథకం నిర్వహణ సాలీనా కొంత ఖర్చు అవుతుంది. ఈ పథకానికి లభించే ఆదాయం నుంచి ఈ ఖర్చులు తీసివేయగా వచ్చిన సొమ్మును నికర లాభంగా లెక్కకట్టడం జరుగుతుంది. భవిష్యత్తులో ఈ పథకం విస్తృత పరచటానికి కొంతసొమ్ము అధికలాభంనుంచి కేటాయించి, మిగిలిన సొమ్మును పెట్టుబడి పెట్టిన పంచాయతీ సమితికి, పంచాయతీలకు, జిల్లా పరిషత్తుకు పెట్టుబడి పెట్టిన నిష్పత్తిలో పంచటం జరుగుతుంది.

# అయిదవ ప్రణాళికలో

## వ్యవసాయము : ఆహారము : జీవనోపాధి

డాక్టర్ బి. ఆర్. కె. రావు

పొరుగునవున్న బలీయమైన దేశాలనుండి ప్రాదేశిక సమగ్రతను కాపాడుకోవడానికి, పౌరులకు సుఖసౌఖ్యాలు లభ్యం కావడానికి, అన్ని దేశాల విషయంలో లాగే భారతదేశానికి సహితం ఆర్థికాభివృద్ధి అవసరం. ఆర్థిక రంగంలోని వివిధ భాగాలలో వృద్ధి పెరగడము. ప్రజలలో ఆర్థిక సమానత్వం పెరిగి, ఆర్థిక సంతృప్తి, తద్వారా ఆర్థికకల్యాణం సంప్రాప్తంకావడము యిందుకు కావలసిన లక్షణాలు. ఇందుకుగాను పేదరికాన్ని పారద్రోలాలనే లక్ష్యంతో, భారతదేశం, ప్రణాళికా యుక్తంగా ఆర్థికాభివృద్ధికి పూనుకుంది. ప్రయివేటు, ప్రభుత్వ రంగాలు రెండూ సహకారంతో, లాభదాయకంగా పనిచేయడము, పౌరులు త్యాగాలకు తలపడడము, కష్టించి పనిచేయడము, అన్ని ఆర్థిక విభాగాలలోను వుత్పత్తి పెరగడము, ముఖ్యంగా ప్రాథమిక అవసరాలను తీర్చగల్గే ఆహార వస్త్రాదుల ఉత్పత్తి త్వరితంగా వృద్ధిచెందడము, వైద్య, విద్యా గృహ సౌకర్యాలు విస్తరించడము అవశ్యము. అయితే వీటన్నిటి అభివృద్ధి కూడా వ్యవసాయోత్పత్తుల పెరుగుదలపైన, ముఖ్యంగా ఆహార పదార్థాల వృద్ధిరేటు పెరుగుతూ పోవడంపైన ఆధారపడివుంటుంది. తత్కారణంగానే ప్రణాళికాయుక్త ఆర్థిక విధానం, ముఖ్యంగా ప్రథమ, పంచమ పంచవర్ష ప్రణాళికలు ఆహారోత్పత్తికి అధిక ప్రాధాన్యత నిచ్చినవి.

*ఆహారం అందించడం ద్వారా సైనికుల రక్షణ శక్తిని,* ప్రజాస్వామికం వైపుకు పౌరుల మొగ్గులను వ్యవసాయం బలపరుస్తుంది. పరిశ్రమల నిర్వహణకు ముడిపదార్థాలను అందిస్తుంది. వివిధ ఆర్థిక కార్యకలాపాలలో పనిజేసే శ్రామికులను సంతృప్తికరంగా కౌశల్యవంతంగా పనిచేయించి, అధికోత్పత్తి సాధనకు తోడ్పడుతుంది. విదేశాలనుండి ఆహార పదార్థాలు దిగుమతి చేసికొనే అవసరాన్ని తొలగించి విదేశ మారకద్రవ్యపు పోగోలును బాగా తగ్గించి, అంతర్జాతీయ వ్యాపార రంగంలో వ్యాపార సమతులనాన్ని, (Balance of Trade) విదేశవ్యాపార చెల్లింపుల శేషాన్ని (Balance of payments) మన కనుకూలంగా వుండేటట్లు చేస్తుంది. ఇప్పటికీ దేశప్రజల్లో మూడింట రెండువంతులు వ్యవసాయముపైనే ఆధారపడివున్న కారణంగా వ్యవసాయాభివృద్ధి జరిగితే దాదాపు 65% ప్రజల ఆదాయాలు తద్వారా నిల్వలుపెరిగి, పెట్టుబడి ఏర్పాటు బాగా జరిగి ఆర్థికాభివృద్ధికి తోడ్పాటు జరుగుతుంది. ఆర్థికాభివృద్ధికి జాతీయాదాయం, తలసరి ఆదాయం పెరుగుదల స్పష్టమైన చిహ్నమైనప్పుడు వ్యవసాయ రంగాభివృద్ధివల్ల 65% ప్రజల ఆదాయాలు పెరగడంవల్ల జాతీయాదాయం పెరిగి ఆర్థికాభివృద్ధికి తోడ్పడుతున్నట్లు స్పష్టమౌతుంది. అయితే యీ నాటికీ మన జాతీయాదాయంలో సగభాగం వ్యవసాయ రంగంవల్లనే సృష్టించబడుతున్నందువల్ల, పారిశ్రామిక ప్రగతి తగినంతగా యింకా జరగకుండా వున్నందువల్ల, వ్యవసాయాభివృద్ధి, అనగా పాడిపంటల అభివృద్ధి ద్వారా జాతీయాదాయాన్ని పెంపొందించడం తప్పనిసరి అవుతుంది. పౌష్టికాహారాన్ని సరఫరా చేయడం ద్వారా, వ్యవసాయం, మన భుజబలాన్ని, మేధాశక్తిని పెంపొందించి, దేశాభ్యుదయ ఆర్థిక, వైజ్ఞానిక కార్యక్రమాల్లో మానవ అంగబలము(Man-Power )తగిన రీతిలో పాల్గొని వాటిని జయప్రదం చేయడానికి తోడ్పడేటట్లు దోహదం చేస్తుంది. వ్యవసాయాదాయాలు పెరిగితే, పారిశ్రామిక వస్తువుల కొనుగోలు పెరిగి, ఆర్థిక కార్యకలాపాభివృద్ధి ధారావాహికంగా ముందంజ వేస్తుంది.

### అయిదవ ప్రణాళిక

అయిదవ పంచవర్ష ప్రణాళిక బీదరికాన్ని తొలగించివేయడాన్ని, స్వయం నిర్భరతను సమకూర్చడాన్ని ఆశయాలుగా పెట్టుకుంది. అందుకుగాను సోషలిస్టు సమాజ నిర్మాణంతో పురోగమిస్తూ ప్రజాస్వామిక రాజకీయ వ్యవస్థ సుస్థిరత్వాన్ని, ఆర్థిక శక్తి కేంద్రీకరణ నివారణను, ఆస్తి ఆదాయాలలోని అసమానత్వాల తగ్గుదలను, ప్రాంతీయాభివృద్ధిలో సమతులనాన్ని, స్వేచ్ఛా న్యాయాలుగల సమాజపు సంస్థలను, విలువలను, ప్రవృత్తులను లేక వైఖరులను విస్తరింపజేయడాన్ని సాధించడానికి అయిదవ పంచవర్ష ప్రణాళిక 1974 ఏప్రిల్ ఒకటవ తేదీనుండి అమలు జరుపబడబోతోంది. ముందంజ వేస్తూ వృద్ధిచెందే ప్రజాస్వామికము, సమానత్వముగల న్యాయమైన సమాజానికి పేదరికము అనుకూలం కాదు. నిజానికి పేదరికము ఐక్యతకు, ప్రాదేశిక సమగ్రతకు, స్వాతంత్ర్యానికి శక్తివంతమైన ప్రమాదము. అందుచేత పేదరికాన్ని తొలగించడానికి అత్యంత ప్రాధాన్యత నివ్వడము సమంజసము.

### పేదరికం

కనిష్ఠస్థాయి వినియోగం రూపంలో పేదరికాన్ని నిర్వచిద్దాము. 1960-61 నాటి ధరల ప్రకారం నెలకు రూ. 20 విలువ

గల వస్తువుల వినియోగము, 1972 అక్టోబరు ధరల ప్రకారము నెలకు రూ. 40 విలువగల వస్తువుల వినియోగము వాంఛనీయము. ఇట్టి వినియోగానికి తక్కువగా నున్న వినియోగము పేదరికము. ఈ స్థాయి వినియోగమునకు పైనున్న వినియోగము పేదరికము కాదని ఒక నిర్ణయం తీసుకోబడింది. అంటే యీనాడు పేదరికము నుండి బాధపడకుండా వుండేందుకు కనీసం నెలకు రూ. 40ల విలువగల వస్తువులను వినియోగించాలనీ, యిట్టి కనిష్ఠ ప్రయివేటు వినియోగం పేదరిక స్థాయికి క్రిందనున్న బహుసంఖ్యాక ప్రజానీకానికి లభ్యం కావాలని అయిదవ పంచవర్ష ప్రణాళిక కోరుతోంది.

అల్ప ఆర్థికాభివృద్ధి (Under-development), అసమానత్వము (Inequality) పేదరికానికి, ఒకదానికొకటి తగ్గని కారణాలు. మన జనసంఖ్య, 1971లో తీసిన జనాభాలెక్కల ననుసరించి యాభై నాలుగు కోట్ల డెబ్భై తొమ్మిది లక్షల నలుబది తొమ్మిదివేల ఎనిమిది వందల తొమ్మిది (54,79,49,809). ఈసంఖ్య చాలాపెద్దది. అయితే సారూప్యంగా ఆలోచించినప్పుడు నాల్గవ ప్రణాళిక ఆఖరుకు రానున్న మన జాతీయాదాయము రూ. 21680 కోట్లు చాల చిన్నదగుటచే మన మొత్తం వినియోగం కూడా చాల తక్కువే. అంతేగాక యీ ఆదాయ వినియోగాల పంపకము చాలా హెచ్చుతగ్గులతో కూడుకొని వుంది. అందుచేత అతిత్వరలో దారిద్ర్య నిర్మూలన చేయడం సంభవం కాకపోవడమే గాక, యీ పేదరికపు సమస్యను కేవలం సంపద వృద్ధిగాని లేక సమానత్వంతో కూడిన పంపిణీగాని ఒంటరిగా పరిష్కరించలేవు. అందుచే వృద్ధి, సమానత్వము జంటగా ఏర్పడి పనిచేయక తప్పదు. అప్పుడే సత్ఫలితం లభిస్తుంది.

నాల్గవప్రణాళికలో పరిశ్రమలు అనుకున్నరీతిని 8-10 శాతం వృద్ధిని సాధించలేదు. వ్యవసాయం మొదటి రెండు సంవత్సరాలు కొంతవరకు బాగావున్నా, మూడవ సంవత్సరంలో అపజయం పొందడం ప్రారంభించింది. వాతావరణం అనుకూలంగా లేనందువల్ల 1972-73లో వ్యవసాయోత్పత్తి మరింతగా దెబ్బ తిన్నది. అందువల్ల నాల్గవ ప్రణాళిక సాలీనా వృద్ధిరేటు 5.7 శాతం కావాలనుకున్నప్పటికీ 5 శాతం కంటె తక్కువగానే వున్నది. అందుచేత అయిదవ ప్రణాళికవృద్ధి రేటును దీర్ఘకాలీన అంచనాలననుసరించి ఆశించిన 6.2 శాతం నుండి 5.5 శాతానికి దింపవలసివచ్చింది.

పేదరికాన్ని పారద్రోలడానికి ఉన్నత ఆర్థిక వృద్ధిరేటు అవసరమైన షరతే; అయితే అదొక్కటే ఆపని చేయడానికి చాలినంత శక్తి కల్గినదికాదు. ఈనాడు వినియోగంలోవున్న అసమానత్వాలు యిలా యథాతథంగా కొనసాగినట్లయితే, మన జనాభాలోని, అత్యంత బీద ప్రజలలోని రెండవ పదవ వంతు (Second poorest decile of the population) 1980-81 నాటికి 1968-69 ధరల ప్రకారము రూ. 27 లకు నెలసరి తలసరి ఆదాయం పొందగల్గుతారు. 1960-61 ధరలనెన్ను కొనినట్లయితే వారి నెలసరి తలసరి వినియోగస్థాయి రూ. 15 కు మాత్రమే వస్తుంది. అందుచేత ఆర్థికవృద్ధి రేటులో హెచ్చువేగంగా వచ్చిన హెచ్చుదల సహితం నెలసరి తలసరి వినియోగస్థాయిని 1960 ధరల ననుసరించి కావలసిన రూ. 20 కనిష్ఠ వినియోగస్థాయికి తేలేక పోతుంది. అందుచేత వృద్ధిమూలంతో ఉద్భవించిన పన్నాగం (strategy) లో పునః పంపిణీ (redistributive measures) చర్యలను కూడా చొప్పించ వలసివుంది. అంటే ఆర్థిక వృద్ధిని దుర్బల వర్గాల కనుకూలంగా వుండేట్లు నిర్వహించ వలసివుంది. ఇందుకుగాను పెద్దయెత్తున ఉద్యోగ వసతులు కల్పించాలి. అప్పుడే యిలా పనిలో చేరినవారు వస్తుసేవలను ఉత్పత్తి చేయడము, యీ వస్తుసేవలు వీరందరికి లభ్యం కావడము జరుగుతుంది. జనబాహుళ్యం జీవనం తీరును, వారి పనిచేసే సామర్థ్యాన్ని పెంపొందించే తీరులో సాంఘిక వినియోగాన్ని, సాంఘిక పెట్టుబడిని పెంచడం కూడా యిందుకు అత్యవసరము. ఈ సాంఘిక వినియోగ వస్తూత్పత్తిని, పెద్దయెత్తున ఉద్యోగాలు సృష్టించే కార్యక్రమంలో వెనుకబడిన వర్గాలకు, వెనుకబడివున్న ప్రాంతాలకు ఆర్థికాభివృద్ధి సమకూర్చే కార్యక్రమాల నములుజరిపేందుకు అత్యధిక ప్రాధాన్యత నివ్వవలసివుంది. అంటే అసమానత్వాన్ని నిజంగా స్పష్టముగా గోచరించేట్లు తగ్గించదలచుకున్న కార్యక్రమాల్లో, వెనుకబడివున్న వర్గాలను, ప్రాంతాలను ఎన్నిక చేసుకుని వాటికి లాభం కూర్చే భాగాలు వుండితీరాలి. అందుచేత పెరుగుదలను కేవలం వస్తుసేవల రూపంలో గాక పెరిగే ఉత్పత్తి, విస్తృతమయ్యే ఆదాయాలలో సాపేక్షికంగా వెనుకబడిన వర్గాలకు, ప్రాంతాలకు తగిన భాగముండేట్లుగా నిర్వచించవలసివుంది. అయితే పేదరికం తొలగడానికి, ఆర్థిక పెరుగుదల, ఆర్థిక సమానత్వాలను సమకూర్చడంతోపాటు పట్టణాలలోను, పల్లెలలోను వున్న ప్రజలు, వ్యవసాయదారులతో సహా కుటుంబనియంత్రణకు పూనుకోవలసివుంది. ఇందుకుగాను అయిదవ ప్రణాళిక రూ. 560 కోట్లను ఖర్చు చేయనెంచింది.

ఒక అయిదు సంవత్సరాల కాలంలో పేదరికాన్ని తొలగించడం సాధ్యంకాదు. అయితే పేదల ఆశల్ని అర్థంచేసికొని బీదరికపు నిర్మూలన కార్యక్రమ నిర్వహణలో పరిగెత్తుతూ పని చేయవలసివుంది. ప్రణాళికా రచన, దాన్ని అమలు జరపడము సరైన రీతిలో సాగినట్లయితే వున్నతవృద్ధి రేటు, వినియోగ రూపంలో హెచ్చు సమానత్వము పరస్పర వ్యతిరేకములైన ఆశయాలు కావు. అయిదవ ప్రణాళిక మార్గనిర్దేశక పత్రంలో కోరబడిన వృద్ధిరేటు, వృద్ధినమూనా, ఆర్థికాభివృద్ధి ప్రక్రియను స్వదేశీ ధాతసహాయంనుండి విముక్తి చేయడము, ప్రభావశీలంగల సంపూర్ణజనాభా విధానానికి ప్రాముఖ్యత నివ్వడము, ఉద్యోగావకాశాల సృష్టిపై నొక్కిపెట్టడము, కనీసావసరాలను తీర్చే జాతీయ కార్యక్రమం ఏర్పాటు, వెనుకబడిన వర్గాల ఉద్ధరణ, వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధిపై నొక్కిపెట్టడము, ప్రజానీకంలోని పేద వర్గాలకు సహేతుకమైన నిశ్చలమైన ధరలకు అత్యవసర వస్తువుల్ని అందజేయడానికి హామీ నేర్పాటు చేసేందుకు తలపెట్టబడిన నిర్బంధ ధాన్యసేకరణ, పంపిణీ విధానాలు పరస్పరం పటిష్ఠత చేకూర్చుకొనే విధానసాధనములే. అందువల్ల సహేతుకమైన కాలవ్యవధిలో పేదరికాన్ని తొలగించడం అయిదవ ప్రణాళిక కీలక ఆశయము. అయితే పేదరికాన్ని తప్పక తొలగించాలనీ దృఢతరమైన ఆశ

యంతో, బలమైన స్వయంనిర్భరతను సాధించాలనీ ఉత్సాహంతో పొలాలలోను, ఫ్యాక్టరీలలోను, కచేరీలలోను పని చేయడము, సాంఘిక జీవితంలోను, కార్యకలాపాలన్నింటిలోను క్రమశిక్షణ, ఉన్నత స్థితిలో వున్నవారు త్యాగాలు చేయడము, యిందులో యిమిడివున్న సమస్యలు బాగా తెలిసి వుండటము, పేదరికం విసరే సవాలును ఎదుర్కొవడంలో ప్రతీ పౌరుడు తన శక్తిని తగిన రీతిలో ఉపయోగించడము అవసరము.

## ఉద్యోగాలు

అంతకుముందు దశాబ్దంలో వెయ్యికి 13.31 గా పెరుగుతున్న జనాభా 1951–61 లో వెయ్యికి 21.64 గా పెరిగింది. తదుపరి 1961–71 లో వెయ్యికి 24.8 గా పెరిగింది. కుటుంబ నియంత్రణ అనుకున్న రీతిని విజయవంతం కాలేదు. అందుచేత నిరుద్యోగ స్థితి ప్రేలుడు (Unemployment Explosion) జరిగింది. అసమానత్వానికి పెద్ద పరిమాణంలో ఉపస్థితమౌతున్నా నిరుద్యోగ స్థితి, అల్ప ఉద్యోగిత (Under–employment), సారహీన ఉద్యోగిత (Thin employment = తక్కువ ఉత్పాదకతగల ఉద్యోగితలో హీనమైన ఆదాయము వుండే స్థితి) కారణాలు. వీరందరికీ సహేతుకమైన ఆదాయ స్థాయిలో ఉత్పాదన చేసే ఉద్యోగాలు కల్పించినట్లయితే ఆర్థిక వృద్ధి పెరిగి, అసమానత్వము, పేదరికము చాలావరకు తగ్గిపోగలవు. అప్పుడే వీరందరూ పేదరికపు స్థాయికి పైనుండి ఆర్థిక స్థితికి రాగలరు. అంతేగాని సాంప్రదాయకంగా వస్తున్న విత్తీయ చర్యల (Fiscal Measures) ద్వారా పునః పంపిణీకి పూనుకున్నందువల్ల సమస్య పరిష్కారం కానేరదు.

అయితే ఔద్యోగికత రెండు రకాలు : (1) వేతన ఉద్యోగిత (2) స్వయం నియమిత ఉద్యోగిత (Self–employment) వేతన ఉద్యోగిత పెరుగుతోందిగాని, యింకా చాలా హెచ్చుమంది స్వయంనియమిత ఉద్యోగితలోనే వున్నారు. ఔద్యోగిక విధానం వేతనోద్యోగితను, స్వయం నియమితోద్యోగితను, వాటి ఉత్పాదకతను కూడా పెంచడానికి పూనుకోవలసివుంది. అయిదవ ప్రణాళిక వేతనోద్యోగితను నిర్మాణ, గనుల, ఫ్యాక్టరీ ఉత్పాదన రంగాలలోను, విద్యుచ్ఛక్తి ఉత్పాదన, ప్రసార, పంపిణీ రంగాలలోను, రవాణా, వార్తా సౌకర్యరంగాలలోను, వ్యాపార, సరుకు నిల్వ, బ్యాంకింగు, జీవితభీమా, సాంఘిక రంగాలలోనూ హెచ్చుగా కల్పించ నెంచింది.

అయితే స్వయం నియమిత ఉద్యోగితను వ్యవసాయ, కుటీర పారిశ్రామిక, రోడ్డు రవాణా, వ్యాపార, సేవారంగాలలో పెంపొందింప నెంచింది.

ఒక నిర్ణీత రేటులోసాగే ఆర్థికవృద్ధికి ఉద్యోగాలు సృష్టించే శక్తి, శ్రామిక సాంద్రత పద్ధతిలో వస్తూత్పత్తిని చేయడాన్ని ఎన్నుకొనడం, వల్ల కొరవగా వున్న పెట్టుబడి, భూమి స్థానంలో శ్రామికుల్ని వుపయోగించి పనిచేయించ వీలుగల్పించే సాంకేతిక పరిజ్ఞానాన్ని (Technology) ఎన్నుకొనడంవల్ల, విస్తృతమౌతుంది. అందువల్ల ఆర్థిక పురోగమనం సాధ్యమౌతుంది కాబట్టి, యింకా యిరవై సంవత్సరాల వరకు అనగా కుటుంబ నియంత్రణ వాంఛనీయ ఫలితాలను ప్రసాదించే వరకు, యీ నిరుద్యోగపు ప్రేలుడును దేశం తట్టుకోగలిగేటట్టుగా చర్యలు తీసుకోవలసివుంది. అయితే ఆర్థిక రంగంలోని సంఘటిత శాఖలలో వస్తువుల తయారీని శ్రామిక సాంద్ర పద్ధతికి మార్చడం పరిమితంగానే సంభవమౌతుంది. కేవలం షిఫ్టు సంఖ్యను పెంచి ఉద్యోగావకాశాలను పెంచడానికి కొంతవరకు వీలుందేగాని, సాంకేతిక పద్ధతిలో ఆర్థికంగా అనుసరణీయమైన మార్పులు తెచ్చి ఉద్యోగాలను పెంచే అవకాశం చాలా తక్కువగా వుంది.

అందువల్ల ఒకే ప్రాంతంలో భూమి అభివృద్ధి కార్యక్రమాలను (Area based land improvement programmes) చేపట్టి అదనంగా ఉద్యోగాలను కల్పించ వచ్చును. పెద్దతరహా యూనిట్లతో పోటీ చేయగల శక్తిగల చిన్నతరహా యూనిట్లకు వివిధ పారిశ్రామిక రంగాలలో ప్రోత్సాహం యివ్వడం ద్వారా కూడా ఉద్యోగావకాశాలను పెంచవీలుంది. నాల్గవ ప్రణాళికలోనే యిలాటి చర్యలుకొన్ని తీసుకోబడినవి. దీర్ఘకాలికంగా మనగలిగే ఉత్పాదక శక్తుల్ని సృజించే విధంగా అయిదవ ప్రణాళికలో యిటువంటి చర్యలు తీసుకోబడనున్నవి. అయితే యిలా చేయడంలో వాటి ఔద్యోగికతస్థితి స్వచ్ఛందత క్షీణించకుండా వుండేట్లు చూడబడుతుందికూడా. నిర్మాణ రంగం శ్రామిక సాంద్ర పద్ధతిలో పని చేస్తుంది. ఈ రంగంలో దీద్వారా విలువ 8.2 శాతం పెరుగుతుంది. యంత్రాలను ఉపయోగించడం తగిన రీతిలో నివారించబడినట్లయితే వేతన బిల్లు, ఉద్యోగ వసతి కూడా యిదే రీతిలో పెరుగుతుంది. ఇంకా హెచ్చుగా ఉద్యోగ వసతులు యీ రంగంలో పెరగాలంటే ఐదవ ప్రణాళికలో చెప్పబడిన దాని కంటె హెచ్చు మూల ధన ఏర్పాటు రేటు, హెచ్చుఉపాంత పొదుపు రేటు (Marginal rate of saving ) కావలసి వున్నవి.

ఒక రంగంలోని ఉత్పత్తి అప్పటున్న శ్రామికుల మీద శ్రామిక ఉత్పాదకశక్తి (Labour productivity) మీద ఆధారపడి వుంటుంది. అయితే ఐదవ ప్రణాళికా కాలంలో శ్రామికోత్పాదకత పెరుగుదల చాలా సామాన్య స్థితిలో ఉండగలదు. అందుచేత ఉత్పత్తి పెరుగుదల కవసరమైన శ్రామికుల నియుక్తిని గురించి అంచనాలు ముందుగానే సిద్ధం చేయబడి ఉండవలయును. వేతన శ్రామికుల్ని నియోగించి పని చేసే గనులు, వస్తువుల తయారీ రంగాలలో 8.3 శాతము, రవాణా వార్తా సౌకర్య ప్రసార రంగాలలో 6.2 శాతము, విద్యుచ్ఛక్తి రంగములో 10.6 శాతము, బ్యాంకింగ్ జీవిత భీమా రంగంలో 7.4 శాతము, సార్వజనిక పాలనలో 5.2 శాతము, అడవులలో 6.4 శాతము వృద్ధి రేటు ఉత్పత్తిలో ఏర్పడాలని ఐదవ ప్రణాళిక ఆశిస్తోంది. అయితే యీ చోట్ల ఉద్యోగ వసతుల వృద్ధి రేటు ఉత్పత్తి వృద్ధి రేటు కంటే తక్కువగానే ఉంటుంది. అయితే ఉత్పాదకత యీ చోట్ల ఎంత ఉంటుందో దానిపై ఉద్యోగవసతి వృద్ధి రేటు ఆధారపడివుంటుంది

[ సశేషం ]

# డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్



శ్రీ పంద్రంగి రాజేశ్వరరావు




మణులు భూగర్భంలోను సాగర గర్భంలోను అణిగి వుంటాయి. అవి చక్రవర్తి కిరీటములో చక్కగా ప్రకాశించును. రాధాకృష్ణన్ పుట్టు పూర్వోత్తరాలను పరికిస్తే వారు అత్యున్నత స్థాయికి రావటం ఈశ్వరేచ్ఛ అని ఋజువవుతుంది. పుట్టింది తిరుత్తణిలో. ఐదుగురు కుమారులు యిద్దరు కుమార్తెలు గల వీరి తండ్రి శ్రీ వీరాస్వామి, మధ్య తరగతి గృహస్థులు. 17వ ఏట రాధాకృష్ణన్ మదరాసు క్రైస్తవ కళాశాల యందు బి.ఎ. క్లాసులో గణితశాస్త్రం లేదా పదార్థ విజ్ఞానశాస్త్రం చదువుదామని అనుకుంటూ వుంటే వారి బంధువు తత్వశాస్త్రంలో పట్టభద్రులై తమ పుస్తకాలను వీరికి యిచ్చారు. అనుకోని తలంపుగా గిరాకీ లేని తత్వశాస్త్రం చదివి ప్రథమ శ్రేణిలో పట్టభద్రులై తదుపరి, యమ్. ఏ. ప్యాసయి ప్రెసిడెన్సీ కాలేజీలో అధ్యాపకులుగా ప్రవేశించారు.

అప్పటికి వీరికి సంస్కృత పరిచయం తక్కువ. అందుకు సంస్కృతాంధ్ర ఆంగ్ల భాషలలో నిష్ణాతులై మదరాసు ప్రభుత్వమందు ప్రధానఅనువాదకులుగా పనిచేయుచున్న శ్రీ చెన్నాప్రగడ భాను మూర్తిగారి సహాయము తీసుకునేవారు. తదుపరి రెండు దశాబ్దముల తర్వాత తాము ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్షులైన పిదప శ్రీ భానుమూర్తిని గుర్తుంచుకుని తెలుగుశాఖకు ప్రధాన పరీక్షకులుగా నియమించారు.

శ్రీ రాధాకృష్ణన్ తమ విద్యార్థుల ఆదరాభిమానాలు పూర్తిగా సంపాదించారు. వీరు మైసూరు విశ్వవిద్యాలయము నుండి కలకత్తా విశ్వవిద్యాలయముకు ఆచార్యులుగా వెడుతున్నప్పుడు విద్యార్థులు బండిగుర్రాన్ని విప్పివేసి రాధాకృష్ణన్ ఎక్కిన బండిని తామే స్టేషను వరకు జయజయ ధ్వానాలు చేస్తూ లాక్కు వెళ్లారు. తాము విద్యార్థులకు చెప్పినదాని కంటె తామే విద్యార్థుల వద్దనుండి ఎక్కువ నేర్చుకున్నామని చమత్కరించే వారు.

అసమాన ప్రతిభా వంతులగుటచేత వీరెపుడూ ప్రతిభకే ప్రాధాన్య మిచ్చేవారు. వీరి హయాములో ఆంధ్ర విశ్వవిద్యాలయం జాతీయ అంతర్జాతీయ స్థాయిని అందుకుంది. వీరు ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయానికి అధ్యాపకులుగా వెళ్లటం, కాశీ హిందూ విశ్వవిద్యాలయమందు పండిత మదనమోహన్ మాలవ్యాకు వారసులు కావటం ఎవ్వరికీ ఆశ్చర్యం కల్గించలేదు.

బ్రిటిష్ ప్రభుత్వం వీరిని సర్ బిరుదుతో గౌరవించినా, తమ స్నాతకోపన్యాసాలలో భారత దేశం యెడ బ్రిటిషువారి వైఖరిని తీవ్రంగా విమర్శించేవారు. మందుగుండు గిడ్డంగి మీద కూర్చుని చుట్ట కాలుస్తున్నారని హెచ్చరించేవారు. ప్రగతి సన్నగిలినపుడు విప్లవము అనివార్యమనేవారు. గాంధీజీ స్థానము పెరిక్లీస్, సిసిరో, వాషింగ్టన్, లింకన్ ప్రభృతుల సరసనని గుర్తుచేసేవారు. విశ్వకవి ఠాగూరు తత్వము వివరిస్తూ బృహత్ గ్రంథాన్ని రచించటమేగాక గాంధీజీకి డబ్బదియవ జన్మదినోత్సవ సందర్భమున అభినందన గ్రంథాన్ని సమర్పించారు. ప్రపంచ దేశాలన్నిటిని దర్శించి భారత వాణిని వినిపించి శ్రోతలను ముగ్ధులను గావించారు.

రాజ్యాంగ నిర్ణయసభలో వీరి ఉపన్యాసాలు చరిత్రాత్మక మయ్యాయి. దేశానికి స్వాతంత్ర్యము వచ్చాక శ్రీమతి విజయలక్ష్మి పండిట్ మన రాయబారిగా రష్యా వెళ్లారు. ఈమె ప్రధాని నెహ్రూ సోదరి అయినా ఆవాహనా విసర్జనా లేకపోయింది. స్టాలిన్ కనీ

నము దర్శనమన్నా యివ్వలేదు. అపుడు రాధాకృష్ణన్‌ను రాయబారిగా నియమించారు. వీరి విఱువను గుర్తించి స్టాలిన్ రెండుసార్లు మాట్లాడారు. రాధాకృష్ణన్ స్టాలిన్ వీపు తట్టి అశోకచక్రవర్తి జీవితాన్ని గుర్తుచేసి యుద్ధాల నిష్ప్రయోజనాన్ని, ముప్పును వివరించారు. అంత స్టాలిన్ కరిగి, కన్నీరు పెట్టుకుని తనను ప్రపంచమంతా రాక్షసుడిలా చిత్రిస్తున్నా మానవునిగా గుర్తించినందుకు రాధాకృష్ణన్‌ను అభినందించి తన అవసానదశ ఆసన్నమైనదనీ రాధాకృష్ణన్ మాత్రం వర్ధిల్లాలని అన్నారు. వీరు మాస్కోలో వుండగానే బుద్ధుని 'ధర్మపథానికి' చక్కటి వ్యాఖ్యానం రచించారు.

భారత దేశానికి తిరిగి వచ్చాక మన విద్యావిధానం అన్ని స్థాయిలలో ఎట్లావుండాలో వివరిస్తూ సుదీర్ఘమైన నివేదిక తయారు చేశారు. ఇది తరతరములకు మార్గదర్శిగా నుండగలదు.

వీరు ఉపాధ్యక్షులుగా ఏకగ్రీవముగా ఎన్నికైన పిదప రాజ్యసభా కార్య కలాపములను సమర్థవంతముగ నిర్వర్తించిరి. రాష్ట్రపతిగా ఎన్నిక కాగానే తమ జీతమును నెలకు రు. 1800లకు తగ్గించుకుని ఆదర్శప్రాయులైరి. డాక్టరు రాజేంద్ర ప్రసాద్ రాజఋషియగు జనక చక్రవర్తిని అనుసరిస్తే రాధాకృష్ణన్ రాజగురు బ్రహ్మఋషులగు వశిష్ఠ, ధౌమ్యులవలె ప్రవర్తించారు. విలువల స్థానాన్ని ధరలు ఆక్రమించరాదని నీతి నిజాయితీలకే ప్రాతినిధ్యమివ్వాలని తరచు హెచ్చరించేవారు. చైనా సేనలు భారత భూభాగాన్ని ఆక్రమించినప్పుడు నెహ్రూ ప్రభుత్వముయొక్క తెలివి తక్కువను అశ్రద్ధను ఘాటుగా విమర్శించారు. రాజాజీని టెలిఫోన్‌లో సంప్రదించారు. వీరి సదపడిలో మానవత, ఆప్యాయత వుట్టిపడేవి. వీరు రాష్ట్రపతిగావుండగా యీరచయిత పాత్రపరిచయాన్ని పురస్కరించుకొని చూడకోరగా వారి కార్యదర్శి తీరుబడి లేదని అడ్డుతగిలారు. అప్పుడు ఉత్తరము వ్రాయగా వెంటనే పిలుపు వచ్చింది. ఎన్నో వ్యక్తిగత విషయాలు మాట్లాడాక ఎవరెస్టు ఎక్కిన మనిషి అచట కాపురముండటానికి యిష్టపడడు, క్రిందికి వచ్చి మామూలుజనంతో కలిసి హాయిగా వుండగోరుతాడు అన్నారు. కల్కి లేక నాగరికత యొక్క భవిష్యత్తు అనే గ్రంథాన్ని తమ సహధర్మచారిణికి అంకితం చేశారు. మామూలు మనుష్యుల విశిష్ట నడవడి మన సంస్కృతి, సంస్కార, సంప్రదాయములకు పునాది అనే వారు. గుప్తంగా అనేకులకు సాయపడ్డారు.

వీరు అద్వితీయమైన గౌరవాలు పొందారు. ప్రపంచమందలి వివిధ విద్యా కేంద్రాలలో వుపన్యసించి శ్రోతల నుర్రూత లూగించారు. వీరు ప్రసంగించిన పిదప పేరు పడ్డవక్త మేధావిఅగు సర్ స్టాఫర్డ్ క్రిప్స్ వుపన్యసించడానికి సందేహించారు. భారతీయ తత్వముపై వీరు ఎన్నో ప్రామాణిక గ్రంథాలు రచించారు. వీరి వేదాంత దృక్పథమును విపులీకరిస్తూ ప్రాచ్య పాశ్చాత్య పండితులు 1952 లో అమెరికాలో ఉద్గ్రంథాన్ని ప్రకటించి సజీవ వేదాంతుల శ్రేణిలో వీరిని చేర్చారు. ప్రస్థాన త్రయముపై సునిశితముగ వ్యాఖ్యానించుట ద్వారా శంకర, రామానుజ, మధ్వ, వల్లభా చార్యుల శ్రేణిలో నిలుచుటకు అర్హత సంపాదించి నారనుటలో సందేహము లేదు. మీ జీవితంలో ఎప్పుడు అత్యంత సుఖ సంతోషాలను అనుభవించారనే ప్రశ్న బాదరాయణ బ్రహ్మ సూత్రమును వ్యాఖ్యానించి నపుడని సూటిగా సమాధానమిచ్చారు.

వీరి సంభాషణలో హాస్య రసం ఉట్టి పడుతూ వుంటుంది. తలపాగా ఎడల అభిమానం ఎందుకంటే తల్లిదండ్రుల కళ్లు తిరిగి నెత్తి మీదకు రాకుండా అని చమత్కరించారు. సురూపుల పొత్తును గురించి చెపుతూ పులులు గొర్రెల కంటే అందముగా వున్నా వాటిని బోనులో వుంచకపోతే ప్రమాదం అని హెచ్చరించారు. గాంధీజీ ఆవుపాలు రక్త మాంసాల నుండి వుద్భవించుట చేత వాటిని వాడటం గోమాంస భక్షణ తుల్యం అనగా రాధాకృష్ణన్ తల్లిపాలు త్రాగి నర మాంస భక్షణ తుల్యులగు వారు గోమాంస భక్షణను పరోక్షముగా నిషేధించుట సమంజసమా అని ప్రతిప్రశ్న వేసి మహాత్ముని నిరుత్తరుని చేసిరి.

వీరికి నూరు విశ్వవిద్యాలయముల పైగా గౌరవ పట్టాల నిచ్చాయి. బ్రిటిషు, ఫ్రెంచి అకాడమీలలో విశిష్ట సభ్యత్వము పొందిన కొద్ది మందిలో వీరు ఒకరు ఆర్డర్ ఆఫ్ మెరిట్ అనే గౌరవాన్ని పొందిన యిరువదిమందిలో వీరు ఒకరు, ఏకైక భారతీయులు, ప్రాచ్యులు. పోప్‌పాల్ గోల్డన్ సర్ అనే గౌరవ బిరుదాన్ని స్వయంగా అందచేశారు. విశ్వ భారతి దేశికోత్తమ, భారతీయ విద్యా భవనము బ్రహ్మ విద్యా భాస్కర, వారణాసి సంస్కృత విద్యా పీఠము వాచస్పతి, సిలోను ప్రభుత్వము వాచస్పతి, అనే బిరుదులతో సత్కరించారు.

వీరిపుడు వయోవృద్ధులై అనారోగ్యము వలన పూర్తి విశ్రాంతి తీసుకుంటూ వున్నా వీరి వునికి దేశానికి గర్వ కారణం. కులం పవిత్రం జననీ కృతార్థ వసుంధరా పుణ్యవతీచతేన అనే సూక్తి వీరి యెడ సార్థకమైంది. విద్యారణ్యుని, పంచదశిలో వుటంకించిన ప్రజ్ఞానం బ్రహ్మ అనే ఋగ్వేద సత్యం వీరి యెడ యదార్థమైనది. మహాకవి కాళిదాసు 'శాకుంతల నాటకం' లో వుటంకించిన "సరస్వతీ, సృత, మహతామ్, మహీయతామ్" అనే ప్రార్థన వీరికి తు. చ. తప్పక అన్వయిస్తుంది. ఇట్టి మహా మనీషి న భూతో నభవిష్యతి.

# మహాకవి గురజాడ



శ్రీమతి ఎస్. ఎస్. దేవి

"క్రొత్త పాతల మేలు కలయిక
క్రొమ్మెరుంగులు జిమ్మగా"

అంటూ ఆంధ్ర కవిత్వంలో ముత్యాల సరాలకు నాందీ వాచకం పలికినవాడు నవయుగ వైతాళికుడు, మహాకవి గురజాడ వెంకట అప్పారావు. 'ఆకులందున అణగిమణగి' పలికే కోయిల లాగ ఒక కవితతో 'దేశమం దభిమానములు మొలకెత్తించిన' జాతీయకవి శ్రీ గురజాడ.

ఆ గురజాడ 1862 సెప్టెంబరు 21 వ తేదీన—అంటే దుందుభినామ సంవత్సర భాద్రపద శుద్ధ త్రయోదశీ ఆదివారంనాడు విశాఖజిల్లా, ఎలమంచిలి తాలూకా రాయవరం గ్రామంలో మాతామహుల యింట జన్మించాడు తండ్రి వెంకట రామదాసు 'కుమరాం' తాణా ఉద్యోగి. గురజాడ తల్లి కౌసల్యమ్మ.

వెలివల రామ్మూర్తి గారనే పండితునివద్ద అప్పారావుగారు సంస్కృతాంధ్రాంగ్ల భాషలు నేర్చుకున్నారు. 10 వ యేడువరకూ చీపురుపల్లి లోనే చదువుకున్నారు. తరువాత ఉన్నత పాఠశాలా భ్యాసంకోసం విజయనగరం వచ్చారు. 1872 లో విజయనగరం మహారాజావారి ఆంగ్ల కళాశాలలో విద్యార్థిగా చేరారు. గిడుగు రామ్మూర్తి పంతులుగారు వీరి సహాధ్యాయులు. విజయనగరం కాలేజీ ప్రిన్సిపాల్ చంద్రశేఖర శాస్త్రిగారు అప్పారావుగారి ప్రతిభను గుర్తించి సంస్కృతాంగ్ల భాషలు స్వయంగా బోధించి వివిధ భాషాసారస్వతాలలో మంచి పాండిత్యం అలవడేటట్లు చేశారు.

శ్రీ గురజాడ మెట్రిక్యులేషన్ ప్రథమ శ్రేణిలోఉత్తీర్ణు లయ్యారు. సంస్కృతం రెండవ భాషగా, తత్త్వశాస్త్రం అధిమాన విషయంగా ఇంగ్లీషుతో ప్రథమశ్రేణిలో 1886 లో బి.ఏ. పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు. 1887 లో డిప్యూటీ కలెక్టరు ఆఫీసులో హెడ్ గుమస్తాగా చేరారు. కాని శ్రీ ఆనందగజపతి రాజావారు అప్పారావు గారిని తమకాలేజీలోనే లెక్చరరుగా నియమించారు. కాగా అనారోగ్య కారణంగా పదవినుండి విరమించగా 1896 లో మహారాజా వారు అప్పారావుగారిని సంస్థాన శాసన పరిశోధకులుగా నియమించారు. ఆనందగజపతిగారి అనంతరం వారిసోదరి రీవా మహారాణీకి ఆంతరంగిక కార్యదర్శిగా 1898 లో నియుక్తులయ్యారు.

విద్యార్థిగా వున్నప్పుడే ఈయన సాహిత్య ప్రశస్తి ఆనంద గజపతిగారి దృష్టిని ఆకర్షించింది. మహారాజావారు కళాసాహిత్య పోషకులేకాక స్వయంగా పండితులు కూడా. ఆనందగజపతిగారి కాలంలో ఈ ఉత్తరాది విజయనగరం సాహిత్య గోష్ఠులతో, సాహితీ వేత్తలతో, పండితులతో, కళాకారులతో అలరారుతూ అంనాటి కృష్ణదేవరాయల విజయనగరసామ్రాజ్య ప్రాభవాన్ని తలపింప జేసేది.

గురజాడ 1883 లో ఇంగ్లీషులో 'సారంగధర' అనే పద్య కావ్యంవ్రాసి కలకత్తానుండి వెలువడిన 'రీస్ అండ్ రయ్యత్' అనే పత్రిక ప్రశంసలందుకున్నారు. అసలు విద్యార్థిగావున్నపుడే మొట్ట మొదట ఒక ఆంగ్ల గేయాన్ని రచించి ప్రిన్సిపాల్ చంద్రశేఖర శాస్త్రి, ఆనందగజపతిగారల మెప్పు పొందారు. 'సాంగ్స్ఆన్

బ్లూ హిల్స్' అన్న గేయాలు ఆయన ఆంగ్ల కవితా నైపుణ్యానికి మచ్చు తునకలు.

ఆ కాలంలో కులభేదాలు ఎక్కువగా ఉండేవి. చతుర్వర్ణాలు—బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర—ముఖ్యమైనవిగా పరిగణింపబడేవి. కులాన్ని బట్టి ఆధిక్యత కనబరచేవారు. పంచమ కులములను చాలా హీనంగా చూసేవారు. కులభేదమేగాక, శాఖాభేదాలు కూడా ఎక్కువగా ఉండి, అందులో హెచ్చుతగ్గులను బట్టి కూడా గౌరవింపబడేవారు. ముఖ్యంగా ఆనాడు హరిజనుల జీవనం దుర్భరంగా ఉండేది. బ్రాహ్మణుల ఆధిక్యత హెచ్చుగా ఉండేది. హరిజనులు తమ ప్రాథమికావసరాలు అనుభవించుటకు కూడా అనర్హులుగా చూడబడేవారు. ఈ విధమైన మానవత్వానికి మచ్చతెచ్చే ప్రవర్తనను గురజాడ నిరసిస్తూ యిలా అన్నారు 'మంచి చెడ్డలు మనుజులందున యెంచిచూడగ రెండె కులములు: మంచి యన్నది మాలయైతే మాలనే అగుదున్'

ఆనాడు 'అష్టవర్షాత్ భవేత్కన్యా' అన్నట్లు ఆడపిల్లలకు ఎనిమిదేండ్లు నిండకుండానే వివాహం చేయాలనే ఆచారంతో, కన్యాదాన ఫలం దక్కదేమోనని తగినవరుడు దొరకకపోతే, చివరికి కాటికికాళ్ళు చాచుకున్న ముడుకాళ్ళ ముదుసలికైనా అంటగట్టేసేవారు. అతను కాస్తా గుటుక్కుమంటే ఆమె సూత్రం పుటుక్కుమనేది. ఆ రోజులలో పురిటికందులకు కూడా మెడలో మంగళ సూత్రాలు మెరిసేవి. గర్భవతిగా వుండగానే, ఆమెకు పుట్టబోయే శిశువుకు సంబంధం నిశ్చయించు కొనటంకూడా జరిగేది. ఇది నిజంగా శోచనీయం. పురిటి కందు పెరిగి పెద్దది కాక ముందే ఆమె భర్త చనిపోతే ఆమె అలంకరించు కోటానికి నోచనిదై చప్పిడి తిండితో జీవచ్ఛవంవలె బ్రతక వలసివచ్చేది. ఇటువంటి హృదయ విదారకమైన సంఘ దురాచారాలు రాజాగారిని కలచివేశాయి. వాటిని విమర్శిస్తూ రచన సాగించమని రాజావారు అప్పారావుగారిని కోరారు. దానిఫలితమే 'కన్యాశుల్కం' నాటకం (1896)

అప్పారావుగారనే సరికి 'గిరీశం' గుర్తుకు వస్తాడు. అప్పారావుగారి 'గిరీశం' పాత్ర ఆంధ్ర సాహిత్యరంగంలో అద్వితీయమైన సజీవశిల్పం. "సంఘ సంస్కరణోద్యమాన్ని బలపరచటానికీ తెలుగుభాష నాటకరంగానికి అనుకూలమైనది కాదన్న అపోహ నెదుర్కొనడానికీ నేను కన్యాశుల్కం వ్రాశాను" అన్నారు గురజాడ. ఆ నాటి సమాజంలోనేకాక ఈనాటి సమాజంలో కూడా ఉన్న వివిధ రకాల వారు, అంటే ఛాందసులు, లుబ్ధులు, సంస్కర్తలు, పండితులు, పోకిరీలు, తాగుబోతులు—కోర్టుపక్షీలు, దొంగబైరాగులు లాంటి వివిధ మనస్తత్వాల వాళ్ళు ఎందరో ఈ నాటకంలో కనిపిస్తూ ఉంటారు. వారి మనస్తత్వాలను, ఆనాటి సాంఘిక జీవనాన్ని యిందులో మనోహరంగా చిత్రించారు గురజాడ.

ఏకోణం లోంచి చూస్తే దాని కనుగుణంగా రంగురంగు రూపాలుకనిపించే (కెలిడియోస్కోపు) చిత్రదర్శిని వంటిది కన్యాశుల్కం. కన్యాశుల్కం వంటి నాటకాలు ప్రపంచ నాటక సాహిత్యంలో అరుదు. కన్యాశుల్క ఆచారాన్ని కథావస్తువుగా తీసుకున్నట్లు కనిపించినా సరే అంతకు మించి "మానవ జీవితాన్ని గంభీరమైన దానినిగా భావించి ఈ నాటకంలో దానిని యితివృత్తంగా గ్రహించానన్నారు" గురజాడ. ఈ కన్యాశుల్కం ఈనాడు అనేక భాషలలోనికి అనువదింప బడినది.

అందుకే శ్రీ శ్రీ యిలా అన్నారు : "కన్యాశుల్కం గొప్పది. జీవితమంత గొప్పది."

కన్యాశుల్కం వలెనే అదే వాడుక భాషలో 1906లో "కొండుభట్టీయం" వ్రాశారు, కానీ దానివ్రాత ప్రతి పోగా మరలా వ్రాసారు. అయితే అది అసంపూర్తిగానే ఉండిపోయింది. "ప్రాచీన శృంగార గాథలనుంచి యితివృత్తాలను స్వీకరించుకొని రచయితలు ఎందుకు నాటకాలను రచిస్తారో నాకాశ్చర్యంగా ఉంది" అనిన గురజాడ 'బిల్హణీయం' వ్రాయటం శోచనీయం. ఈ వాడుక భాష ప్రహసనాలకే తప్ప గంభీర, శృంగారాది రసనాటకాలకు పనికి రాదన్న విమర్శను తొలగించ టానికే బహుశా గురజాడ 'బిల్హణీయము'ను మొదలు పెట్టి ఉంటారు. కాని యిదికూడా పూర్తిగా రచించ లేదు.

ఇంక ఆయన 'ముత్యాల సరాలు'. ఈ ఛందస్సుతో పూర్వం కూడా కొన్ని పాటలున్నా దీనిని వాడుకలోనికి తెచ్చినవారు మాత్రం గురజాడే. ఆంధ్ర సాహితీ కన్యకు ఇవి నిజమైన ముత్యాల సరాలైతే ఈయన 'ఆణి ముత్యాలు' కూడా సాటిలేని ఆణిముత్యాలే.

ఈయన రచనలో కమ్మని తెలుగు తనం ధ్వనిస్తుంది. అలతి అలతి మాటలతోనే భావాన్ని సూటిగా హృదయానికి హత్తుకునేటట్లు చెప్తారు. 'కాసులు' అనే గేయంలో—

"మరులు ప్రేమని మది తలంచకు
మరులు మరలును వయసు తోడనె
మాయమర్మము లేని నేస్తము
మగువలకు మగవారి కొక్కటి
బ్రతుకు సుఖముకు రాజమార్గము
ప్రేమనిచ్చిన ప్రేమ వచ్చును

ప్రేమనిలిపిన ప్రేమనిలుచును" అంటూ ఆదర్శ ప్రేమను చక్కగా నిర్వచించారు.

'డామన్ పిథియస్' ఆదర్శ మైత్రిని నిరూపించే మహోజ్జ్వలమైన పద్యకావ్యం.

'పూర్ణిమ' 'కన్యక' లలో నాటి స్త్రీల దుస్థితిని కన్నులకట్టినట్లు చెప్పారు. పూర్ణిమ, కన్యకలను తలంచినంత మాత్రానే హృదయం జలదరిస్తుంది. ముఖ్యంగా ఆనాటి పెద్దల మూర్ఖత్వానికి

లియై జీవచ్ఛవముగా బ్రతికే అన్నెం పున్నెం ఎరుగని అమాయిక బాలలకు ప్రతిరూపమే పూర్ణమ్మ.

"నలుగురు కూచొని నవ్వేవేళల
నా పేరొక తరి తలపండీ
మీ మీ కన్నబిడ్డల నొకతెకు
ప్రేమను నా పేరివ్వండి "అంటూ పూర్ణిమచెప్పిన వీడ్కోలు చదువుతున్నప్పుడూ,

"భక్తి పరవశమైన మనసున
దుర్గనప్పుడు కొలిచి కన్యక
ముక్తి వేడుచు పూడ్చినగలను
శక్తి కర్పించెన్''

ఈవిధముగా చేసి కన్యక తన మాన సంరక్షణకై పూనుకున్న నిర్ణయం చదువుతుంటే స్త్రీలకే గాక ప్రతీ వారికి కన్నీరు చిందు తుందనటం అతిశయోక్తి కాదేమో!

ఈముత్యాల సరాలలో అన్నింటినీ మించినది ''దేశభక్తి" భారతదేశంలో వచ్చిన జాతీయ గీతాలలోనే మేలుబంతి అయినది ఈ గేయం. ఇదొక్కటీ చాలు గురజాడ ప్రతిభ వ్యక్తం పరచటానికి. జాతీయవాదులమని దేశభక్తులమని, ప్రజానాయకులమని బోర విరుచుకు తిరిగే వారిని—

"దేశాభిమానం నాకు కద్దని
వట్టిగొప్పలు చెప్పుకోకోయ్
పూని ఏదైనాను ఒకమేల్
కూర్చి జనులకు చూపవోయ్" అంటూ హెచ్చరిస్తుంది.

''ఈసురోమని మనుషులుంటే
దేశ మేగతి బాగు పడునోయ్
జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశి సరుకులు నించవోయ్" అంటూ సోమరిపోతులను మేల్కొల్పుతుంది.

మతం పేరుతోను, భాషావిభేదాలతోను కలహించు కొని కత్తులు దూసుకున్నవారిని

''పూనుస్పర్ధలు విద్యలందే
వైరములు వాణిజ్యమందే
వ్యర్థ కలహం పెంచబోకోయ్
కత్తివైరం కాల్చవోయ్
అన్నదమ్ముల వలెను జాతులు
మతము లన్నీ మెలగవలెనోయ్
మతము వేరైతేను యేమోయి
మనసు లొకటై మనుషులుంటే'' అంటూ హితోపదేశం చేస్తుంది.

''మందగించక ముందు అడుగేయ్
వెనుక పడితే వెనుకెనోయ్" అంటూ యువజనులకు నూతనోత్సాహము నిచ్చి ముందుకు నడిపిస్తుంది.

ఇంకా ఆయన 'వ్యాసచంద్రి' 'మహాకవి డైరీలు' 'మాటామంతీ' మొదలైనవి సాహిత్య విభాగాలు ఆయన ప్రతిభకు నిదర్శనాలు. ఆయన కథలుకొన్ని ఇంగ్లీషు మొదలుగా గల వివిధ భాషలలోనికి అనువదింపబడినవి.

ఆయన రచనల్లో వాస్తవికత సహజగుణం. కమ్మని తేట తెనుగులో, సున్నితమైన హాస్యంతో వాడుక భాషలో, సంఘాన్ని సునిశితమైన వ్యంగ్యంతో విమర్శించుతూ రాసే ఆయన రచనలు తెలుగుసాహిత్యానికి ఆణిముత్యాలుగా చెప్పుకోవచ్చు.

అప్పారావుగారు మద్రాసు యూనివర్శిటీలో శాశ్వత సభ్యులు, పరీక్షాధికారి. అప్పుడీయన పరీక్షా విధానాలు సంస్కరించాలని ప్రయత్నించారు. విద్యార్థులు మొదటంతా అశ్రద్ధచేసి పరీక్షలలో రాత్రిళ్ళు టీలు త్రాగి బట్టీ పట్టి ముక్కున మూడుముక్కలు పెట్టు కొని పరీక్షలు వ్రాసయే పద్ధతి ఆయనకు నచ్చలేదు. విద్యార్థి సహజ విజ్ఞానం పరీక్షించాలని ప్రయత్నించి ఆ పద్ధతిలోనే పరీక్షా పత్రాలు తయారుచేశారు. దీనిని యూరపు పండితులు సమర్ధించినా, భారతీయ సనాతనులు వ్యతిరేకించారు.

ఈ విధముగా స్త్రీ జనాభ్యుదయానికి దేశాభ్యుదయానికి పాటుపడి సాహిత్యంలో ప్రత్యేకమార్పులు తెచ్చిన గురజాడ తన కలలు ఫలించకమునుపే, తన 54 వయేట 1915 నవంబరు 30 న స్వర్గస్థులయ్యారు.

ఆయన రచనల సంఖ్య తక్కువైనా, గుణంలోను, ఔన్నత్యంలోను అవి మిన్న. తెలుగు సాహిత్యానికి ఒరవడి దిద్దిన మహాకవి శ్రీ గురజాడ వెంకట అప్పారావు తెలుగు సాహిత్యంలో నవయుగ వైతాళికుడు.




# 3

రాచ కోడలు శీలామహాదేవి బెజవాడ రాజ సౌధంలో కొత్తగా చిత్రించిన కుడ్య చిత్రాలను పరిశీలిస్తోంది, సఖీ జనంతో కలిసి. అంత ఉత్సాహంలోనూ ఆమె గారికి పుట్టినిల్లు జ్ఞాపకానికి వచ్చి పుట్టెడు దుఃఖం ముంచుకొచ్చింది. బొమ్మలు చూడటం చాలించి, శుద్ధాంతంలోనికి వెళ్ళిపోయింది. సఖురాండ్రు ఆమె దుఃఖ కారణాలు తెలియక చిత్రపడ్డారు. తాను పుట్టినింటనుంచి వచ్చేలోపలనే శివపురాణాన్ని పూర్తిగా చిత్రించిన రాచకోడలు బొమ్మలను పూర్తిగా చూడకుండానే యెందులకు వెడలిందో ఎవ్వరికీ అర్థం కాలేదు.

అర్థ మగుట కామె ఆందోళన బయటకు వ్యక్త పరుస్తే కద! మెట్టి నింటికి వెళ్ళుటకు ముందే ఆమె మనస్సులో పెద్దకోరిక పట్టుకుంది. రాష్ట్రకూట చక్రవర్తి అమోఘ వర్షుని కుమార్తె శంఖాదేవిని తన పెద్ద కుమారుడు విజయాదిత్యుని కిచ్చి వివాహం చేస్తే బాగుంటుందని ఆమె అభిమతం.

ఈ సంబంధం ఖాయం చేయమని అడగడానికి ఆమె పుట్టినింటికి వెళ్ళింది. చక్రవర్తి పరాయివాడుకాడు, తనకు స్వయానా పెద తండ్రి మనుమడే. అన్నగారితో వియ్యమందడం ఆడువారందరూ ఆశించే అదృష్టమే. చక్రవర్తి తన మాట కాదనడని ఆమె భావించింది. అందుకని విజయాదిత్యుని వెంట పెట్టుకుని మరీ వెళ్ళింది. అతగాని నొక్కడినే తీసుకునివెళ్ళిన బాగుండదని తోచి, వారల నందరినీ తీసుకుని వెళ్ళింది.

విజయాదిత్యునికి శంఖాదేవికి ఈడూ జోడూ వాయి వరుస కుదిరాయి. చక్రవర్తి అమోఘవర్షుడు మేనల్లుణ్ణి మెచ్చుకున్నారు. సకల సద్గుణ సంపన్నుడు కనుక విజయాదిత్యునికి 'గుణక్కెనల్లాన్' అనే బిరుదు చక్రవర్తి స్వయంగా యిచ్చాడు గాని పిల్ల నివ్వలేదు.

తప్పు నాదేనేమో అనుకుంది శీలమహాదేవి. అమోఘ వర్షుడు విజయాదిత్యునకా బిరుదము నిచ్చినవెంటనే తాను పెళ్ళి ప్రసక్తి తేవలసింది. 'తొందరేముంది' అని జాప్యం చేసింది. చెయ్యి మించిపోయింది.

శంఖాదేవిని చక్రవర్తి పల్లవనందివర్మ కిచ్చి పెళ్ళిచేస్తున్నట్లు ప్రకటించాడు. అతగాని దృష్టిలో వేంగీచాళుక్యులతో సంబంధం ఎంత యిష్టమో పల్లవులతో బాంధవ్యం కూడా అంత ముఖ్యమే.

'అన్నయ్యా, నిన్నటిదాకా పల్లవులతో పోరాడుచునేయున్నావే వారికి చూసి చూసి పిల్లే నిస్తావా!' యని అడిగింది.

"అవునమ్మా, అటు మొన్నదాకా వంగరాజులతో పోరాడి వారికి మొన్న నిన్నీయలేదా? అలాగే ఇదీనూ" అని బదులు చెప్పాడు. 'అమోఘ వర్షునిరాజనీతికి హృదయం లేదు' అనుకొన్నది శీలామహాదేవి. అటు పల్లవ నందివర్మ పరిపాలిస్తున్న ప్రభువు. తన పుత్రుడుట్టి రాజ బిడ్డ మాత్రమే. ముందు ముందు రాజు కావచ్చుగాని ప్రస్తుతానికి రాజుగారి మనుమడు మాత్రమే.

మనసులోని కోరిక మనసులోనే నీరుకారిపోయినది, శీలా మహాదేవికి. కంటి నీరు పైకి పొర్లకుండా గుండెను కోనేరు చేసుకొన్నది. ఇప్పుడా కోనేరు అంచుల వంటి నిండి పొర్లసిద్ధపడింది,

శుద్ధాంతంలోనికి వచ్చిన శీలామహాదేవి అక్కడ ఉన్న సందుగ పెట్టెలు చూసి మరింత బాధపడింది. అవి అమోఘవర్షుడామె కిచ్చి పంపిన కానుకలు. కోడలి కోసం వెడితే కోరుకొనని ధనరాసులిచ్చి పంపాడు. ఏం చేసుకోను? అని ఆమెగారు మరింత బాధపడింది.

పడకటింటి లోనికి వచ్చిన ఆమె నిలువుటద్దం ముందు ఆసనంపై కూర్చుంది. వెంటవచ్చిన ఇష్ట సఖి రాజమవ్వ యెడంగా నిలబడి అర్థోక్తితో 'అమ్మా ఆభరణాలు...' అంది. రాచకోడలు తలపంకించి, తీసివేయమంది. చేయి అందించింది. అంగుళీయకాలు రాజమవ్వ తీసివేసింది. దండకడియాలు, వంకీలూ, తీసి పక్కనున్న పళ్లెంలో పెట్టింది. ముంగర, ముక్కెర, తీసి నెత్తి బిళ్లలు తీస్తూ "ఎందుకు బాధపడతారమ్మా! వియ్యాలవారెవరో విధాత గదా నిర్ణయిస్తాడు!" అంది నెమ్మదిగా. జవాబుగా రాచకోడలు నిట్టూర్చింది. ఆమెకు రాజమవ్వ దగ్గిర దాపరికం లేదు. మనసులోని ఊహాలన్ని ఆమె ఒక్క రాజమవ్వకే చెప్తుంది.

ఇంతలో ఒక పరిచారిక వేంచేసింది ద్వారబంధాని కావలనే నిలచి అంజలి ఘటించింది.

"ఏం? ఎందుకు!" అన్నట్టు రాజమవ్వ పరిచారిక వంక చూసింది.

'కొమాళ్లు మల్లపరాజులుంవారు దర్శనానికి విచ్చేశారు' అని మనవి చేసుకొంది పరిచారిక.

'రమ్మను' అని శీలామహాదేవి ఆసనంపై నుండి లేచింది. ప్రక్క గదిలోనికి వెళ్లింది. ఆమెకు కడగట్టుకొడుకు మల్లపరాజంటే ప్రాణం. నూనూగు మీసాల నూత్న యౌవ్వనం వచ్చేసరికి రాచబిడ్డలు తల్లికి దూరం అవుతారు. వేకువ ఝామున లేవగానే గండి కోటలో వ్యాయామం, స్నానాదికాలు కావించాక రాజ్యాంగ శాస్త్రంలో శిక్షణా, దరుపరి ఆయుధ శిక్షణా, అపిమ్మట నీతి శాస్త్ర బోధన జరుగుతుంది. చీకటి పడిన వెంటనే అలసి పోయిన బిడలు కడుపు నిండా తిని ఆద మరచి నిద్ర పోతారు. సువారంలో తల్లి పంక్తిని కూర్చోవడం కూడా పర్వదినాలలోనే.

అమ్మా అంటూ ఆప్యాయంగా మల్లవ రాజు లోనికి వచ్చాడు. రా అప్పా రా అంటూ విశాలమైన వేదిక పై నున్న పట్టు దూది పరుపుల ఆసనం పైకి అతన్ని ఆహ్వానించింది.

'అమ్మా నేనొక దేవళం కట్టించాలని తలపోస్తున్నానమ్మా!' అన్నాడు మల్లపరాజు. 'మంచిదే బాబూ, ఎక్కడ కట్టిస్తారు?'

'ఈ బెజవాడలోనే'

'ఈ బెజవాడలో ఎన్నెన్నో ఉన్నవిగా, అన్నిటికన్నా పెద్దది సమస్త భువనాశ్ర శైవాలయం ఉన్నదే, ఇంకొకటి ఎందుకయ్యా?' అన్నది శీలామహాదేవి.

'నేను కట్టించ దలచినది శివాలయం కాదమ్మా'
'మరి' విడ్డూరంగా చూసిందా తల్లి.

"తాతగారు చేసిన లోపాన్ని తీర్చాలనుకుంటున్నానమ్మా!"

"తాతగారు లోపం చేశారా? ఏమిటది?" ఆమె చిత్ర పడింది. వారు నూట ఎనిమిది శివాలయములు కట్టించారు. "అవును దాయాదులతో శత్రువులతో నూట యెనిమిది యుద్ధాలు చేశారు. అందుకే అన్ని దేవాలయములు కట్టించారు. అది లోపమెలా అవుతుంది నాయనా?"

"అది కాదమ్మా, చాళుక్య రాజు లందరూ వేయించిన ప్రతి శాసనంలోను 'స్వామి మహాసేన పాదానుద్యాతానాం' అని వ్రాయింమతారే ఇలవేలుపైన కార్తికేయునికి ఒక్క దేవళం కూడా కట్టించలేదు. అందుకని" అన్నాడు మల్లపరాజు.

"చేబ్రోలులో కుమార స్వామికి ఆలయం ఉన్నదే. ఏటేట జాతర చేసి స్వామి వారిని బెజవాడకు తీసుకుని వచ్చి ఊరివారలు పిలుచుకుంటున్నారే" అందితల్లి.

'అమ్మా నిన్న జాతరలో స్వామివారిచవటికి విజయం చేశారు కదా? రాత్రి వారు స్వప్నంలో సాక్షాత్కరించారమ్మా' అన్నాడు మల్లపరాజు, "ఆ కార్తికేయుడు కలలో కనిపించాడా నాయనా, ఎంతటి అదృష్ట వంతుడివి!" శీలామహాదేవి మహదానందం చెందింది. కుమారుని భుజాలు వ్రేలుతో తడిమింది.

"స్వామివారు బెజవాడను మెచ్చుకున్నారమ్మా. ఇక్కడ ఉండటానికే నిశ్చయించారు. వారి కోరిక వారు తెలిపి వేశారు." అన్నాడు ఉద్రేకంతో మల్లపరాజు. "ఆహా! ఎంత భాగ్యశాలివి. నీవంటి భక్తుని కన్నందుకు నా జన్మ తరించింది. నువ్వెంతో పుణ్యం చేసుకోబట్టే స్వామివారు నీకు సాక్షాత్కరించారు. స్వప్నానంతరం యేదైనా మొక్కుకున్నావా నాయనా" అని ఆమె ప్రశ్నించింది.

"స్వప్నానికి పూర్వమే మొక్కుకున్నానమ్మా, నిన్న ఇంద్రకీల పర్వతం మీద పెద్దన్న గారు మేనమామల పై కోపించారమ్మా!"

'ఆ! ఏమిటీ? '

'మాన్యఖేటక నగరంలోని వాహ్యాళి మీ చాళుక్యులకు మాయని మచ్చట. ఆ అవమాన చిహ్నాన్ని పగుల గొడతానని ప్రతిజ్ఞ చేశారమ్మా' ఉద్రేకంతో మల్లపరాజు చాడీ చెప్పాడు.

'అయ్యో! మేన మామల పై కత్తి కడతారా? '

'నేను వారించానమ్మా, మీరు బాధ పడతారని చెప్పాను.'

'ఏమన్నాడు? '

'వెంటనే శాంతించాడు '

'అవును. నామాట చెపితేవాలు, నాయనకు శ్రద్ధాభక్తులు. 'మా చాళుక్యులందరం మాతృగణ పరిపాలకుల మమ్మా, తల్లి మాట తప్పము' అని పక్కాణించాడు గర్వంగా మల్లపరాజు, శీలామహాదేవి కంటినీరు తుడుచుకుంది.

''పెద్దన్నగారు శాంతించినా నా మనసులో భయం తగ్గలేదు. ఒక సారి వచ్చిన ఊహ జన్మాంతం మనస్సులో ఉంటుంది. మేనమామలపై కోపం యిప్పటికి చల్లారినా ఎప్పటికైనా రాజుకొనవచ్చును కదా !'' అనుమానం వెలిబుచ్చాడు మల్లప రాజు.

'' అవును దాబు !''

" అందుకనే నిన్న జాగరలో కార్తికేయునికిమొక్కుకున్నాను. మా అన్నగారి కటువంటి ఆలోచన రానియ్యవద్దని వేడుకొన్నాను స్వామిని. రాత్రి నా కలలో కనిపించారు. అభయమిచ్చారు. ఆదేశించారు" చెప్పాడు సవినయంగా మల్లపరాజు.

" శుభం. మేనమామలపై యుద్ధం చేయాలనే వాంఛ పెద్దవాడికింక రానేరాదు. తప్పక గుడి కట్టించు'' అన్నదామె.

" ద్రవ్యం ? " మల్లపరాజు నసిగాడు.

''దానికేం ఎక్కువ నాయనా ? మీ మేనమామలు కట్నాలు కానుకలు ఇచ్చారు. వారిచ్చిన విత్తాన్ని, వారికి క్షేమదాయకమైన ఆలయ నిర్మాణానికే వినియోగించు.'' అని ఆగదిలోనూ, ప్రక్కగదిలోనూ ఉన్న ధన పేటికలనామె చూపించింది. ' కృతజ్ఞుణ్ణి. నేడే వాస్తు శాస్త్రజ్ఞులను దైవజ్ఞులను పిలిపిస్తాను' అన్నాడు మల్లపరాజు లేచి నిలబడుతూ, ' నాయనా, వయస్సులో చిన్నవాడివి. నీవు పిలిపించకూడదు.' అని తల్లి వారించింది.

" మరి ; "

' నీవే వినయ విధేయతలతో వారివద్దకువెళ్ళి అర్థించు' అని హితోపదేశం చేసింది.

' ఆజ్ఞ ' అని మల్లపరాజు సెలవు తీసుకొన్నాడు. శీలా మహాదేవి తిరిగి తన ఆలోచనలో నిమగ్నమైంది. కాలు కాల్చుకొనిన మార్జాలంలాగా ఇటునటు తిరుగుతూ ఉద్యానవనంవైపు దారి తీసింది. కూడా ఇష్టసఖి రాజమవ్వ వస్తున్నా శీలా మహాదేవి గమనించడంలేదు.

పుష్పాల్వితమైన లతా నికుంజంలో ఒక ఆసనంపై హస్తాన్ని చెక్కిలిపై చేయి చేర్చింది. ఒక పరిచారిక ముందు సాగిరాగా, వంశ రంగుని దండ్రిఅయిన కడియరాజు, వినయడి శర్మ అచ్చటికి వచ్చారు.

' కడియరాజులంవారు తమ దర్శనం కోసం వచ్చారు. దేవేరీ'' అంటూ పరిచారిక సవినయంగా విన్నవించుకొంది.

' అమ్మా కడియ రాజుల వారితో పాటు వినయడి శర్మ గారు కూడ వేంచేస్తున్నారు." తనదేవేరి చూడ లేదేమోనని విన్నవించు కుంది రాజమవ్వ పరిచారికను వెళ్ళవచ్చునని సౌంజ్ఞ చేసింది. ' ప్రణామాలు ప్రణామాలు' అంటూ కడియరాజు అతగాని వెనుక వినయడి శర్మా వచ్చి శీలా మహాదేవి ఎదుట నిలిచారు.

' ఆసీనులు కండి. ' అంటూ ఎదుట ఉన్న రెండు ఆసనాలు చూపింది శీలామహాదేవి. ఆమె ముఖం వాడిఉంది. ఆలోచనలు ఎక్కడెక్కడో చెల్లా చెదరుగా ఉన్నాయి. అమ్మా శీలామహాదేవీ! యువరాజులవారి దేవేరులు తామంత విచారగ్రస్తులై ఉండడం యీ సేవకులు సహింపలేరు. తమ దుఃఖ హేతు వేమిటో తెలియచేయండమ్మా" ప్రాధేయ పూర్వకంగా అడిగాడు కడియరాజు.

'' అదేం ప్రశ్న కడియ రాజుగారూ! దేవేరమ్మ పుట్టినింటి నుంచి తిరిగివచ్చారు. బంధు వియోగం విషాద హేతువు కాదా ;'' కారణం ఊహించినట్టు సెలవిచ్చాడు వినయడి శర్మ.

దీర్ఘంగా నిట్టూర్చింది శీలామహాదేవి " వినయడి శర్మగారి ఊహ కొంత వరకు నిజమే. మా పుట్టి నింటి నుండి తిరిగి వచ్చిన తరువాతనే మా యీ దుఃఖం ఇనుమడించింది. నాకు మీ ఇద్దరి సహాయం కావాలి, అన్నదామె.

'' సేవకులం. ఆజ్ఞాపించండమ్మా'' అంటూ ఐక్య కంఠంతో పలి కారు ఇద్దరూ "ఆజ్ఞాపించండి. నెరవేరుస్తాం !" అంటూనొక్కి వక్కాణించారు.

'' మా పుట్టినింటికి మేం వెళ్ళిన అంతరార్థం ముందు విశదపర్చనీయండి.''

"అంతరార్థమా ?"

"అవును కడియరాజుగారూ, రాష్ట్రకూటులకు వేంగి చాళుక్యులకు మధ్య చిరకాల వైరాలు మా మనస్సును బెదిరించి వేస్తున్నాయి."

"నిజమేనమ్మా, పుట్టినింటి వారికీ, అత్తయింటివారికీ దెబ్బలాటలుంటే ఏ ఇల్లాలు నిశ్చింతగా ఉండకలదు "

నొచ్చుకున్నాడు కడియరాజు.

"ఈ రెండు రాజవంశాలమధ్యా కయ్యాలతో పాటు వియ్యాలు కూడా ఉన్నవిగాని, అవి కయ్యమయిన మరునాడొందిన వియ్యాలు కనుక క్రోధాలుపూర్తిగా శాంతించడంలేదని మా ఉద్దేశ్యం. ఏమంటారు?" అడిగిందామె.

"నిజమేనమ్మా, మానాయనమ్మగారు యీ చాళుక్య ప్రభువుల ఆడపడుచే అయినా ఆ సంబంధం అనుబంధం క్రింద మారనేలేదు. యుద్ధంలో ఓడిపోయాక పిల్లని ఇచ్చామన్నబాధ యీ రాజవంశంలో అంతర్గతంగా ఉంది." అన్నాడు కడియరాజు.

"అవును. మా వివాహం విషయంలోకూడా అంతే. మీ రాష్ట్రకూటులుకూడా నన్ను చాళుక్యుల కిచ్చినందుకు కించపడుతూనే ఉన్నసంగతి నాకు తెలుసు. ఈ యుద్ధానంతర వివాహాలు అవస్థాలు" అంటూ శీలామహాదేవి నిట్టూర్చింది.

"సత్యం తల్లీ, సత్యం."

"స్నేహసౌహార్దాలు, సుహృద్భావాలు శాంతి భద్రతలు పెంపొందాలంటే చల్లగా ఏ యుద్ధం లేని కాలంలో ఇచ్చిపుచ్చుకోవడాలు జరగాలని మేం అనుకుంటున్నాం."

"సత్యం సత్యం పునస్సత్యం" అంటూ తన ఏకీభావాన్ని కడియ రాజు తెలియచేశాడు.

"మా విజయాదిత్యునికి వివాహం చేయాలిగదా?"

"శుభస్య శీఘ్రం అన్నారు." అన్నాడు వినయడిశర్మ.

"రాష్ట్రకూట చక్రవర్తి కుమార్తె శంఖాదేవి కూడా యుక్తవయస్కురాలు కదా. ఈ శాంతి వర్ధిల్లుతున్న కాలంలోనే యీ వివాహం జరగాలని మా కోరిక-కాని..."

"మీ అన్నగారితో ఈ విషయంలో సంప్రదించను కదా తమరు పుట్టినింటికి వెళ్ళినది?" కడియరాజు అడిగాడు.

"అవునవును. చిరంజీవి గుణగణాలు మెచ్చారు అన్నగారు. మెచ్చి స్వయానా బిరుదం యిచ్చారు.

"విన్నాం. గుణక వల్లాన్ బిరుదు బహూకరించారటగా!" కుతూహలంగా అడిగాడు కడియరాజు. "అయితే తప్పక పిల్లను కూడా యిస్తారనేగా?"

"లేదు. కడియరాజుగారూ, మా అన్నగారటు మొగ్గడం లేదు. వేరే సంబంధం చేసే ఉద్దేశ్యంలో ఉన్నారు."

అని తిరిగి నిట్టూర్చింది శీలా మహాదేవి.

"మన విజయాదిత్యునికేం లోటని?" ఆశ్చర్యం ప్రకటించాడు కడియరాజు. వినయడిశర్మ ముక్కున వేలుంచాడు. "మా చిరంజీవి ప్రస్తుతానికి మహారాజు మనుమడు మాత్రమే కదా. శంఖాదేవిని దక్షిణాదిన పల్లవనందివర్మకు ఇవ్వాలని ప్రయత్నం చేస్తున్నారట, అతగాడు పాలిస్తున్న ప్రభువు కదా! అయినా ఇంకా పెళ్లిమాటలు పూర్తి కాలేదని విన్నాం. మీరిద్దరూ శంఖాదేవి నెలాగైనా ఈ చాళుక్య వంశంలో యిచ్చేలా మంత్రాంగం చేయాలి"

"ఏం రంపగా అడగాలా! మీ ఊహని ఆజ్ఞగా శిరసావహిస్తాము. మాన్యఖేటకంలోని మన రాయబారి ద్వారా ఇది సానుకూలం చేయించవచ్చునేమో?"

"లాభంలేదు కడియ రాజుగారూ. చేయవలసిన యేర్పాట్లు అవికావు. పల్లవుల రాజ్యంలో చక్రం అడ్డువేయాలి. రాష్ట్రకూటుల విరోధి పిల్లను నందివర్మకు తొందరలో పెళ్లి చేస్తే ఆ జోలికి చక్రవర్తి వెళ్లడు. ఏమంటారు" కుతూహలంగా అడిగింది శీలామహాదేవి ఉత్సాహంతో చేతులు తట్టాడు కడియరాజు. "మంచి ఊహ వినయడి శర్మగారూ! ఈ కౌటిల్య తంత్రం ఆచరణలో పెడితే సత్ఫలితాలు కల్గుతాయి" అన్నాడు.

"పల్లవులతో మిత్రభేదం కన్నా మా రాష్ట్రకూటులతో మిత్రలాభమే మంచిది శర్మగారూ. మాన్యఖేటకంలోనే ప్రయత్నాలు చేయండి" సూచించింది శీలామహాదేవి.

"దానివల్ల లాభం ఉండదేమో నమ్మా"

"మా అన్నగారి విరోధుల నందరిని సంఘటిత పరచడం మునుముందు ప్రమాదమేమో? వద్దు" అంది శీలామహాదేవి. "మీ ఇష్టంమరి" అన్నాడు కడియరాజు.

"మా విజయునికి మేనమామలపై కోపం వచ్చినట్టు విన్నాను. అంతకోపం ఉంటే వారి పిల్లను చేసుకుంటాడా అని కూడా అనుమానం వస్తోంది" అంది శీలామహాదేవి "యౌవ్వనం తీగవంటిదమ్మా ఎటు మలిస్తే అటుమళ్లుతుంది, విజయాదిత్యకుమారుల వారిదృష్టి ప్రాయోచిత విషయాలవైపు మళ్లించడం ఎంతసేపు" అన్నాడు వినయడి శర్మ.

"మరి ఆ ప్రయత్నాలు మీరే చేయించండి శర్మగారూ. నాయన యిప్పటి నుండి రాచపట్టుదల పెట్టుకోవడం మంచిది కాదు" అందామె.

'అలాగే' అన్నాడు వినయడి శర్మ.

"నాయనకి మీపై గురుభావం ఉంది. మీమాట కాదనడు. నాకు నమ్మకం ఉంది"

"అలాగేనమ్మా! చెప్పవలసినది నేను చెప్పాను" అని మాట యిచ్చాడు వినయడి శర్మగారు.

"మీదేభారం మరి" అన్నది దేవేరి.

"చిత్తం. అంతాపరమాత్మ కృప తల్లీ" అంటూ కడియరాజుతో సహా శీలామహాదేవి దగ్గర సెలవు తీసుకొని ఉద్యానవనం దాటి వచ్చాడు వినయడి శర్మ. శీలామహాదేవి కొంత భారం తగ్గినట్టు నిట్టూర్చి తానూ లేచింది. అంతఃపురం వైపునడిచిందామె.

(సశేషం)

## హింసా విధానాలు మన అభివృద్ధికి గొడ్డలిపెట్టు

# శ్రీ ఉమ్మెత్తల కేశవరావు



నిరాడంబరంగా నిర్మాణాత్మకంగా కార్యక్రమాలలో పాల్గొన్న మన రాష్ట్ర నాయకులలో శ్రీ ఉమ్మెత్తల కేశవరావు సుప్రసిద్ధుడు. ఆయన సేవలను భారత ప్రభుత్వం గుర్తించి, స్వాతంత్ర్య సమర యోధుల కిచ్చే తామ్రపత్ర అవార్డును బహూకరించింది. 60 సంవత్సరాల జీవితాన్ని గడిపిన రోజున ఆంధ్రప్రదేశ్ సర్వోదయ మండలి వారు ఆయన సేవలను ప్రశంసిస్తూ, గాంధీ భవనంలో ఘనంగా సన్మానం జరిపారు.

శ్రీ ఉమ్మెత్తల కేశవరావు సూర్యాపేట తాలూకా పిల్లలమర్రి గ్రామంలో జన్మించాడు. తల్లి జానకమ్మ, తండ్రి చక్రపాణి. సామాన్య కుటుంబీకులవడం వలన కేశవరావు బాల్యం చాలా ఒడిదుడుకుల మధ్య గడచి పోయింది. హైదరాబాదులో సుప్రసిద్ధ న్యాయవాది శ్రీ మందుముల రామచంద్రరావు వద్ద పనిచేస్తూ వకాలత్ చదివాడు. 1932లో న్యాయవాద వృత్తిలో ప్రవేశించి 1947 వరకు కొనసాగించాడు. హైదరాబాదులో న్యాయవాద వృత్తిని నిర్వహిస్తున్నప్పుడు ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు గారి సాహచర్యం లభించింది. నిజాం నవాబుకు వ్యతిరేకంగా జరిగిన అకోలా రాజకీయ మహాసభలో పాల్గొన్నాడు. అకోలాలో ఉన్నప్పుడే కీ. శే. జమనాలాల్ బజాజ్ పరిచయ మేర్పడినది. సేవాగ్రాం దర్శించాడు. మందుముల రామచంద్రరావు ప్రభావం వల్ల ఆంధ్ర మహాసభలో పనిచేయడం ప్రారంభించాడు.

1942లో స్టేట్ కాంగ్రెస్ ఆవిర్భవించింది. ఆయన కాంగ్రెస్‌లో చేరి పోయాడు. నల్లగొండ జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడైనాడు. స్వాతంత్ర్య సమర పోరాటంలో పాల్గొన్నందున నిజాం ప్రభుత్వపు నిర్బంధానికి గురి అయ్యాడు. నల్లగొండ సబ్ జయిల్లో 15 రోజులు, హైదరాబాద్ సెంట్రల్ జయిల్లో ఒకటిన్నర మాసాలు, గుల్బర్గా జయిల్లో ఆరుమాసాలు శిక్ష అనుభవించాడు. డిటెన్యూగా ఉన్నకాలంలో ఎక్కువ సమయం అధ్యాత్మిక చింతనలో గడిపినా, హైదరాబాదు రైతుసమస్యలు అనే గ్రంథాన్ని జయిల్లోనే రాశాడు. జయిల్ సూపరింటెండెంటు, జయిలు డాక్టరు పొలిటికల్ డిటెన్యూలపట్ల ఎంతో ఉదారభావాన్ని వ్యక్త పరిచేవారు. హైదరాబాదు రాష్ట్ర విముక్తి పోరాటంలో హిందువులే అధికంగా పాల్గొన్నా, జాతీయ భావాలుగల ముస్లిం అధికారుల పూర్తి సహకారం ఆనాడు వారికి లభించింది.

నిజాం నవాబు, భారత ప్రభుత్వముల మధ్యన రాజకీయ మంతనాలు జరుగుతున్నప్పుడు సుహృద్భావ చర్యగా నిజాం ప్రభుత్వం విడుదల చేసిన పొలిటికల్ డిటెన్యూలలో కేశవరావు ఒకడు. గుల్బర్గా జయిలు నుండి విడుదలైన వెంటనే తన కుటుంబ సభ్యులను కలుసుకొనుటకు ఆయన విజయవాడకు పోయి, పోలీసు చర్య కొనసాగేవరకు విజయవాడలోనే ఉండిపోయాడు. విజయవాడలోనేఆయనకు శ్రీకాకాని వెంకటరత్నంతో పరిచయ మేర్పడినది. రజాకార్ల బారినుండి తప్పించుకొని విజయవాడను తాత్కాలిక నివాస స్థానంగా ఏర్పరచుకున్న హైదరాబాద్ రాష్ట్ర హిందువులకు కీ. శే. కాకాని గారు ఎంతో సహాయం అందించేవారు.

శ్రీ జి. వెంకటరామారావు

పోలీసుచర్య అనంతరము కూడా కేశవరావు నల్లగొండ జిల్లా కాంగ్రెస్ అధ్యక్ష పదవిలో ఉండిపోయాడు. రాష్ట్రంలో జరిగిన మొదటి సార్వత్రిక ఎన్నికల్లో నల్లగొండ జిల్లాలోని 14 నియోజక వర్గాలలో కాంగ్రెస్ ఒక్కటి కూడ నిలబెట్టుకోలేక పోయింది. ఈ ఓటమిని కాంగ్రెస్ ఒక సవాల్‌గా స్వీకరించింది. కొద్దికాలానికి జరిగిన ఉప ఎన్నికల్లో నల్లగొండ జిల్లాలోని మూడు సీట్లలో రెండింటిని కాంగ్రెస్ కైవసం చేసుకుంది. కాంగ్రెస్ సాధించిన యీ ఘనవిజయానికి ఆజిల్లా కాంగ్రెస్ అధ్యక్షునిగాకొంత ఘనత శ్రీ ఉమ్మెత్తలకు తప్పకుండా లభిస్తుంది. ఈ ఉప ఎన్నికలకు ముందు ప్రజాభిప్రాయం అహింసాయుత పద్ధతికి అనుకూలంగా మార్చుటకు స్వామి రామానంద తీర్థ ఏర్పరిచిన చిల్లేపల్లి ఆశ్రమంలో ఆయన స్వామీజీకి అంతేవాసిగా ఉండేవాడు. తెలంగాణాలో భూదానోద్యమాన్ని శ్రీ వినోబాజీ ప్రారంభించినప్పుడు వినోబాజీ మొదటి జట్టులో కేశవరావు ప్రవేశించి, తదాదిగా తన పూర్తి కాలాన్ని సర్వోదయ కార్యక్రమానికి అంకితం గావించాడు.

ఉమ్మెత్తల కేశవరావు చేసిన సేవలకు భారత ప్రభుత్వం ఆయనకు తామ్ర పత్రం బహుమతితో పాటు, రాజకీయ బాధితుల కిచ్చే నెలకు రూ. 200 లు. ఉపకారవేతనం కూడా ఇస్తున్నది. నేటి యువతరానికి ఆయన జీవితం ఆదర్శ ప్రాయమైనది. ★

# బంగరు పూలు

—శ్రీ గంధం జోయెల్

బంగరు పూలు !
ఇవి బంగరు పూలు !
ఇవి అనాథలు—వీటికి
నారు నాటిన వాడు లేడు
నీరుపోసిన వాడులేడు !
ఈ పూలకు వాసనలేదు
ఈ పూలకు పోషణలేదు——
ఈ పూలు
జంటల తొలి వలపుల
పంటల చిహ్నాలు కావు
ఎండకు ఎండవు
వానకు రాలవు !
తేనె సుధల చిలకవు !
కోపమొస్తె పలకవు !
బాధకు బలి కానివి–అయినా
లిల్లీలకన్న, మల్లెలకన్న
మెత్తని మనసున్నవి !
నాకు ప్రియమైనవి
తొంగి తొంగిచూసేవి
వంగి నమస్కరించేవి !
బంగరు పూలు !
ఎవరు అమ్మినా
వెలకట్టలేని పూలు !
రంగుల్ని ఒళ్ళంతా
పులుముకున్న పూలు !
రాత్రంతా కురిసే
మంచుజల్లుతో
జలకాలాడే యవ్వనులు !
బంగరు పూలు !
బంగరు పూలు !

అన్యాయాల్ని, అక్రమాల్ని
సహించని పుష్పాలు !
ఇవి
మంచె ఎక్కిన ఎంకి
సిగలోన ఒదిగేవి,
తామర పుష్పాల్లా
బురదలో బ్రతకనివి
భూమి మీద పూచేవి
అందరికీ అందేవి
కొరివి దయ్యాలను చూచి,
కోపగించుకునేవి
హరివిల్లును పారజూచి
చిరునవ్వులు నవ్వేవి !
నరునికీ, నారాయణునికీ
చేరువగా కదిలేవి,
యుద్ధాన్ని అసహ్యించుకునేవి,
బాంబుల్ని వద్దనేవి,
రంభల్ని రమ్మని పిలిచేవి
ముద్దుముద్దుగా చిరుగాలికి
గంతులేసేవి—ఈ పువ్వులు !
మంచిని తలచేవి
జాతిని కొలిచేవి
ఇంతుల కింపయిన
బంతిపూలు కావు
పువ్వులు–పువ్వులు–పువ్వులు
ప్రతి మనిషికి పవిత్రమైనవి
బతకమ్మకు మనసైనవి
ఇవి బంగరు పూలు !
తంగెడు పూలు ॥

# స్త్రీల పాటలు

—శ్రీ పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు

(గత సంచిక తరువాయి)

కొన్ని పాటలు మానవ హృదయ తంత్రుల్ని కదిలించి రసానందమును, మహదానందమును ప్రసాదిస్తూ వుంటవి.

'ఏడవకు కుశలవుడ రామకుమార
ఏడిస్తే నిన్నెవ్వరెత్తుకొందురు'—

అన్న సత్యమ్మ మాటలు వింటే ఆమె దైన్యస్థితి, ఏకాంతవాసము మనకు అవగతమవుతుంది. ఎంత కఠిన హృదయుడికైనా ఆ పాట వింటే కడుపు తరుక్కు పోవలసినదే. కన్నీరు కారవలసినదే.

స్త్రీల గేయ కావ్యములకు ఉజ్వలమైన రచన 'శ్రీ రామపట్టాభిషేకము'. దీనితో సరి తూగగల మరియొక రచన పరబ్రహ్మ కవి రచించిన 'చిరుతొండ రాజు' కథ. ఇది సిరియాళుని వృద్ధ జంగమునకు ఆహారముగా సమర్పించుటను, సమర్థవంతముగా వర్ణించబడిన మధుర సన్నివేశము. ఇది కరుణరసభరితమైన శైవగాథ. ఇట్టిదే మరియొకటి "లక్ష్మణ దేవర నవ్వు"

ఈ స్త్రీల పాటలలో రసము అంతర్గర్భితముగా చిప్పిలుతూ వుంటుంది. అది పండిత కవుల రచనలలో వలె వాచ్యముగా కనుపించదు. పాటలు చదువుచున్నకొలది, రసము జాలువారి వాచవులూరు చుండును.

రుక్మిణీ కళ్యాణము, అంబరీషుని చరిత్ర, ధృవచరిత్రము, గజేంద్ర మోక్షము, కుచేలుని పాట, మున్నగు కథలన్నీ స్త్రీల పాటలలో అత్యంత ప్రఖ్యాతములైనవి.

స్త్రీల పాటల రచనకు, రామాయణము ఎంతో అనుకూలమైనది. అందలి సన్నివేశములు సహృదయరంజకములై, కవులను, రచయితలను రచనకు పురికొలిపినవి. ఈ రచనలకు మరొక గ్రంథము అంత అనుకూలమైనది గానట్లు గనుపించుచున్నది. దీనికిగల ముఖ్యహేతువు మానవహృదయ స్పర్శ. ఈ మహాకావ్యమువలె సున్నితంగా ఆధిక్యముగా మరియొక గ్రంథమూ లేకపోవడమే నేమో! కనుకనే ఈ స్త్రీ సారస్వతశాఖ నిర్మాతలు రామాయణ గ్రంథమును మూల మూలలనుండి పరిశోధించి, పరామర్శించి తమకు అనుకూలమైన ఏ విషయమునైనను వస్తువుగా గ్రహించి, ఎన్నియో రకములైన పాటల నల్లియుండిరి. ఊర్మిళాదేవి నిద్ర, రాఘవ కళ్యాణము, సీత అగ్ని ప్రవేశము, సీతాదేవి అనవాళ్లు అనునవి ఈనాడు దేశము నలుమూలల్లో అధిక ప్రచారములో నున్న మధురాతి మధురమైన గేయ కావ్యములు. వీనిలో ఊర్మిళాదేవి నిద్రను తిలకిస్తే యథార్థము తెలుస్తుంది.

సీతారాముల ప్రోత్సాహముతో లక్ష్మణకుమారుడు ఊర్మిళాదేవి వద్దకు పోయి, పాన్పుపైన ఆసీనుడై ఆమె దేహమును తన హస్తములతో నిమురుతూ వుంటాడు. ఆ స్పర్శతో ఆమె లేచి కోపముతో "అయ్యా! మీరెవరయ్యా! మీరింత యాగడమ్ముల కొస్తిరి, మా తండ్రి జనకరాజూ విన్నచో మిము యాజ్ఞ జేయక మానరూ మాయొక్క బావ విన్నా! మీకిపుడు ప్రాణమునకు హాని వచ్చూ!" అంటుంది.

"శ్రీరాము తమ్ముండనే—" అన్నాడు లక్ష్మణుడు.

ఈ విధముగా హృదయమును స్పందింప జేయునట్టి మధురమైన సంభాషణ సముచిత రీతిలో సాగినది. కరుణ రసం ప్రతి పదములోను తొణికిసలాడి జాలువారినది.

ఈ స్త్రీల పాటలలో అక్కడక్కడా కొన్నింటిలో తప్ప, చాలా వాటిలో రచయితల పేర్లు కనుపించటములేదు.

"పాడిన వారికి బ్రహ్మలోకము, విన్నవారికి విష్ణులోకము" వంటి ఫలశ్రుతి మాత్రం రచయితలు యిరికిస్తూ వుంటారు చివరన.

## స్త్రీల పారమార్థిక గేయములు

స్త్రీల గేయములలో అధికముగా పౌరాణికములు, పారమార్థికములు. అక్కడక్కడా ఒకటి రెండు చారిత్రిక గేయములున్నప్పటికిని అవి లెక్కలోనికి తీసుకోవటానికి తగినన్ని లేవు.

ఈ స్త్రీల గేయములలో గనుపించునట్టి సీత, రాముడు, కృష్ణుడు, రుక్మిణి, లక్ష్మి మొదలైన వారు మన మధ్యన మసలుతూ వుండే వ్యక్తులవలె భాసించినను, కొన్ని కొన్ని పట్టులలో వారికి గల అతిలోక వ్యక్తిత్వము, మహత్త్వము రెండును గోచరించుచునే యుండగలవు. అది వాటికి గల ప్రత్యేకత, ఆ రచనల యందలి విశిష్టత.

'కౌసల్య వేవిళ్లు', 'రుక్మిణీదేవి వేవిళ్లు' వంటి పాటలు దివ్య వ్యక్తుల వినోదములతో నిండి యున్నప్పటికినీ, వీటి వలన మనకు సత్కాలక్షేపమూ, జీవితముల యందలి మధుర ఘడియల లోని దివ్యస్మృతులూ మనకు గోచరించు చుంటవి. వీటిని పఠించుట వలన మనలో ఒక విధమైన పారమార్థిక చింతన ఏర్పడుతు ది. అయితే, ఈ పారమార్థిక చింతనతో పాటు, మనకు చక్కని వినోదమును, మానసికోల్లాసమును ప్రసాదించగల 'సుభద్రకల' వంటి కొన్ని ఉత్తేజకరమైన మధుర రచనలు అక్కడక్కడ లేకపోలేదు. దీనివలెనే వినోదమును, మనోవికాసమును అందించగల మరియొక మధురమైన పాట 'గుమ్మడు పాట.'

స్త్రీలు వ్రాసిన పాటలను సేకరిస్తే అవి వేలకొలది లభిస్తాయి. కేవలము కథా గేయములు మాత్రమే గాక, మంగళ హారతులూ, బువ్వము పాటలూ, కందార్థములు, ఆధ్యాత్మ

సంబంధమైన పాటలు, తత్వ కీర్తనలూ, పారువేట కథలూ, ఇట్లా ఎన్నో చెప్పుకు పోతూవుంటే సంఖ్యాతీతమైన వెన్నో వున్నాయి. వీటిని బాగా పరిశోధించి చూస్తే నూటికి తొంభై తొమ్మిది పాళ్లు పారమార్థిక చింతనతో నిండిన గేయాలే.

ఇంటికి బయట హరికథలూ, పురాణ కాలక్షేపములు, నాటక ప్రదర్శనలు యెటువంటి వినోదమును, ఆనందమును ప్రసాదించు చుండునో, అట్టి వినోదమునూ, కాలక్షేపమునూ గృహ వాతావరణ ములో పదిమంది స్త్రీలు కలసి ఒకచోట కూర్చొని, దైనందికమైన ఏదో ఒక పనిచేస్తూ కాలక్షేపము కొరకు చదువుకొనే యీ పాటలును ప్రసాదించుచునే యుండును.

దీనినిబట్టి వోపికతో మనము స్త్రీల పాటలను పరామర్శించి చూచిన యెడల, పారమార్థిక వాతావరణముతో పాటు, వినోదము, విజ్ఞానము రెండును ప్రసాదించగల శక్తి యుక్తులు వీటిలో నిండి వున్నట్లు తేటపడగలదు.

ఈ పాటలు స్త్రీల జీవనములో ఆధ్యాత్మిక ప్రవృత్తిని తత్వ సంబంధమైన దివ్య వాతావరణమును పెంపొందింపజేసి, వారి జీవితములకు మంచి వికాసమును వెలుగును ప్రసాదించుటయే గాక, వారికి శీల సంపదను, ఉత్తమ గుణగణములను అలవడునట్లు చేయగలవనుటలో అణుమాత్రము అతిశయోక్తి వుండదు.

'సూర్యుని గుఱ్ఱములు' 'ప్రయాగ ధవళం' 'తులసీవళ పటలాలు,' 'తులసీ మహాత్మ్యమును' వివరించుపాటలు ప్రకృతి వర్ణనలతో నిండివుంటాయి. అవన్నీ మనకు అవ్యక్త మధురా నందము ప్రసాదిస్తూ వుంటాయి.

'పారువేట కథల'ను నామాంతరముగల 'తలుపు దగ్గరి పాటలు' మన దేశంలో అధిక ప్రచారాన్ని పొందివున్నాయి. స్వామివారు వేటకు వెళ్లి తిరిగి ఇంటికి వచ్చినప్పుడు, స్వామికి అమ్మవారికి జరిగిన సంభాషణలే ఈ పాటలలోని కథలు. వీనిని ముఖ్యముగా దేవాలయములలో గానముచేయుచుందురు. "వేంక టేశ్వరస్వామివేట" ఈ పాటలకు మంచి ఉదాహరణము.

"చిట పట చినుకులు దుప్పటి తడిసెను. తలుపు తీయవే భామా! తలుపు తీయవే భామా!"

ఈ పాటలు 'కిటతక' ఆవృత్తాలలో వుంటాయి. వీటిలో శ్రీరాముడూ, చెంచెతా, శ్రీకృష్ణుడూ, దేవకీసుతుడూ, వేంక టేశ్వరులూ వుంటారు. వీరందరినీ నాయకులుగా జేసి రచియించిన "తలుపు" దగ్గరి పాటలున్నాయి. ఈ పాటలన్నింటి యందును స్వామి దివ్యవిభూతిని, మహిమను వర్ణిస్తూ వుంటారు. దేవాలయ ములలో పండుగలకు పర్వాలకు, తదితర పుణ్యసమయాలలో గుమి గూడిన భక్తులకు యివి భక్త్యానందములను ప్రసాదించుటయే గాక సత్కాలక్షేపమును, హృదయమునకు ఆహ్లాదాన్నీ ఆనందాన్నీ ప్రసాదిస్తూ వుంటాయి.

సంవాదరూపములో మరికొన్ని స్త్రీల పాటలు వ్రాయబడి వున్నాయి. ఇవి పండితులు చేయునట్టి నిందాస్తుతులను సర్వ విధముల పోలివుంటాయి.

పార్వతికీ, లక్ష్మికీ, జరిగిన వాదమును తిలకిస్తే ఈ పాటల లోని సొంపు వాటి పరమార్థతత్వము అర్థమౌతుంది-చూడండి.

"గౌరీదేవి! నీ శంభుదేవునికి గళము నలుపేమమ్మా!

గళమున నలుపేమమ్మా!" అని లక్ష్మీదేవి ప్రశ్నిస్తే, ఇక గౌరీదేవి సమాధానం చూడండి-

"నారీమణి! నీ విష్ణుదేవుడు నలుపుగాడటే కొమ్మా

నల్పుగాడటే కొమ్మా!" అని.

ఈలా ఒకరిని, మరొకరు ఎత్తిపొడుస్తూ పోగా పోగా చివరకు శివకేశవుల సమానత్వమూ, అభేదత్వమును ఆ పాట ప్రతి పాదిస్తుంది. దీనివల్ల శివకేశవు లిద్దరు సమానులేనని, వారి ఆధిక్యతను నిరూపించటానికి జరిగే ప్రయత్న మంతా వృథాయేనని, వ్యర్థకలహములతో కాలక్షేపం చేయటము తప్పని, అది మూర్ఖుల లక్షణమని తెలుతుంది. దీని వలన ఆనాటి సామాజిక వ్యవస్థగూడ కొంత మనకు తెలుస్తుంది. ఈ కోవకే చెందిన మరొక పాట ఈశ్వర భృంగి, పార్వతీ సంవాదము ఇదియును వినోదమును విజ్ఞానమును, నీతిని, ధర్మాన్ని ప్రసాదించు నట్టిదే.

ఇదే విధముగా వైష్ణవ భక్తిని ప్రబోధము చేస్తూ రచియించ బడ్డ పాటలు మరికొన్ని వున్నాయి. "తిరుమంత్రము" అను పాట పూర్తిగా పారమార్థిక తత్వమును ప్రబోధము చేయునట్టిదే. ఈ గేయములో వైష్ణవభక్తి సంబంధమైన మార్జాల కిశోర, మర్కట కిశోర న్యాయములు రెండు ఎంతో చక్కగా వర్ణింప బడ్డాయి.

'రామమానసపూజ' 'భ్రమరగీతలు' రెండూ వైష్ణవ భక్తిని, విష్ణుదేవుని మహిమలను ప్రతిపాదించు ఉత్తమోత్తమ మైన రచనలు, ఈ రెంటియందు విష్ణుదేవుని దివ్యమహిమలు అడు గడుగునా అతిలోక రమణీయముగా వర్ణించ బడివున్నాయి.

'భ్రమర గీతము' లలో ఒక గోపిక, హరి పాదార విందముల పై హృదయాన్ని లగ్నముచేసి భక్త్యావేశముతో మనస్సును "భ్రమరా!" అని సంబోధించి పాడిన ఈ పాటను గమనించండి. దీనిలో భక్తి ప్రేమ తత్వములు రెండు పెనవేసుకొని పరా కాష్ఠనందుకొన్నవి.

"వానిపేరే కాని వేరొక వార్తాడదు జిహ్వా! వాని రూపెగాని కానగ నోచవు మాకళ్ళు—" అంటుంది. దీనిలో ఆమె నిర్మలమైన లోతైన భక్తి భావతత్పరత ఎంతో రమణీయముగా ప్రతి బింబిస్తున్నది.

"వైకుంఠ వర్ణనము," "లక్ష్మణ ఉపదేశము," "వేదాంత కుచ్చల కథ," "వశిష్ఠవాక్యములు," మున్నగున వన్నియు వైష్ణ వుల మధురభక్తికి, ప్రేమతత్వమునకు మహోజ్వల పతాకలు. వీటిని పఠిస్తూవుంటే భక్త్యావేశముతో మనల్ని మనం మరచిపోతాము.

(తరువాయి 41వ పుటలో)

# విషాద గీతం

— శ్రీ మంజీర

నిశాకాంత ఒడిలో...
నిదురిస్తున్నావా బాబూ
నిదురలే, నిదురలే
దిగంతాలకు దగ్గరగా నిలిచి
నిర్మల హృదయంతో జీవించు
నిశాకాంతను వదిలేసి, ఉషఃకాంత ఊహల ఉయ్యాలలమీద కూచో

లయరహితమైన లోకప్పు వింతలను
దిగంతాల దాకా చూద్దువుగాని,
మానవత్వం మరుగున్పడి
దానవత్వం కన్నుల పొడుచుక తింటున్నపుడు
అమాయకుల విషాదాశ్రుకణాల మహానదులు
ఉప్పొంగి;, ఊళ్లను ముంచెత్తుతున్నప్పుడు
ఊయలనుండి చూద్దువుగాని
నిదురలే, నిదురలే...
నిశాకాంత ఒడిని వీడి
ఉషఃకాంత చెలిమి కోరి
వెలుగులో ఆడే
వేయి పడగల నాగుల
బుసలు విందువుగాని
జీవితంలోని గంపెడు కష్టాలు తిందువుగాని, నిదురలే, నిదురలే
వెలుగంటే నిండు పౌర్ణమినాడు కలిగే
వెన్నెలనుకున్నావు కాబోలు
అగ్నికి కొందరు ఆజ్యం పోస్తే ఆవిర్భవించే వెలుగు ఒకటి

దానికి ఆహుతి అయ్యేవారి గుండెల మంటల వెలుగొకటి
చూద్దువుగాని, నీ ఊహా చిత్రాలకు సరిక్రొత్త మార్పుల రంగులు పూద్దువుగాని

నిదురలే, నిదురలే...
ఈ నిశా విషాద గీతం పాడడం మానుకు
ఉషోజ్జ్వల సంగీత సాధన చేద్దువుగాని
నిదురలే, నిదురలే...



# "జారి"

"వద్దు. నేను తీసుకెళ్ళను."

ఎనిమిదేళ్ళ రాజా మారాం చేయటం మొదలు పెట్టాడు, రోజూ లాగానే.

"రేపటినుంచీ ఇవ్వనులే. ఈ ఒక్క రోజుకీ తీసుకువెళ్ళు."

బ్రతిమాలింది రాజా తల్లి, కొడుకుని.

"వూఁహూ. తీసుకెళ్ళనంటే తీసుకెళ్ళను."

"ఈ ఒక్కరోజే అన్నాగా"

"రోజూ ఇలాగే అంటావు"

"ఏడిశావ్ లేవోయ్ తీసుకువెళ్ళు. మధ్యాహ్నం ఆకలి వేస్తే అప్పుడు తెలుస్తుంది."

"నాకేం ఆకలి వెయ్యదు."

అప్పటిదాకా తల్లీ కొడుకుల సంభాషణ వింటూ, భోజనం చేస్తున్న రవికాంత్‌తో అన్నది రాజా తల్లి విసుగ్గా.

"చూడండి. రోజూ వెధవది ఇదే గొడవ. ఛస్తున్నాను వాడిని బ్రతిమాలలేక. మీరయినా నాలుగు కోప్పడండి"

రవికాంత్ మౌనంగా వుండిపోయాడు ఎవరి పక్షం వహించక. ఎందుకంటే తనకి తెలుసు, రాజాకి తనతోపాటు ఆ స్టీల్ గిన్నెనిండా తిను బండారాలు తీసుకువెళ్ళటం ఇష్టంలేదు. చేతిలో పుస్తకాలతో ఫ్రీగా వెళ్ళాలనుకుంటాడు. నిజానికి అసలు స్వంతంగా, కింద పారేసుకోకుండా తినే తెలివిలేదు రాజాకి. ఇంట్లో అమ్మ కలిపి పెడితేనే తింటాడు, కంచం చుట్టూ పోస్తూ, తిట్లతో పాటు.

ఎంత చెప్పినా వినిపించుకోదు రాజాతల్లి. కొడుకు ఎక్కడ ఆకలితో బాధ పడతాడోనని, ఎక్కడ చిక్కిపోతాడోనని భయం. అందుకే బలవంతంగా రాజాకి మధ్యాహ్నం తినేందుకు అంటకడుతోంది రోజూ.

ఓసారి రాజా స్టీల్‌టిఫిన్ గిన్నె పారేసుకువచ్చాడు కూడా, స్కూల్‌లో ఆటల్లో. అయినా అరటి ఆకులో తినేందుకేదయినా కట్టి ఇవ్వకుండా వుండలేదు రాజాతల్లి, కొడుకు ఎంతవద్దని మొత్తుకున్నా.

ఎనిమిదేళ్ళ రాజాకి ఏడుపు వచ్చింది. తనమాట నెగ్గలేదని కోపంతో ఏడుస్తూ, రెండుకాళ్ళు నేలమీద బలంగా, లయగా కొడుతూ, చిందులు తొక్కుతూ నడిచాడు బయటికి చేతిలో పుస్తకాలతో, తల్లి కట్టిఇచ్చిన టిఫిన్ పొట్లంతో.

"నే అసలు తిననే తినను ఇది. మురిగ్గుంటలో పారేస్తాను పో"

కోపం, ఏడుపులతో అన్నాడు రాజా గుమ్మంలో ఆగి.

"ఏదీ పారేయి చూదాం?" అడిగింది రాజాతల్లి విసురుగా.

తల్లిముందు అలా పారేయగలిగే ధైర్యం లేదు రాజాకి. తల్లిమాటకి అసలు ఎదురుచెప్పే ధైర్యమే లేదు.

"సందు తిరిగాక పారేస్తాను."

"నీ ఏడుపేదో నువ్వు ఏడు" అన్నది రాజాతల్లి కొంగుతో చెయ్యి తుడుచుకుంటూ.

"స్కూలుదాకా తీసుకువెళ్ళను అసలు"

చొక్కా అంచుతో కళ్ళమ్మట కారిన నీరు తుడుచుకుని నడిచాడు రాజా.

---

### శ్రీ మల్లాది వెంకట కృష్ణమూర్తి

---

"ఆగు, మీనాన్న వస్తున్నారు"

గదమాయించింది రాజా తల్లి.

రవికాంత్ స్కూటర్ బయటకి తీసుకువచ్చి స్టార్ట్ చేశాడు.

అలాగే నిలబడిపోయాడు రాజా.

"ఎక్కు"

తల్లి అరుపుతో రాజా స్కూటర్ వెనకాల ఎక్కి తండ్రిని పట్టుకున్నాడు, కూర్చుని.

"వెళ్ళొచ్చా" అడిగాడు రవికాంత్ నవ్వుతూ.

"అలాగే"

స్కూటర్ పోనిచ్చాడు రవికాంత్ క్లచ్ వదిలి.

"నేను తినను ఇది పారేస్తాను"

రాజా మాటలు స్కూటర్ చప్పుడులో కలసిపోయాయి.

"ఏమిటి? స్కూలుకు వెళ్ళనని గొడవ చేస్తున్నాడు మీవాడు?"

ఎదురింటావిడ వీధి గుమ్మంలో నిలబడివున్న రాజా తల్లిని అడిగింది నవ్వుతూ.

"గొడవేముంది ? చిన్నతనం", నోపటికి వెళ్ళిపోయింది రాజా తల్లి. తన సంసార విషయాలలో ఎవరయినా జోక్యం కలగ చేసుకుంటే బావుండదు రాజా తల్లికి.

మూడు ఫర్లాంగుల దూరంలోవున్న ఓ కూడలిలో ఆపాడు రవికాంత్ స్కూటర్‌ని. వెనకాల కూర్చున్న రాజా దిగాడు జాగ్రత్తగా.

"జాగ్రత్తగా వెళ్ళు"

"అలాగే"

స్కూటర్ మీదే కూర్చుని చూశాడు రవికాంత్, రాజా కొద్ది దూరంలోవున్న బడివైపు వెళ్ళేంతవరకూ. రాజా కను మరుగవగానే స్కూటర్‌ని తన ఆఫీసువైపు పోనిచ్చాడు.

వారం రోజుల తర్వాత గొడవ మానేశాడు రాజా. టిఫిన్ పాకెట్ తీసుకు వెళ్ళనని గొడవ చేయడం మానేశాడు. తల్లి కట్టి ఇచ్చేది మారు మాట్లాడకుండా తీసుకు వెళ్తున్నాడు.

"వద్దంటే నాకెందుకు ఇస్తావు ? నాకిచ్చే బదులు రోజూ మాదాకవళం వేయమంటూ వచ్చే ఆ ముష్టాడికి వేయరాదూ ?" అని సణగడం లేదు.

'ఛీ. మధ్యాహ్నం తిందామని తీస్తే అరిటాకు వాసన గారె అంతా' అని గొణగడం లేదు.

'మురిగ్గుంటలో పారేస్తానంతే' అని చిరాకు పడటం లేదు.

పుస్తకాల సంచీనిండా పుస్తకాలు సర్దుకొని, స్కూల్‌కి వెళుతూ, ఒకవేళ తల్లి మర్చిపోతే 'అమ్మా! టిఫిన్ పాకెట్' అని గుర్తుచేసి మరీ తీసుకు వెళ్తున్నాడు రాజా.

"అబ్బ. వెధవ గొడవ తగ్గింది. ప్రతీరోజు ఉదయం వాడితో వాగివాగి చచ్చేదాన్ని" రాజాతల్లి రవికాంత్‌తో, "పెద్ద అవుతున్నకొద్దీ మంచిబుద్ధు లబ్బుతున్నాయి. ఇదివరకయితే ఫర్వాలేదు." అంటుంది.

ఎప్పటిలా చిరునవ్వునవ్వి వూరుకుంటాడు రవికాంత్ ఏం మాట్లాడకుండా.

'వీడిని చూడండి, వీడ్ని కేకవేయండి' అంటూ గడ్డం గీసుకుంటూ-ఉనో, పేపర్ చదువుతూ-టూంటేనో అడ్డు పడటం లేదు రాజా తల్లి రవికాంత్‌కి. అందుకే హాయిగావుంది రవికాంత్‌కి.

వారంరోజులుపోయాక రాజా కొత్తగా 'నాకిది కావాలి' 'ఇవాళఇదిచేసి పెట్టు' అని అడగటం కూడా ప్రారంభించాడు

స్వతహాగా లోభి అయినా, కొడుకు నోరార అడిగితే ఎంత ఖరీదయిన పిండివంటయినా చేసిపెట్టడం రాజా తల్లి వంతయింది ఇప్పుడు.

ఓ రోజు హటాత్తుగా అడిగింది రాజాతల్లి రవికాంత్‌ని.

"మనవాడు నిజంగా తింటున్నాడంటారా రోజూ ? పిల్లలకి పెట్టేస్తున్నాడేమో ?"

"ఏమో ? తినక పడేస్తాడు, కావాలని అడిగి తీసుకు వెళ్తుంటే." అన్నాడు రవికాంత్.

"అయినా రేపు మరో వాకబు చేయండి."

"అలాగే" అన్నాడు రవికాంత్ కొంచెం విసుగ్గా. ఇలాంటివి పట్టవు రవికాంత్‌కి.

"అలాగే కాదు, ఇలాగే కాదు. రేపు ఆఫీసుకు వెళుతూ ఏ సంగతీ కనుక్కోండి మర్చిపోకుండా. వాడు తినకపోతే ఈ వృథా శ్రమ, ఖర్చు మానేస్తాను."

"తప్పకుండా కనుక్కుంటాను."

"ఇందాక అలాగే ఇప్పుడు తప్పకుండా అన్నారు. రేపు ఏమయిందని అడిగితే మర్చిపోయా నంటారు. కాస్త జ్ఞాపకం వుంచుకోండి."

మర్నాడు ఉదయం భర్తకి మరోసారి గుర్తుచేసింది, రాజా తల్లి, సంగతి కనుక్కోమని.

ఎప్పటిలా స్కూటర్ ఆపాడు రవికాంత్, కొడుకు కనుమరుగయేదాక ఆగి స్కూటర్ పోనిచ్చాడు.

ఆఫీస్ వైపు కాదు, ఎప్పటిలా.

రాజా స్కూల్ వైపు భార్య చెప్పిన మాటలు గుర్తున్నాయి ఇంకా. స్కూటర్ బ్రేక్‌వేసి ఆపాడు రవికాంత్ స్కూల్‌కి కొంచెం దూరంలోనే.

ఎదురుగా వున్న దృశ్యం చూశాడు. రాజా ఫుట్‌పాత్ ప్రక్కన ఆగి, తన చేతిలోని అమ్మ కట్టిఇచ్చిన టిఫిన్ పాకెట్‌ని, ఫుట్‌పాత్ మీద కూర్చుని వున్న ఓ శిలాకారంలో వున్నతనికి అందిస్తున్నాడు.

అతను ఆత్రుతగా అందుకున్నాడు దాన్ని. రాజాతో ఏదో అన్నాడు. 'వేయ్యేళ్ళు చల్లగా వుండు' లాంటి ఆశీర్వాదం అనుకున్నాడు రవికాంత్.

రాజా ఆ బిచ్చగాడితో ఏదో చెప్పి ముందుకు నడుస్తూ ఎందుకో వెనక్కి తిరిగిచూశాడు ఓసారి.

కొద్దిదూరంలోనే స్కూటర్ మీద కూర్చుని గమనిస్తున్న తండ్రిని చూడగానే రాజా గుండె ఝల్లుమంది.

కొద్దిగా భయంగా, గబగబా అడుగులు వేశాడు రాజా స్కూల్ వైపు. రాజా వైపు స్కూటర్ పోనిచ్చి ప్రక్కన ఆపి అన్నాడు రవికాంత్.

"ఎక్కు. ఇవ్వాళ స్కూల్‌దగ్గిర దింపుతాను"

మామూలుగా అన్నాడు రవికాంత్. రాజా వెనకాల ఎక్కి కూర్చున్నాడు. ఇద్దరూ ఏం మాట్లాడలేదు. మౌనంగా వుండి పోయారు. స్కూల్ దగ్గర స్కూటర్ దిగి అడిగాడు రాజా తండ్రిని.

"వెళ్ళనా?"

వెళ్ళు. టైం అయిందిగా"

వెనక్కి తిరిగి వస్తూ ఫుట్‌పాత్ మీదకూర్చుని వున్న ఆ బిచ్చగాడి ప్రక్కన ఆపాడు రవికాంత్ స్కూటర్‌ని.

ఆత్రంగా రాజా ఇచ్చిన టిఫిన్ తింటున్న అతని వంక చూసి అడిగాడు రవికాంత్ కొన్ని క్షణాల తర్వాత.

"ఆ కుర్రాడు రోజూ ఇస్తుంటాడా తినడానికి ఏమయినా?"

ఆ బిచ్చగాడు తినడం ఆపి రవికాంత్ వంక అనుమానంగా చూస్తూ అడిగాడు.

"ఏం?"

"ఏం లేదు. వూరికేనే"

"అవును. రోజూ ఇస్తాడు"

"ఎన్ని రోజుల నుంచీ?"

"నువ్వా కుర్రాడి నాన్నవా? రేపటినుంచీ ఆ కుర్రాడికి ఏం ఇచ్చి పంపరా?" అడిగాడు బిచ్చగాడు ఆదుర్దాగా.

"కాదు" అబద్ధం ఆడాడు రవికాంత్. "పది పదిహేను రోజుల నుంచి రోజూ తినడానికి ఏదయినా ఇస్తున్నాడు, కలవరోజులు తప్పించి."

చిన్నగా నిట్టూర్చాడు రవికాంత్.

"అసలు బ్రతికేటోడిని కాదు నేను."

ఆ బిచ్చగాడు తను తొడుక్కున్న చింకి చొక్కా ఎత్తి, పొత్తికడుపు మీదవున్న నల్లటి మాసిన బేండేజ్ పంక చూపించాడు.

"ఏదో పెద్ద రోగం వచ్చి గవర్నమెంట్ ఆస్పిటల్‌లో ఆపరేషన్ చేశారు. ఆ కుర్రాడు ఇచ్చేదితిని బ్రతుకుతున్నాను. కదిలే ఓపిక లేదు."

"ఆకుర్రాడు అంత మంచివాడు కాక పోతే ఎప్పుడో చచ్చేవాడు ఈ ముసలాడు"

ప్రక్కన వున్న కిళ్ళీ కొట్టులో కూర్చొని వున్న అతను అన్నాడు రవికాంత్‌తో, అంతవరకూ వాళ్ళ సంభాషణ వింటున్నాడు.

వెంటనే స్కూటర్ పోనిచ్చాడు రవికాంత్.

రాత్రి భార్య అడిగింది రవికాంత్‌ని, రాజా నిద్రపోయాక.

"నేనడిగింది ఏం చేసుకువచ్చారు? మనరాజాయే తింటున్నాడా? ఎవరికయినా దానంచేస్తున్నాడా?"

"వాడే"

"పోనీలెండి"

కొన్నిక్షణాలు ఆలోచించి అన్నాడు రవికాంత్ భార్యతో, "రేపటినుంచి నాక్కూడా ఏదయినా కట్టివ్వు తినడానికి"



---

# స్త్రీ ల పా ట లు

(37వ పుట తరువాయి)

ఇవన్నీ స్త్రీల కొరకు వ్రాయబడిన పారమార్థిక గేయములు. ఇవి పాటల రూపములో ఉన్నప్పటికి సులభముగాను, సుబోధకముగాను, సుందరముగాను వుండి మనకు ఆత్మానందాన్ని కలిగిస్తుంటాయి. అందరు హాయిగా చదువుకొని ఆనందించటానికి, సత్కాలక్షేపానికి ఉపయోగపడేట్లు మిక్కిలి అనువుగావున్నాయి.

ఇవిగాక కందార్థములు, భక్తిపూరితములైన ప్రకీర్ణగేయములు ఎన్నో వున్నాయి. ఈ కందార్థమును తిలకించండి తెలుస్తుంది.

"గోపెమ్మ! నీ కుమారుడు పాపడు కాడమ్మ, పాల భాండము లెల్లన్ వూపెట్టు పుట్ల కెగయగ, వాపోవగ జుర్రెనోహో!" ఇదంతా కందపద్యమే.

వీటివలెనే ఉత్పలార్థములు వున్నాయి.

ఈ కందార్థములు, ఉత్పలార్థములు రెండును పండితకవులు స్త్రీల పాటలలో ప్రవేశపెట్టిన మరొక మెట్టు. వాటిని ఉన్నత పథాలకు చేర్చేదివ్యసోపానము 'సీతపాట' ఈ స్త్రీల పాటలకు ఉత్తుంగ శిఖరము వంటిది. ఇందలి ఇతివృత్తంతోపాటు రచనగూడ చాల విశిష్టమైనది.

శ్రీ పరశురామపంతుల లింగమూర్తి వంటి పండిత ప్రకాండుడు, జిజ్ఞాసువులకు బ్రహ్మ విద్యా రహస్యము వంటి మహత్తర విషయములను వ్యక్తముచేయ సంకల్పించి ఈ సీతపాటను రచియించెనని పెద్దలు భావించిరి. దీనివంటి మధురమైన మరియొక ఉత్తమ రచన "శ్రీశైల భ్రమరాంబాష్టకము."

ఈ స్త్రీల పాటలన్నింటిలోను తెలుగువారి సహజ సంస్కృతి, ఆచార వ్యవహారములు నాగరికతా వైభవములు, భక్తితత్పరత మొదలైనవన్నీ సంపూర్ణముగా వ్యక్తమౌతుంటాయి. గృహజీవితములో గృహలక్ష్మికున్న స్థానము అద్వితీయమైనది. ఆమె నోటి నుండి వెలువడిన ప్రతి మాటలోను, ప్రతి పాటలోను గృహసంబంధమైన సంపూర్ణ అనుభవము, జీవితపరమార్థము దర్పణములోవలె ప్రతిబింబిస్తువుండగలదు. గృహ సంబంధమైన వాతావరణమునకు అనుభూతులకు, ఆలోచనలకు, అనుభవములకు ఈ స్త్రీల పాటలు పెట్టని కోటలు. అనంతమైన స్త్రీల విజ్ఞానమునకు యివి మధుర పీఠికలు. ఈ విజ్ఞానభాండారము వారి స్వార్జితము, కష్టార్జితము గనుకనే అవి ఇంతటి ప్రతిభావంతములై, కాలప్రవాహమున సంభవించు ఆటుపోటులకు ఎదురొడ్డి, కలకాలము నిలిచి ప్రజాహృదయములకు ప్రమోదామోదములను కలిగించుచున్నవి.



సీరియల్

# ఎవరికోసం

కోటకమలాదేవి

## 3

''అమ్మా...నీలా!...నీకు ఉత్తరం వచ్చిందమ్మా"...అని పిలిచాడు సుబ్బయ్య, వీధి అరుగు మీద కూర్చొని మద్దెల శృతులు సరి చేసుకుంటూ, పళ్ళ వరుసల మధ్య పెదిమలు బిగించి పట్టుకొని మధ్య మధ్య మద్దెల మ్రోగించి శృతి చూసుకుంటూ...

నీల లోపల నుండి ఒక్క గెంతులో వచ్చింది. "ఎక్కడనుండి నాన్నా"... అంది. "ఏమోనమ్మా నాకేం తెలుసు తల్లీ పోస్టు బంట్రోతువచ్చి మిస్ నీలా అంటూ విసిరి పోయాడు. అయినా అది ఇంగ్లీషులో ఏడుస్తుంది!...నాకేం సంతకమయినా చేయడం తెలుగునే వచ్చి యేడవదు...పదేళ్ళు వంటి మీద పడింది మొదలు . మద్దిలకొడుతున్నాను ఆ చదువేంటో తెలియక పోయింది. నాచిన్నప్పుడు ఒక సారి మద్దిల కొట్టి వస్తుంటే ఒక ఆయన నాకు ఐదు రూపాయలు ఇచ్చి సంతకం పెట్టరా అబ్బాయీకుర్రాదవైనా మద్దిల బలే వాయించావని ఒక చిటుకు విసిరాడు...దాంతో ఉబ్బిపోయి...ఆయన చేతిలో కలం అందుకున్నాను. ఆ సంతోషంలో సంతకం పెట్టడంరాదని మర్చిపోయాను. కలంచేత పట్టుకునే ఆయన కేసి వెర్రి మొఖం వేసుకొని చూచాను... 'ఏరా చూస్తావు నాముఖంలో ఏముంది' అన్నాడాయన...ఆ కాదండి నాకు సంతకం చేయడం... రాదు అన్నాను, ఓరి సంతకం చేయడమైనా రాకుండా మద్దిల వాయించి రోజుకి అయిదు రూ॥లు సంపాదిస్తున్నావూ...చదివిన వాడికంటె చాకలాడు మేలంటారు ఇదేలా వుంది. మాకంటె నీవే నయంరా కుర్రాడా మేము చదివి వెలగబెట్టి నెలకు వంద సంపాదిస్తున్నాము అన్నాడు. పోనీలే...వేలిముద్దర కొట్టు...అని నా బొటన వ్రేలికి సిరారాసి నిశానీ కొట్టించాడు.

"అమ్మయ్య! బతుకు జీవుడా! అనుకున్నాను. సంతకం చేయక పోతే ఆ ఇచ్చే అయిదు రూ॥లు యివ్వడని భయపడ్డా... అప్పట్నుంచి ఇప్పటి దాకా ఆవేలిముద్దరలోనే అరవ యేళ్ళు చూసానమ్మా! కొన్ని వేలు సంపాదించాను తల్లీ!" అని మళ్ళీ తన మద్దిల శృతిలో కలిపివేశాడు తన దృష్టిని.

నీల ఉత్తరం తిరగేసి చూసి కేశవ దగ్గర నుండి అని తెలుసుకొని నీటిలో కలువంత ముఖం చేసుకొని లోపలకు పరుగెట్టింది.

"ఎక్కడ నుంచమ్మా? నీలా... ఆనాటకాల అబ్బాయేనా రాస్తా!" అన్నాడు సుబ్బయ్య.

"అదేమిటి నాన్నా! అంత ఆర్టిస్టుని చదువుకున్న వాడిని పట్టుకొని అలా అంటావూ...ఆయన పేరు కేశవని నీకు తెలియదా" అంది కేశవ మీద అంతర్గతంలో ఉన్న అభిమానాన్ని వెలిబుచ్చుతూ. "ఏదో తేలికగా...వచ్చింది అన్నా నమ్మా ఇంతకీ ఏం రాశాడు మళ్ళీ ఎక్కడైనా నాటకం వేస్తున్నాడా?" అన్నాడు మద్దిల ఒళ్ళో పెట్టుకుని తలవూపుతూ మద్దిల కొడుతూ. "కాదు...నాన్నా ఆయన మన వూరు చూడాలని వస్తున్నారుట. ఆ మనవూరేం ...మహాపట్నమా చూచేందుకు. రావడానికి యేదో వంక" అన్నాడు. "అదికాదు నాన్నా ఎండాకాలం శెలవల్లోకూడా ఆపట్న వాసం రొదల్లో సొదల్లో ఉండాలనంటే బాధగా ఉందిట. పైగా మురికాల్వలవలకుళ్ళుకంపు ఎండాకాలంచేత ఇంకా ఎక్కువగాఉందనీ కాస్త నిర్మలమైన వాతావరణం కొరకు పల్లెటూరి పరిసరాల రమ్యమైన ప్రకృతి అనుభవించడానికట నాలుగు రోజులుండి వెడతారుట అని నసుగుతూ మాటలు నమిలేస్తూ చెప్పింది నీల, కేశవ లెటర్" చదువుకొని మడిచి లోపల పెట్టేసింది. కొంత ఆమెలో ఉత్సాహం, ఉరకలు వేసింది. ఆవున్న కాస్త ఇల్లు శుభ్రం చేయ నారంభించింది. ఇంట్లోలేని వస్తువులు చూచి తండ్రిని తెమ్మని పురమాయించింది.

సుబ్బయ్య మనస్సు కొంత వరకు సంకోచంలో పడినా నీలయొక్క కళకు మెరుగులు దిద్ది ప్రపంచం దృష్టిలోనికి తెచ్చినది, రేపు సినిమాస్టార్ కాబోతున్నది, కేశవ మూలానే కదా అని సరిపెట్టుకొని మనస్సుని సమాధాన పరచుకున్నాడు.

పోనీ, నీలని వివాహమాడమని అడుగుదామంటే నీల రేపు సినిమాస్టార్ అయి లక్షలు సంపాదించ బోతుంది. ముందే వివాహం చేస్తే రేపు నీల సంపాదించే దంతా తనకే హక్కు అంటా డేమో అని ఒక ప్రక్క భయం, బల్లెంలా పొడుస్తోంది.

"నీలా! చూడు తల్లీ ఈసారి నిన్ను సినిమాల్లోకి తీసుకోక పోతే నాటకాలు, గీటకాలు లాంటి బూటకాలు పనికి రావమ్మా యి. ఈ వయస్సులో ఉన్న మగ కుర్రాళ్ళు ఉన్నారే, నమ్మరాని మోసగాళ్ళు. కల్లబొల్లి ప్రేమ కబుర్లు చెప్పి ఆడపిల్లల్ని అన్యాయం చేస్తారు. అలాకొన్నాళ్ళు అందమైన ఆడ పిలలతో ఆటలాడి మాయచేసి చటుక్కున యే ఆస్తులు, అంతస్థులూ ఉన్న వాళ్ళనో పెళ్ళాడి కూర్చుంటారు. ఈకాలం మగ పిల్లలకి సిగ్గు లేదు కానీ ఆడపిల్లలు మాత్రం వాళ్ళల్లా మనస్సు మళ్ళించు కోలేక ఆత్మగౌరవం, వంశ మర్యాద నిలబెట్టు కోవాలని వెనక ముందులు ఆలోచించకుండా యే ఆత్మహత్యో తలపెడ తారమ్మా" అన్నాడు పెద్ద తరహాగల సుబ్బయ్య.

"నాన్నా! కేశవ అలాంటి నీతిని విడనాడే కోతి కాదు. చాలా మంచివాడు. ఆడపిల్లలు మాత్రం ఏం తక్కువ తిన్నారా యేం? ప్రేమించామంటూ బయలు దేరి ప్రగల్భాలు పల్కి చివరకు ఎందరు ఆస్తుల్ని, అంతస్తుల్ని చూసుకొని ప్రేమించిన వాణ్ణి అన్యాయం చేయలేదు. కాని, మగవాళ్ళు ఆత్మహత్యలకు పూనుకోకుండా పిచ్చి వాళ్లై తిరుగుతే ఆడది ఆత్మహత్య చేసుకుంటోంది. మంచి మనసులున్న వాళ్ళు ఆడ, మగ, కూడ ఒకటే. రెండు కళ్ళూ నాన్నా దేశానికి," అంది న్యాయబద్ధంగా సుబ్బయ్య మద్దెల వాయించు కుంటూ...తల ఉయ్యాలలాగా ఊగించు కుంటూ, కేశవ ఉత్తరం చదువుకొని సంబరపడుతున్న నీల ముఖంలోకి తేరిపార చూశాడు.

ఆమెకు కేశవ యందు గల అభిమానాన్ని గ్రహించాడు.

"సరేనమ్మా సరే...కానీ..."అంటూ మాట ఆపేశాడు.

నీల అంతర్గత అభిప్రాయాన్ని ఒక్క క్షణంలో ఆమె ముఖకవళికలను బట్టి గ్రహించాడు. దైవంకూడా సహకరిస్తే ఆమె కోరిక నెరవేరితే తనకి కావలసినదేముంది! అని అనుకున్నాడు. ఒక అనాథ బాలికను తను చేరదీసి పెంచిన ఆదర్శం నెరవేరుతుంది. ఆమె భవిష్యత్తుకు ఏ లోటూ ఉండదనీ...తనకు చింతేలేదని ఊహించాడు. తీయని తలపుల్లో కొంతసేపు తేలిపోయాడు.

కేశవ రాక కొరకు నీల నిముషాలు, క్షణాలు లెక్క పెట్టింది. ఎంతసేపైనా గంటలు రోజుల్లాగా, రోజులు యుగాల్లాగా నడవసాగాయి.

ఉన్న చిన్న యిల్లును రంగయ్యను శుభ్రం చేయమంది. వంటమనిషి గంగమ్మను పిలచి ఇంట్లోకి కావలసినవన్నీ చెప్ప మంది. సుబ్బయ్య ఆ రోజు రాత్రి శ్రీశైలం సంగీత కచేరీకి వెళ్ళాలన్నాడు. రైలు వేళకు ముందుగా వంట కావాలని పురమా యించి, నీలను పిలచి కొంత సొమ్ము ఇచ్చి ఖర్చు చేయమని చెప్పాడు.

రాత్రంతా రైలు ప్రయాణంతో అలసిపోయిన శరీరాలతో ఘటాలను రైల్లోంచి క్రిందికి చేరవేస్తున్నారు జనం. అది చాలా చిన్న స్టేషను అవడం చేత రైలు ఒక్క క్షణంలో కూత కూసి కదిలిపోయింది. స్టేషనో దిగిన వారందర్నీ పరిశీలించి చూచాడు కేశవ. ఎవర్ని చూచినా తన సందేహాన్ని తీర్చేవారిలా కనపడటం లేదు. దిక్కులు పరకాయించి చూడసాగాడు. స్టేషన్‌కి కొంచెం దూరంలో ఒక ఖాకీనిక్కరు మనిషి, అతని ప్రక్కనే తెల్లద్రస్సుతో ఒక పెద్దతరహా వ్యక్తి ప్రత్యక్షమయ్యారు.

వెంటనే కేశవ అటు నడిచాడు. తలంతా రేగి ఉంగరాలు గాలికి ముఖంమీద ఊగుతున్నాయి. బట్టలు కొంచెం దాగా మాసి నలిగిపోయాయి. తెల్లని ముఖం ఎండ వేడికి ఎర్రగా ఉంది. అయినా అతని ముఖంలో సంస్కారం, సంస్కృతి వెలువడుతూనే ఉన్నాయి. చేతిలో ఎయిర్ బేగ్‌ని పట్టుకొని, అటు నడిచాడు. అవతల వ్యక్తి—'ఏం కావాలి మీకు' అన్నట్లు ప్రశ్నార్థకంగా చూచాడు. కేశవ కొంచెం సందేహిస్తూ, 'ఈ వూళ్ళో సుబ్బయ్య గారింటికి వెళ్ళేదారి...'అని అడగబోతుంటే, 'ఈ పొలాల్లోంచి వెళ్ళి వూళ్ళో ఎవరైనా అడగండి' అన్నాడు.

పొలాల మధ్య కాలిబాట ఏర్పడి ఉంది. కేశవ స్టేషన్ వెనకాల పొలాల్లోకి దృష్టిని మరల్చాడు. అంతా అయోమయంగా కనపడింది. పొలాల మధ్యనుండి అడుగంత వెడల్పు పాపిడి లాంటి దారిమాత్రమే మెలికలు తిరిగి మొదలెక్కడో, అంతెక్కడో తెలియని, సస్యశ్యామలమైన పంట పొలాల మధ్య మార్గం, ఆకాశ మార్గంలా కనబడుతోంది.

మంచి ఎండాకాలంలో మిట్టమధ్యాహ్నం కావడంచేత కేశవకు తల దిమ్మెక్కినట్లుంది. దాహం ముంచుకొచ్చింది. ఎక్కడా మంచి నీళ్ళకూడా దొరకని స్టేషను అది. ఎడారిలా అనిపించింది. రెండడుగులు ముందుకు వేసి మళ్ళా వెనక్కు తిరిగి ముఖం మీద జుట్టును పైకి తీసుకుంటూ 'సార్ ప్లీజ్...చల్లని నీళ్ళు...' అన్నాడు ఇంగ్లీషులోనే...

అక్కడ ఉన్న పెద్దమనిషి బహుశః ఆ చిన్న స్టేషనుకి మాష్టారు కావచ్చు...ఆయన తన ప్రక్కనే నడుస్తున్న రైల్వే పోర్టర్‌ని తన గదిలో మంచి నీళ్ళగ్లాసు తెమ్మన్నాడు, ఎంతో ఆద రణ చూపుతూ. పోర్టరు వెంటనే లోపలకు వెళ్ళి గాజు గ్లాసుతో నీళ్ళు తెచ్చి కేశవకి అందించాడు. ఎండకు వడ కొట్టినట్లని పించింది కేశవకు. కాశిన్ని నీళ్ళు చేతిలో పోసుకొని ఆ చల్లని నీళ్ళతో ముఖం తుడుచుకున్నాడు. మిగిలిన రెండు చుక్కలు త్రాగాడు. గ్లాసు ఖాళీ అయింది. వెంటనే పోర్టరు, కుజా ఎత్తి మళ్ళా గ్లాసులో నీళ్ళు పోశాడు. కేశవ తృప్తితీరా చల్లని నీళ్ళు త్రాగి, వాళ్ళకు థాంక్స్ చెప్పి ముందుకు సాగాడు.

ఆ చిన్న స్టేషను గేటు దాటి కేశవ ఊళ్ళోకి వెళ్ళడానికి బయలుదేరాడు. పదిగజాలు నడిచి, అక్కడ ఒక మనిషిని ఊళ్ళోకి ఎలా వెళ్ళాలి? అన్నాడు.

'వూళ్ళోకి పోవడము తెలియదా బాబూ' అన్నాడు.

'అవును మాదీ ఈ ఊరు కాదు...'

'మరి ఏ ఊరునుండి వచ్చారేంటి?'

'విశాఖపట్నం నుండి'

'ఎవ్వరింటికి పోవాలా, చదివినోళ్ళకి ఆ పట్నాలు అయ్యే గానీ...'

'సుబ్బయ్యగారింటికి నీకు తెలుసా'?

'యారు బాబూ ఆ మద్దిల గొట్టె పెద్దమనిషా?' అన్నాడు.

'అవును అయ్యా!'

'ఆయన మీకేటి సుట్టము, మీకు ఆరికి పోలికలే లేవు. మీరు చదివినోళ్ళు, ఆయన మద్దిల తాళం వేస్తాడు.' అంటూ... ఆశ్చర్యం వెలిబుచ్చాడు.

ఇద్దరు ముందుకు సాగి పొలాల్లోంచి నడిచి పోతున్నారు. ఎటుచూచినా పచ్చని పంట పొలాలు, మామిడి చెట్లు ఫలభరితమై ఉన్నవి. చెట్ల నీడల్లోంచి నడుస్తూంటే ప్రాణం హాయిగా నిద్రిస్తున్నట్లున్నది. ఆ మహా వృక్షాలును హృదయంలోనే కొనియాడుకున్నాడు. మహాత్ములతో పోల్చుకున్నాడు. అందుకే మంచి వాళ్ళను మహా వృక్షాలతో పోలుస్తారు. నిజమైన మంచివాళ్ళకు మానవత ఉటుంది! ఇలాగే ఎక్కువ తక్కువ అనే తేడా ఉండదు. అందరకూ ఈ మహావృక్షం తన చల్లతనాన్ని సమానంగా పంచిపెట్టినట్లే ఉంటుంది. అని ఏవేవో వూహించుకుంటూ ప్రక్కన నడుస్తున్న రైతు బిడ్డతో సరిగా నడక సాగించాడు. ప్రక్కన పొలాల్లో మంచి ఎండలో పిల్లలు, పెద్ద వాళ్ళు, ఆడవాళ్ళు కష్టపడి పనిచేస్తున్నారు. నిజమైన కష్టజీవులు మీరే అనుకున్నాడు. కడుపులో మంచి ఆకలి కరకర కొరుకుతోంది. ఆ రైతు కుర్రాడి చేతికి అందుతున్న రెండు మామిడి కాయలు పటుక్కున తెంపాడు. ఒకటి కేశవయ్యకు ఇయ్యబోతూ తింటారా అయ్యా అన్నాడు తను ఒకటి కొరక బోతూ!

కేశవ, కాలే కడుపుకు మండే బూడిద కూడారుచిగా ఉంటుందన్నట్లు, ఆ పచ్చి మామిడి కాయ అందుకుని కటుక్కున కొరికాడు. చాలారుచిగా ఉంది ఆ జిహ్వాకు.

దారి పొడుగునా ఆ రైతు బిడ్డ కేశవను ఎన్నెన్నో ప్రశ్నలు వేశాడు, లోకాభి రామాయణాన్ని గురించి, చదువులు ఉద్యోగాలు గురించీను. కేశవ వాడి ప్రశ్నలకు సరియైన జవాబు చెప్పలేక తికమక పడి మొత్తానికి గ్రామీణుల క్విజ్ పూర్తి చేశాడు.

"సుబ్బయ్య ఇంట్లో ఉండే ఆ అమ్మాయి, ఆయన కన్న కూతురు కాదంటారు, పెద్ద సదివింది, సినిమాటారు కూడాఅంటారు. నిజమా?" అని చివరకు ఒక చిన్న చిక్కు ప్రశ్న వేశాడు.

దానికి మాత్రం కేశవ ఓడిపోక తప్పదను కున్నాడు. కేశవ జవాబుకి ఎదురు చూడకుండానే 'మీరుసినిమా యాటరేనా? కొంపతీసి!' అన్నాడు అకస్మాత్తుగా.

అనుకోకుండా ఎదురైన ప్రశ్నకు ఏంజవాబు యివ్వాలో అర్థం కాక కొంచంసేపు ఆలోచించి, అయినా వాడి ఉత్సాహాన్ని ఎందుకు అణగగొట్టాలి, అని నిజం చెప్పడానికి నిశ్చయించి కేశవ ఇలా అన్నాడు. సినిమాస్టార్ కాకపోయినాఅంతటి వాడినే అని మనస్సులో అనుకొంటూ, 'ఆ...పెద్దపెద్ద నాటకాలు వేస్తాము' అన్నాడు క్లుప్తంగా......

'పెద్ద నాటకాలు... చిన్న నాటకాలు కూడా ఉంటాయా బాబయ్యా?' అని మళ్ళా ప్రశ్నించాడు.

వీడితో బలే చిక్కే వచ్చి పడింది, ఏ పరీక్షలో పేపర్లో కూడా ఇన్ని ప్రశ్నలు ఇవ్వరు. ఇచ్చిన వాటికి ఇంతంత ఆన్సర్స్ రాయలేదు, అలా రాస్తే తను థర్డ్ క్లాస్‌లో ఎందుకు పాసవుతాడు? తండ్రిచేత చవట అని ఎందుకు అనిపించు కుంటాడు? అని నవ్వుకున్నాడు.

"ఇంకా సుబ్బయ్యగారి ఇల్లు ఎంతదూరం ఉంది" అని అడిగాడు, వీడి సొద ఎప్పుడు వదులుతుందా అని.

'దరిదాపులకు వచ్చేసాంలెండి, నిజంగా ఆ అమ్మాయి సినిమా స్టారా చెప్పండీ, ఎప్పుడూ బయటికి రానేరాదు, ఒకసారి చూద్దామంటే!'

'ఇంతకీ మీకు ఆ అమ్మాయి సుట్టమా?' అన్నాడు మళ్ళా,

'కాదుకానీ ... అలాంటిదే,'

'అంటే?'

'మే మిద్దరము కలిసి చదువుకున్నాము,,'

'అయితే ఆడాళ్ళు, మగాళ్ళు కలిసి చదువుకుంటూ లవ్ చేసుకుంటారట నిజమేనా?' అన్నాడు, టపాకాయ పేలినట్లు.

కేశవ వాడి అమాయకత్వానికి లోలోపలే నవ్వుకుంటూ, తనకు నక్షత్రకుడి లాగ తగిలాడు అనుకొని చిరాకు పడ్డాడు.

(సశేషం)

# జాషువా కవి వర్ణనలో “నాగార్జున సాగరం”

— శ్రీ గొల్లపూడి ప్రకాశరావు —

జాషువా ఆంధ్ర సాహిత్యలోకంలో సమున్నత స్థానం సంపాదించిన కవీంద్రుడు. జాషువా రచించిన గ్రంథాలను చెప్పమని సాహిత్య విద్యార్థి నెవరినైనా ప్రశ్నిస్తే ముంతాజ్ మహల్, ఫిరదౌసి మొదలైన గ్రంథాల పేర్లెన్నయినా చెప్పవచ్చు గాని నాగార్జున సాగర్ పేరు మాత్రం చెప్పరు. ఈ గ్రంథానికి పాఠకలోకంలో తగిన ప్రసిద్ధి లేకపోవడమే దీనికి కారణం. జాషువా గారీ గ్రంథాన్ని ప్రాయంపై వ్రాలినతర్వాత రచించారు. ముంతాజ్ మహలు, ఫిరదౌసి గ్రంథాలవలె వ్రాయాలనే కోర్కె మనసులో చెలరేగి కాదు. ప్రభుత్వంవారు నాగార్జునసాగరాన్ని గూర్చి గ్రంథం వ్రాయమని కోరితే వ్రాశారు. అనుభూత్యావేశాలవల్ల జనించే లలిత కళలు మనుజేశుల మెచ్చుకోలు మర్యాదలకు సాధ్యమౌతాయా? కావనే జాషువాగారు ముంతాజ్ మహలు ద్వారా అందించిన జవాబు. మరి నాగార్జున సాగర్ గ్రంథం ప్రభుత్వాధినేతలు వ్రాయమంటే వ్రాసిన గ్రంథం గదా! ఇది సత్కవిత్వం కాదా? కాదంటే జాషువా గారూరుకొని వుండేవారుకాదు. కవిత్వం విలువ తెలిసిన పాఠకులు గూడ అంగీకరించరు. మరి సమన్వయం ఎలా కుదురుతుంది? పలనాటి సీమపై ప్రత్యేకాభిమానం గల జాషువా హృదయక్షేత్రంలో ప్రభుత్వంవారి వాంఛా బీజంపడి నాగార్జునసాగర్ కావ్య వృక్షంగా విలసిల్లింది.

నాగార్జున సాగర్‌ను కావ్యమని పిలవడమేగాని ఇందులో మొత్తం ముప్పై పద్యాలే. దీనిని కావ్యమనడం కంటె ఖండిక అనడమే మంచిది. ఇందులో నాగార్జున సాగర్ ప్రశంసే ప్రధానం గాబట్టి ప్రశంసా ఖండిక అనడం మరీ మంచిది. నిజానికి కొండలగుండా, గుట్టలగుండా ప్రవహించి ఊసరక్షేత్రాలను సస్యశ్యామల క్షేత్రాలుగా తీర్చిదిద్దుతుంది నాగార్జున సాగరం అని పొగడడం ఆరంభిస్తే నాలుగైదు పద్యాలు చాలు. నాగార్జునసాగర్ ప్రశంసలో జాషువా కవి చూపిన ప్రత్యేకత యెట్టిదో గమనిద్దాం

నాగార్జునసాగర్ పర్వత ప్రాంతాన గల జలాశయం గనుక నాగార్జునసాగర్ నామధేయం సముచితం. నాగార్జునుడనే బౌద్ధాచార్యుని పేర వెలసినవీ పర్వత సాగరాలు. బుద్ధుడన్నా, బౌద్ధమతమన్నా, బౌద్ధమతానుయాయులైన వ్యక్తులన్నా జాషువాగారికి అపరిమితమైన గౌరవం. నాగార్జునాచార్య సంబోధనతోనే యీ గ్రంథం రచించబడడం, ఉన్న ముప్పై పద్యాలలో దాదాపు పది పద్యాలలో బౌద్ధ ప్రశంస వుండడం జాషువాగారి బౌద్ధాభిమానానికి నిదర్శనాలు. మణి సౌధాలను, స్వర్ణ భూషణాలను, సువిశాల సామ్రాజ్యాన్ని త్యజించిన సిద్ధార్థుడీ పర్వతంలోని ప్రత్యణువునందు గోచరిస్తున్నట్లు భావించాడీ కవీంద్రుడు. సంసార దావాగ్ని తప్తులకు ఈ గిరి వనీ వన భూములనుండి దివ్య శంఖారావము విన్పించుచున్నదని వీరి భావన. ఆనాడు బౌద్ధమత బోధలు ప్రజల హృదయాలలోని అశాంతి నణచివేసి శాంతిని కల్గించాయి. ఈనాడా ప్రదేశమునుండి ప్రవహిస్తున్న కృష్ణానది జలాలు పంటలు పండక, సంసారశకటాన్ని ఈడ్వలేక వెత నొందుచున్నవారికి శాంతి కల్గిస్తున్నవని వీరి ఊహాసరళి. ఈ దేశం సుభిక్షమై ప్రకాశించడానికి ‘బుద్ధుని శిష్యావళి పావన పద్మములయందుల బుణ్య మెంతున్నదో’ అని ఊహించడం గూడా బౌద్ధాభిమానానికి ఉదాహరణే. బౌద్ధమతానుయాయుల ప్రభావం ఈ నాటికిగూడా వున్నదని సంతృప్తితో స్తుతించిన ఈ కవీంద్రుడే కాలప్రభావమువలన బౌద్ధవిద్యాలయాదులు నశించి పోయినందుకు జాలి కన్నీటి పాట పాడకుండా వుండలేకపోయారు.

> “కాలకఠోర భూరిపరిభూహతి కూలిననాటి బౌద్ధ వి
> ద్యాలయ భగ్నశేషములయందు ననంత శతాబ్ది గర్భ ని
> ద్రాలస సంస్కృతీపసు తథాగతు పుస్తకధానకంబులన్
> జాలిగ బాడుచున్నది దిశల్ పులకింప విపంచి మీటుచున్”

పలనాటి సీమకు శ్రీనాథ కవీంద్రుడు వచ్చినన్ని పర్యాయాలు వచ్చిన కవిశేఖరుడు లేడు. పల్నాటిని ఆయనలా దూషించిన కవీశ్వరుడూ మరొకడు లేడు. జొన్న కలి, జొన్న యంబలి జొన్నన్నము, జొన్న పిసరు, జొన్నలె తప్ప సన్నన్నము సున్న సుమీ యని, రసికుడు పోవడు పలనాటని దూషించిన వాడెంతటి కవిచంద్రుడైనా పల్నాటి బాలచంద్రులందరికీ కంఠంవరకూ క్రోధముండి తీరుతుంది. జాషువా కవి పల్నాటి ప్రాంతంతో పరిచయమున్నవాడు. శ్రీనాథుని చాటువులు విన్నవాడు. నాగార్జునసాగరం నిర్మింప బడుతున్నదీ పల్నాటి ప్రాంతంలోనే. అందుచేతనే శ్రీనాథుణ్ణి సంబోధిస్తూ ఈ మధుర శ్రీనాథుడు అలనాడు మా పలనాడును పలుకులు నేర్చానని నోరికొచ్చినట్లు తిట్టావే, నీ నవ్విననాప చేనిపుడు డాల్వా పంటలు పండుతున్నదయ్యా, నీ కిపుడు రుచి కోసమైనా కావాలన్నా జొన్నన్నం దొరకదని విమర్శించాడు. శ్రీనాథుణ్ణి గూర్చి వీరు వ్రాసిన మూడు పద్యాలలో ఈ క్రింది పద్యం శ్రీనాథుని శైలిలోనే రచించబడినది.

> “అంగడి యూరలేదు, వరి యన్నము లేదు, శుచిత్వమేమిలే
> దంగనలింపు లేరనుచు నప్పుడు పల్కితి విప్పుడందువా
> అంగనలందరిందు దమయంతులుగా వరియన్న మంతయుం
> బంగరు బువ్వగా బలికి వ్రాయవె నైషధ కావ్యమున్ కవీ!”

శ్రీనాథుడు పల్నాటి ప్రాంతాన్ని దూషించాడని మనస్సుకు కష్టం కలిగినా పల్నాటి సీమలో బ్రతుకు అంత దుర్భరంగా వుండేదని అంగీకరించక తప్పదు. వర్షంమీద ఆధారపడడం గాలిలో దీపంపెట్టి దేవుడా నీ మహిమ అనడం వంటిదే. నాగార్జునసాగర్

నిర్మాణం వలన కలిగే సుఖసంపదలను వర్ణించడంతో పాటు ఇంతకు ముందు పల్నాటి ప్రజలు అనుభవించిన కష్టాలను జాషువా కవి రెండు సీస పద్యాలలో వర్ణించారు. ఈ కష్టాలు పల్నాటి సీమ వారివి మాత్రమే కాదు, వర్షాభావంతో జీవించే ప్రాంతాల వారందరివీ. వారంతా నాగార్జున సాగరానికి నిత్యపూజ గావించడం సహజమే. జాషువా కవి అతి సహజంగా వర్ణించిన పల్నాటివారి కష్టాలు వినండి.

"తడుపుచున్నారు క్షేత్రములు కర్షకకోటి
మానక మేని చెమ్మటలు గురిసి
కట్టుచున్నారు సర్కారువారికి శిస్తు
రెట్టిలో తలలు తాకట్టు పెట్టి
కడుపార మేత చిక్కక శుష్కితాంగమై
బ్రతుకుచున్నది మాదు పశుగణంబు
త్రవ్వుచున్నారు పాతాళ కూపశ్రేణి
యేపేట బుంగెడు నీటి కొరకు
పాడమూని సిరులు పండించి కష్టముల్
చెండి వేయ నిందు చేరినావు
పల్లనాటి సీమ ప్రఖ్యాతి గలదమ్మ
శ్రీ గలట్టి దొడ్డ సాగరంబ!"

నాగార్జునసాగర్ ప్రాజెక్టు ద్వారా కరువు జెబ్బలి పండ్లు రాలిపోగలవనీ, కష్టాల దినాలు గడిచిపోగలవనీ, పేదల దుర్దశలు తొలగిపోగలవనీ జాషువా గారూహించారు. స్వరాజ్యం వచ్చిన తర్వాత దేశం ఎంతో అభివృద్ధి చెందిందనీ, లోపాలెత్తి చూపే వాళ్ళంతా లోభులనీ వీరు పేర్కొన్నారు. కాని స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత దేశం అభివృద్ధి చెందాల్సినంత చెందలేదు. అయినా రక్కిన దేశాలతో పోల్చుకుంటే మన అభివృద్ధి నత్తనడక ననుసరించినట్లున్నది గాని అసలభివృద్ధి లేదనలేము. నాగార్జున సాగరం వలన ప్రజలింకా పొందవలసినంతటి ప్రయోజనం పొందడం లేదనే గాని ప్రాజెక్టు నిర్మాణం గావించిన ప్రభుత్వాన్ని అభినందించకుండా వుండడం ద్రోహం గదా?

జాషువాగారే అన్నారు 'తీరబోక రోజున కోరిక లాంధ్ర సోదరా' అని. ఆంధ్రుల కోరికలన్నీ తీరే ఆ రోజుకోసం ఎదురు చూస్తూ జాషువా కవి నాగార్జున పర్వత ప్రాంత సౌభాగ్యాన్ని స్తుతించిన పద్యంతో జాషువా కవితా స్తుతిని ముగిస్తున్నాను.

"పులులుం బందులు రేచులేలు వనభూముల్ నేడు అద్దాల మే
డలతో, నిద్దపు రాజమార్గముల తోడన్నిండి విద్యుల్లతా
నిలయశ్రేణుల నేత్రపర్వముగ ఆంధ్రీ దేవతా మస్తకో
జ్జ్వల రత్నాభరణంబుగా వెలసె స్వేచ్ఛా రాజ్య చిహ్నంబుగా"

# ఈ సంచికలోని రచయితలు......

శ్రీయుతులు......

జలగం వెంగళరావు, ముఖ్యమంత్రి, ఆంధ్రప్రదేశ్.
ఎమ్. ఎస్. రావు, న్యూఢిల్లీ
శిష్టు కృష్ణమూర్తి, 40-421-41, భాస్కర్‌నగర్, కర్నూలు.
వావిలాల గోపాలకృష్ణయ్య, సత్తెనపల్లి, గుంటూరు జిల్లా.
సిద్దాని నాగభూషణం, బి. ఎ. పి. ఆర్. ఒ., అన్నవరం, తూ. గో. జిల్లా.
డా. బి. ఆర్. కె రావు, ఎకనామిక్స్ డిపార్ట్‌మెంట్, శ్రీ వెంకటేశ్వరయూనివర్శిటీ,
తిరుపతి, చిత్తూరుజిల్లా.
పంద్రంగి రాజేశ్వరావు, జర్నలిస్టు, ఏలూరు, ప. గో. జిల్లా.
శ్రీమతి ఎస్. ఎస్. దేవి, 3-5-43/1, రాంకోఠి, హైదరాబాద్-1.
కె. రామలక్ష్మి,1, శివప్రకాశ మొదలిస్ట్రీట్, మద్రాస్-17.
శ్రీ జి. వెంకటరామారావు, ప్రధానోపాధ్యాయుడు, జిల్లాపరిషత్ ఉన్నతపాఠశాల,
ఉప్పల్ (కలాన్), హైదరాబాద్-39.
గంధం జోయల్, 22-7-82/1, మండీగల్లీ, పత్థర్‌గట్టీ, హైదరాబాద్-2.
పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు, లెక్చరర్, ప్రభుత్వకళాశాల, ఖమ్మం.
'మంజీర', టి. సుధాకర్‌రెడ్డి, న్యూమలక్‌పేట, హైదరాబాద్-36,
మల్లాది వెంకట కృష్ణమూర్తి, 1-1-336/9 చిక్కడపల్లి, హైదరాబాద్
కోట కమలాదేవి, 3-4-526/12, బర్కత్‌పురా, హైదరాబాద్.
గొల్లపూడి ప్రకాశరావు, లెక్చరర్, బ్రాడీపేట, గుంటూరు-2
కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, 69, ఆదర్శనగర్, హైదరాబాద్.
రావి నూతల శ్రీరాములు, జిల్లా రిజిష్ట్రారు కార్యాలయం, గుంటూరు-4

# భట్టిప్రోలు చారిత్రిక ప్రాధాన్యము

శ్రీ రావినూతల శ్రీరాములు

గుంటూరు–రేపల్లె రైలు మార్గంలో నేడొక చిన్న గ్రామంగావున్న భట్టిప్రోలు క్రీ. పూ. 3వ శతాబ్దినాడు ప్రతీపాల పురమనే మహానగరం.

అశోకునికి పూర్వుడు, ఇక్ష్వాకు వంశస్థుడు అయిన యశోధర్మడీ నగరనిర్మాత. సింహగోష్ఠికి అధిపతిగా పేర్కొనబడిన కుభీరకుడనే యక్షరాజు ఆధ్వర్యంలో భట్టిప్రోలు స్తూపం బుద్ధభగవానుని వెన్నముకపై నిర్మింపబడినది.

ఇందలి శాసనంలోని బ్రాహ్మీ లిపి తెలుగు లిపికి ఆధారభూతమైనదని భాషాశాస్త్ర వేత్తలు నిర్ణయించారు.



విరలేశ్వరాలయంలోని నాగస్తంభం

ఈ స్తూపం మొదటిసారిగా అలెగ్జాండర్ గారిచే పరిశీలింపబడి త్రవ్వకాలు జరుపగా బంగారు పుష్పమాలగల పేటిక లభించింది. దీనిని మద్రాసు మ్యూజియంలో భద్రపరచారు.

దురదృష్టవశాత్తు స్తూపంచుట్టూగల శిలాఫలకాలు కృష్ణ కాలువల నిర్మాణం కొరకు ఉపయోగింపబడి చిత్రకళ అదృశ్యమై స్తూప అవశేషంగా పెద్దదిబ్బ మిగిలిపోయింది.

ఆలయ ప్రాంగణంలోని మహిషాసురమర్దని కుడ్యశిల్పం అపురూపమైనది. నందీశ్వరునిలో జీవకళ ఉట్టిపడుచున్నది.

విజయనగర సామంతులలో ఒకరైన తిమ్మానాయుడీ ఆలయాన్ని పునరుద్ధరించినట్లు శాసనమొకటి ముఖమంటపమందున్నది.
అద్దేపల్లి, భట్టిప్రోలు జంటగ్రామాలు. ఈ గ్రామాల మధ్యలో ఒకశివాలయము దాని ప్రక్కనే మసీదు–సహజీవనానికి నిదర్శనంగా వెలసియున్నవి.

ఈ శతాబ్దంలో కూడా భట్టిప్రోలు చరిత్ర ఎన్నదగినది. ఆంధ్రదేశ సంచారంలో పూజ్యబాపూజీ ఈ గ్రామం సందర్శించి పునీతం చేశారు.

శ్రీయుతులు వద్దుల గిరిరావు, ఎల్లాప్రెగడ సత్యనారాయణ, పాతూరి మధుసూదనరావు, సంఘం బాలకోటయ్యలు ఈ గ్రామం నుండి జైలుకు వెళ్ళి స్వాతంత్ర్య సమరంలో ముందునిలిచారు.

శ్రీమతి గిరిరావు, శ్రీమతి ఎల్లాప్రెగడ ఇందుమతిగార్లు జైలుకు తమ భర్తలతో వెళ్ళిన ధన్యనారీమణులు.

భట్టిప్రోలు పరిసరాలలో సంచరిస్తుంటే కొన్నివేల సంవత్సరాల నాటి మహానగర మిదేననెడి భావన స్మృతి పథంలో మెదిలి ఆనందం కలుగక మానదు.

1970 సంవత్సరం మార్చినెలలో భారత పురావస్తుశాఖ ఈ స్తూప ప్రాంతాన్ని తిరిగి పరిశోధించగా చైత్యం, విహారంల పునాదులు బయలు పడినవి. సుమారు ఒకటిన్నర ఎత్తుగల స్ఫటికశిలా నిర్మిత నాగవిగ్రహం లభించింది.

ఇక్కడ లభించిన పెద్దపాత్రపై రోమ్ ముద్రలు గలవని పరిశీలకులు అభిప్రాయపడ్డారు. ఈ పాత్రను అమరావతి మ్యూజియంలో అలంకరించారు.

బౌద్ధ ప్రాభవం అంతరించినతర్వాత కొన్ని వందల ఏండ్లకు శైవ పరంగా గూడా భట్టిప్రోలు విఖ్యాతి నందుకొనడం గమనార్హం.

ఆంధ్ర దేశంలో అత్యంత ప్రాచీనమైన శివాలయం భట్టిప్రోలు స్తూపానికి పడమర దిశగా వున్న విరలేశ్వరాలయమే! 15 అడుగుల ఎత్తుగల పాలరాతి బౌద్ధుల ఆయకస్థంభం ఈ శివాలయ ప్రాకారంలో దాని క్రిందిభాగంలో వున్న నాగరాజు విగ్రహం కారణంగా నాగస్థంభంగా పూజలందుకొనుచున్నది.

విష్ణుకుండినులు ఈ ఆలయనిర్మాణానికి విశేష శ్రద్ధగైకొన్నారు. ఇందలి శివలింగం చాల పెద్దది. అర్జునునిచే ప్రతిష్ఠింపబడినదని జనశ్రుతి.

భట్టిప్రోలు స్తూపం





# నగర

# వార్తా చిత్రాలు






రాష్ట్రప్రభుత్వ ప్రధానకార్యదర్శి శ్రీ ఎన్. భగవాన్‌దాస్ నవంబరు 9 న సచివాలయం వద్ద ఉత్తరభారత దేశానికి వేసిన ఛార్టర్ సర్వీస్ బస్సుకు ప్రారంభోత్సవం చేశారు.



ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక అభివృద్ధి సంస్థ అధ్యక్షులు శ్రీ ఎన్. భగవాన్‌దాస్, డన్‌లప్ లిమిటెడ్ మేనేజింగ్ డైరెక్టరు నవంబరు 2న సాంకేతిక సహాయానికి సంబంధించిన ఒప్పందాలపై సంతకాలు చేశారు.

# మహాభారతము

తమ్మెగంటుల లక్ష్మణశాస్త్రి

## 71

### పాండవుల పరిచయము

"ఎవని టెక్కెము కొనకు ధ్వనించుచున్న 'నంద-ఉపనంద' అనెడు రెండు మృదంగములు వున్నవో అతడు ధర్మరాజు. ఆ మహాత్ముని శరీరము సువర్ణ వర్ణముతో విరాజిల్లుచున్నది చూడుము అతని నాసిక ఎత్తుగాను, కన్నులు పెద్దవిగాను నున్నవి. అతడు చూచుటకు కృశాంగుడుగా నున్నాడు. ఆ కురుకుల శ్రేష్ఠుడగు ధర్మనందనుడు తన ధర్మార్థము లోస్వరూపములను చక్కగా తెలిసినవాడు, కాబట్టి అవసరమైనప్పుడు ప్రజలు ధర్మార్థ సాధనమునందు సర్వదా యితనిని అనుసరించుచుందురు. ఈ ధర్మాత్ముడు తనను శరణుపొందిన శత్రువునైనను రక్షించును. మూర్ఖుడా! నీ మేలు కోరిన యెడల నీవు ఆయుధములను క్రిందపడవేసి చేతులు జోడించి యతని శరణు వేడుకొనుము

"ఇదుగో! మద్ది చెట్టువలె సుదీర్ఘములు, ఉన్నతములునైన భుజములు గలిగి నీకు కనబడుచున్నాడే అతడు భీమసేనుడు. ఇతడు క్రోధావేశము చేత కనుబొమ్మలు ముడివేయుచు పెదవులు కొరకుచున్నాడు చూడుము మహాబలము కలవి, సుశిక్షితములునైన అశ్వములు ఇతని రథమును లాగుచున్నవి చూడుము ఇతడు చేయు పనులన్నియు మానవాతీతములే యగును. భయంకరమైన పరాక్రమము కలవాడు కనుక ఇతనికి భీముడను పేరు వచ్చినది. ఇతనికి ద్రోహము చేసినవాడు జీవించజాలడు. శత్రుత్వమును ఎప్పుడు గూడ మరచి పోడు. పగతీర్చుకొని తీరును. ఆ తరువాత గూడ శత్రువు పట్ల పూర్తిగా శాంతి వహించడు.

"ఇదుగో యీ మూడవ వీరుడు కనబడు చున్నాడే, ఇతడు అర్జునుడు. ఇతడు సమస్త ధనుర్ధారులలో శ్రేష్ఠుడు. ధీరుడు. కీర్తిమంతుడు, జితేంద్రియుడు, పెద్దలను సేవించువాడు. యుధిష్ఠిరునికి తమ్ముడే కాక శిష్యుడుకూడా. అర్జునుడు ఎప్పుడుగూడ కామ, భయ లోభములకు వశుడై తన ధర్మమును విడువడు. క్రూరకృత్యములను చేయడు. అగ్ని సమానమైన తేజస్సు కలవాడు. శత్రువులను ఎదిరించుటలోను, దుష్టశిక్షణమునందు అతి సమర్థుడు. ఇతడే పాండవుల మధ్యముడు అర్జునుడు.

"ఇదిగో, సమస్త ధర్మార్థ సిద్ధాంతములను తెలిసికొని ప్రజల భయమును బాపుచునుండు బుద్ధిశాలియు సుందరుడు, భ్రాతృసేవాపరుడు, పాండవులచే ప్రాణాధికముగా రక్షింప బడువాడు నగు నితడే నకులుడు.

"ఇదుగో యితడు నా యెదవపతి సహదేవుడు. ఇతడు ఖడ్గయుద్ధములో అద్వితీయుడు. చిత్రవిచిత్రముగా కత్తిని త్రిప్పుచుండును, మహాబుద్ధిశాలి. మూర్ఖుడా! రాక్షసులతో యుద్ధము చేయునప్పుడు ఇంద్రుని పరాక్రమము వంటి శౌర్యమునే నేడు నీవు యుద్ధమునందు సహదేవునియందు చూడగలవు. ఈ పరాక్రమశాలి, ధర్మపుత్రునికి అతిప్రియుడు, ఇతడు సూర్యచంద్రులతో సమానమైన తేజస్సుగలిగి పాండవులందరికి ప్రియుడుగా యుండును. మంచి వక్తృత్వశక్తి గలిగి పెద్దలసభలో తీర్పు చెప్పగల సమర్థుడు. ఇతడు అగ్నిలోపడి తన ప్రాణములనైన విడుచునుగాని ధర్మవిరుద్ధమైనమాట ఒక్కటిగూడ మాట్లాడడు. క్షత్రియధర్మమును సదా పాలించు శూరుడితడు.

"మూర్ఖా! రత్నరాసులతో నింపిన నావ సముద్రమధ్యమునందు పెద్దమొసలికి ఢీకొని దొర్లిమునిగినట్లే నేడు పాండవులను ఎదుర్కొని నీ సేనగూడ సర్వనాశము చెందగలదు. నీవు స్వయముగా ఇప్పుడే చూచెదవుగాక.

"ఈ విధముగా పాండవులందరి పరిచయమును నీకు చేసినాను. అట్టివారికి మూర్ఖత్వముతో నీవు అవమానము చేసినావు. వారినుండి నీవు నేడు ఏ యపాయములేక బ్రతికి బయటపడినచో తిరిగి క్షేమముగా పునర్జన్మపొందినట్లే యగును."

"జనమేజయ మహారాజా! ఇట్లు ద్రౌపది చెప్పుచుండగనే ఐదుగురు ఇంద్రులతో సమానులగు పంచపాండవులు జయద్రథుని సేనలోదూరి, భీతులై శరణుపొందిన పదాతిదళమును దయతో విడిచి అందలి రథికుల రథములన్నింటిని తమ బాణవర్షముచేత అంధకార బంధురములను చేసిరి." అని వైశంపాయన మహాముని చెప్పి తరువాత కథ యిట్లు చెప్పదొడగెను.—

### యుద్ధము

"అప్పుడు సైంధవుడు చెదరిన తనసేనను జూచి 'ఆగుడు, కొట్టుడు, తొందరగా తిరిగిరండు' అని అరచుచు వారిని పురికొల్పెను. అంతట భీమార్జున నకుల సహదేవులను జూచి సైన్యములో అతి

ఘోరమైన శబ్దము బయలుదేరెను. పులులవలె పైబడుచు వచ్చుచున్న పాండుపుత్రులనుజూచి శిబి-సౌవీర సింధురాజులకు అత్యంత దుఃఖము కలిగెను. బంగారపు చిత్తరువులచే విరాజిల్లుచున్న ఉక్కుగదను చేబూని మృత్యువుచేత పురికొల్పబడిన సైంధవుని పైకి ఉరికెను. అంతలోనే కోటికాస్యుడు రథపు వెనుక కట్టును చేత బూని భీముని వారించుచు దానితో కొట్టెను. ఇంకను అనేకులు అనేకాయుధములతో కొట్టినను భీముడు కించిత్తుగూడ కంపించలేదు.

అతడు గదచేత ఒకగజమును గజారోహకుని సహితముగాను, పదునాలుగు పదాతులను చంపెను. అర్జునుడు సౌవీరుని పైకి లంఘించుచు అడ్డుగావచ్చిన పర్వతీయ సైనికులను అయిదు వందల మందిని చంపెను. ధర్మరాజుగూడ అప్పుడు తనను కొట్టుచున్న సౌవీరులను నూర్గురను నిమిషములో చంపెను. మహావీరుడైన నకులుడు చేతిలో కత్తి ధరించి రథమునుండి క్రిందకు దూకి గజముల పాదములను రక్షించు సైనికుల నరుకుచు ఆ శరీర ఖండములను బీజములనువలె భూమిలో నాటుచుండెను. సహదేవుడు బాణములతో గజ సైనికులను కొట్టి వారిని భూమిపైకి వ్యాధుడు నెమళ్లను చెట్లనుండి రాల్చినట్లు రాల్చుచుండెను.

ఆ తరువాత త్రిగర్త దేశరాజు ధనుస్సుతో రథమునుండి దూకిపోయి ధర్మరాజుయొక్క రథాశ్వములను నాల్గింటిని సంహరించి యుధిష్ఠిరుని పైకి కవిసెను. వానిని అర్ధచంద్ర బాణముతో ధర్మరాజు కొట్టెను. అప్పుడతని యెద చీలెను. నోట నెత్తురు వెడలెను. వేళ్లు తెగిన వృక్షము వలె క్రింద పడెను. రథాశ్వములు చనిపోవుట చేత ధర్మరాజు తన సారథియగు నింద్రసేనునితో సహా సహదేవుని రథము పైకి పోయెను. క్షేమంకరుడు, మహాముఖుడు అను నిరువురు వీరులు నకులునిపై కురికి అతనిని బాణ వర్షములో ముంచిరి. వర్షాకాల మేఘములవలె వారు మహాయుధములను నకులునిపైన కురిసిరి. అప్పుడు నకులుడు వారిని ఒక్కొక్క 'విపాఠ' బాణము చేతకొట్టెను. అంతట సురథుడను త్రిగర్త రాజు గజమును నడుపుటలో నిపుణుడుగనుక గజముతో నకులుని రథమును దూరముగా విసరి వేయించెను. కాని నకులుడు కొంచెముగూడ భయపడలేదు. కత్తి, డాలు, పట్టుకొని రథము నుండి దూకి అపాయములేని స్థలమునుచేరి పర్వతమువలె చలించక స్థిరముగా నిలిచెను. అప్పుడు సురథుడు తన గజమును నకులుని చంపుటకు పంపెను. అది తొండము పైకెత్తుకుని నకులుని పైన పడదోవుచుండగా నతడు దాని తొండమును దంతముతోసహా నరికి దానిని క్రింద పడవేసెను. గజము పెద్దగా ఘీంకారము చేయుచు, తనకు కట్టిన గజ్జలు గల్లుగల్లున ధ్వనించుచుండగా భూమిపై తల క్రిందుగా పడెను. దాని మావటివాడుగూడ పడిపోయెను. తరువాత నకులుడు భీముని రథముపైకి పోయి శాంతిల్లెను.

భీమసేనుడు తన పైకి వచ్చుచున్న కోటికాస్యుని రథసారథి తలను చురకత్తితో నరకెను. సారథి చచ్చుటను కోటికాస్యుడు కనిపెట్టలేదు. సారథి లేనందువలన రథాశ్వములు చెదరి రథమును దూరముగా లాగి తీసికొని పోయెను. అట్లు దీనుడుగానున్న కోటికాస్యుని భీముడు ప్రాస యుధముచే సంహరించెను. అర్జునుడు పన్నెండుగురు సౌవీరుల ధనుస్సులను, శిరస్సులను, భల్లాయుధములచేత ఖండించెను. అలాగుననే శిబి-ఇక్ష్వాక ముఖ్యులను, త్రిగర్తులను, సైంధవులను బాణములతో సంహరించెను. అర్జునునిచేత ధ్వంసముచేయబడిన గజము పతాక సహితరథములు రణభూమిలో కనబడెను. యుద్ధభూమినంతటిని సైనికుల మొండెములు, తలలు కప్పివేసెను. అక్కడ చచ్చిపడియున్న వీరుల రక్తమాంసములచేత కుక్కలు, గ్రద్దలు, రాబందులు, మాలకాకులు, కాకులు తృప్తిచెందెను.

సింధు దేశవీరులు చావగా సైంధవుడు ద్రౌపదిని విడిచి భయపడి పరుగెత్తదలచి చెదరిన సేన నడుమ ద్రౌపదిని రథము నుండి దించి తన ప్రాణరక్షణార్థమై అడవిలో పారిపోయెను. దైన్యముతోనున్న ద్రౌపదిని ధర్మరాజు సహదేవుని ద్వారా తన రథము పైకి తెచ్చెను.

జయద్రథుడు పారిపోగానే సైన్యమంతయు చెల్లాచెదరయ్యెను. అప్పుడు భీముడు పేర్లుపెట్టి పిలుచుచు నొక్కొక్కరిని బాణముతో సంహరించెను. అట్లు సైంధవుడు పారిపోవగా, అతని సేనను చంపుచున్న భీమసేనుని అర్జునుడు నివారించి యిట్లనెను:—"సోదరా! ఎవని దుష్టచేష్టవలన మనకు ఇంత క్లేశము సంభవించెనో ఆ జయద్రథుడిక్కడ కనబడుట లేదు. నీవు జయద్రథునే వెదకుము. అమాయకులైన యీ సైనికులను చంపుటచే మనకు కలుగు లాభమేమి? ఈ కార్యమునిష్ఫలమని నాకు తోచుచున్నది. మీకెట్లుతోచుచున్నదో యేమో." ఆమాటలు విని భీమసేనుడు ధర్మరాజుతో నిట్లనెను:—"రాజా! శత్రువులు దిక్కులకు పారిపోయిరి. కొందరు చచ్చిరి. ఇప్పుడు మీరు ద్రౌపదిని వెంటబెట్టుకొని మన యాశ్రమమునకు పొండు. నకులసహదేవులను, ధౌమ్యాచార్యులను గూడ తోడ్కొనిపోయి ఆశ్రమములో ద్రౌపదిని ఊరడించుడు. మూర్ఖుడైన సైంధవుడు పాతాళములో దూరినను, అతని జీవితముతో విడువను. అతని సారథి యింద్రుడంతటివాడైనను సరియే. నేను మాత్రము విడువను." ఆమాటవిని ధర్మరాజు భీమునితో, "తమ్ముడా! సైంధవుడు ఎంతటిదుర్మార్గుడైనను అగుగాక. అతనిని మాత్రము నీవు చంపగూడదు. ఎందుకనగా, అతని భార్య దుశ్శల' గాంధారి కూతురు గనుక మనకు చెల్లెలు. చెల్లెలి వైధవ్యమును మనం చూడజాలము. గాంధారీదేవి ముఖముచూచి యైననీతనిని చంపగూడదుసుమా!" అనియనెను. ఆమాటవిని, ద్రౌపది లజ్జావతియు, బుద్ధిమంతురాలునైనప్పటికిని మనస్సు వ్యాకులముకాగా మహాకోపముతో భీమార్జునులను జూచి నిట్లనెను:—

"నాకు మీరు ప్రియము చేయదలచినచో ఆ నరాధముని తప్పక వధింపుడు. ఆ పాపి సింధుదేశమునకే కళంకముతెచ్చి వంశమునకు చిచ్చుపెట్టెను. తన భార్యనుగాని, రాజ్యమునుగాని అపహరించు పాపాత్ముని యుద్ధములో, అతడు శరణుజొచ్చినను విడువక చంపవలెను." ఆమాటలువిని భీమార్జునులు సైంధవుని వెదకుచు

పోయిరి. ధర్మరాజు ద్రౌపదితోను, ధౌమ్యాదులతోను, తన యాశ్రమమునకు తిరిగి పోయెను. ఆశ్రమమునందలి ఆసనములు,స్వాధ్యాయ సామగ్రియంతయు చెల్లాచెదరై పడి యుండెను. మార్కండేయాది మునులు అచ్చటచ్చట చెదరి నిలిచియుండుటను ధర్మరాజు చూచెను. ఆబ్రాహ్మణులందరు ద్రౌపదిని గూర్చి మాటిమాటికి దుఃఖించుచుండిరి. అట్టిసమయమునందే ధర్మరాజు ఆశ్రమమునందు సపరివారముగా ప్రవేశించెను. వారిని జూచి మునులందరు మిక్కిలి ప్రసన్నులైరి. ఆమునులతో అక్కడనే యుధిష్ఠిరుడు కూర్చొనెను. ద్రౌపది నకులసహదేవులు ఆశ్రమములోపలికి పోయిరి.

## సైంధవుని పట్టితెచ్చుట

అక్కడ భీమార్జునులు సైంధవుడు చాల దూరము పోయి యుండుటనువిని, అతివేగముగా అతనిని తరుముచు ఉరికిరి. అపుడర్జునుడు అత్యద్భుతమైన తన పరాక్రమమును జూపెను. ఎట్లనగా, జయద్రథుని రథము ఒక కోసు దూరము పోయియుండినప్పటికిని అర్జునుడు తన దివ్యాస్త్రములతో దూరమునుండియే రథాశ్వములను కొట్టి చంపెను. అర్జునుడు తన దివ్యాస్త్ర ప్రభావముచేత,ఎంతటి సంకటావస్థ సంభవించినను బెదరువాడుకాడు. కనుకనే అపుడతడు అంతటి దుష్కరకార్యమును చేసిచూపెను.

ఆ తరువాత గుఱ్ఱములు చచ్చుటచేత కలత జెందుచు ఏకాకిగా నున్న సైంధవుని కడకు భీమార్జునులు పరుగెత్తి పోయిరి. సైంధవుడు తన గుఱ్ఱములు చచ్చియుండుటను, అత్యంత పరాక్రమమును చూపుచున్న అర్జునుని చూచి మిగుల దు:ఖించెను. అపుడు సైంధవునకు పారి పోవుట తప్ప గత్యంతరము లేకుండెను. కనుక అడవిలోపడి పరుగెత్తెను. పారిపోవుటలోనే తన పరాక్రమమును చూపుచున్న సింధురాజును వెన్నంటుచు అర్జునుడు ఇట్లనెను——

“రాజకుమారా! తిరిగిరమ్ము. వెన్నుచూపి పరిగెత్తుట మంచిది కాదు. నీ అనుచరులను శత్రువుల మధ్యమున విడిచి పరుగెత్తుట నీకు తగదు. ఇట్టి బల పరాక్రమములుగల నీవు పరస్త్రీని బలాత్కరించి అపహరించ దలచుచుంటివా”? ఇట్లు అర్జునుడు పరిహసించుచు పలుకుచున్నప్పటికిని సైంధవుడు తిరిగి అక్కడికి రాలేదు. అపుడు భీమసేనుడు “నీచుడా ! నిలునిలుము” అని పలుకుచు హఠాత్తుగా వాని వెనుక పరుగెత్తెను. అప్పుడు దయాళువగు అర్జునుడు “సోదరా ! ఇతనిని వధింపకుము.” అని భీమునితో అనెను.

అప్పుడు సైంధవుడు తనపైకి ఉరికి వచ్చుచున్న భీమార్జునులను చూచి మిక్కిలి బెదరి దు:ఖితుడై జీవితాశచేత వేగముగా పరుగెత్తెను. భీమసేనుడు రథమునుండి దూకి అతనిని వెన్నంటి క్రోధముతో నతని జుట్టు పట్టుకొని పైకెత్తిభూమిపై అణచి కొట్టెను. జుట్టుపట్టుకొనికూడా కొట్టెను. అప్పటికిని జీవించియున్న జయద్రథుడు పైకి లేవబోవగా భీముడు అతనితలపైన గట్టిగా తన పాదముతో తన్నెను. అతడు ఘోరున ఏడ్చెను. ఆయనను విడువక భీముడు అతనిని తన మోకాళ్ళతో అణచిపెట్టి పిడికిళ్ళతో గట్టిగా గుద్దెను. దానితో నతడు మూర్ఛిల్లెను. అట్లు మహాక్రుద్ధుడైయున్న భీమసేనుని అర్జునుడు “సోదరా! దుశ్శలకు వైధవ్యము రాకూడదని ధర్మరాజు మనలను శాసించియుండెను గదా”యని నివారించెను. అప్పుడు భీముడు అర్జునునితో నిట్లనెను—

“ఈ పాపిష్ఠుని నేను ప్రాణములతో విడువను ద్రౌపదిని ఘోరముగా బాధించినాడు. ఈ నరాధముడు చావవలసినదే. కాని, నేనేమి చేయగలను. మహారాజు దయామయుడు. నీవు బాలభావముచే నన్నుసర్వదా బాధించుచు వారించుచుందువు.” అనిచెప్పి భీముడు సైంధవుని తలను అర్ధచంద్ర బాణముచేత కొరిగి ఐదుశిఖలు ఉంచెను. సైంధవుడు ఏమియు మాట్లాడక ఊరకుండెను. నిందావాక్యములచే సింధురాజును తిరస్కరించుచు భీమసేనుడు “మూర్ఖుడా ! నీవు జీవింపదలచినచో, నీ జీవరక్షకు కారణమైన యీ నామాటను వినుము. పెద్దపెద్ద సభలలో నాకునీవు ‘దాసోస్మి’ అని యనవలెను. అప్పుడు నీకు ప్రాణము నిలిపెదను. ఇదె యుద్ధములో ఓడిపోయినవాడు. చేయవలసిన విధి.” అనియనెను. భీమునిచే నీడ్వబడుచున్న జయద్రథుడు ‘అలాగే యగుగాక’. అని అంగీకరించెను.

“ఆ తరువాత జయద్రథుడు లేవబోయెను. అప్పుడు వెంటనే భీముడు అతనిని బంధించి రథము పైకెత్తికొని పోయెను. సైంధవుని శరీరమంతయు ధూళిగప్పియుండెను. అతడు మూర్ఛిల్లి పడియుండెను. భీమార్జునులు సైంధవుని తమ యాశ్రమమునకు తీసికొనిపోయి ధర్మరాజునకు చూపించిరి. ఆ యవస్థలోనున్న సైంధవునిచూచి యుధిష్ఠిరుడు నవ్వి ‘యితనిని విడిచిపెట్టుడు.’ అని యనెను. భీమసేనుడు “మహారాజా ! ఈ పాపి యిప్పుడు పాండవులకు బానిస అయినాడు అని ద్రౌపదికి తెలుపుడు.” అని యనెను. అప్పుడు ధర్మరాజు భీమునితో ‘నీవు నా మాటను ఆదరించెదవేని యితనిని విడిచిపెట్టుము’ అని యనెను. ద్రౌపదికూడ యుధిష్ఠిరుని చూచుచు భీమునితో ‘నీవు ఇతనికి ఐదుశిఖలు మాత్రముంచి తల గొరిగి అవమానము చేసితివి. మనకు బానిస అయినాడు. ఇంత మాత్రము శిక్ష యితనికి చాలును. కనుక యితనిని విడిచిపెట్టుము.’ అని చెప్పెను.

“అప్పుడు సైంధవుడు బంధ విముక్తుడయ్యెను. అతడు చింతాక్రాంతుడై ధర్మరాజు వద్దకుపోయి నమస్కరించెను. అచ్చటి మునులకున్ను నమస్కరించెను అప్పుడు సాదరముగా నర్జునుడతనిచేయి పట్టుకొనియుండగా దయాశాలియైన యుధిష్ఠిరుడు జయద్రథునితో నిట్లనెను :—

“సింధురాజా ! ఇప్పుడు నీవు బానిసవు కావు. నిన్ను విడిచినాము. యథేచ్ఛగా వెడలిపొమ్ము. మరల ఎప్పుడుగూడ ఇట్టి దుష్కార్యము చేయకుము. అరే ! నీవు పరస్త్రీని కోరెదవా ! ఛీ ! ఎంత నీచుడవు. నీ సహాయకులుగూడ అధమాధములే. నీవు దప్ప ఇట్టి ధర్మవిరుద్ధమైన కార్యమునుచేయు మానవాధము డెవడున్నాడు? నీ యీ నీచకార్యము ప్రపంచమంతటను నిందితమైయున్నది.”

ఆ మాటలు విని సైంధవుడు మృతప్రాయుడై పడి యుండెను. అట్లున్న యతనిని చూచి యుధిష్ఠిరుడు వానిపైన దయ దలచి, "సింధురాజా! నీ బుద్ధిధర్మమునందు ఉత్తరోత్తరాభివృద్ధి చెందుగాక. ఎప్పుడు గూడ నీవు అధర్మము నందు మనస్సు లగ్నము చేయకుము. నీ రథ-గజ-తురగ-పదాతి సైన్యములతో క్షేమముగా వెడలిపొమ్ము" అనిచెప్పెను. సైంధవుడామాటలకు సిగ్గుచే తల వంచి ఏమియుమాట్లాడక అక్కడినుండి వెడలిపోయెను.

## సైంధవుని తపస్సు

"సైంధవుడు ఆతరువాత గంగా ద్వారమైన హరిద్వారమునకు పోయి అక్కడ పార్వతీ పతియైన శంకరుని శరణు జొచ్చెను. ఆ దేవుని గూర్చి మహా తపస్సు చేసెను. అతనికి ప్రీతుడై పరమేశ్వరుడు అతడుచేయు పూజలను స్వయముగా వచ్చి స్వీకరించి అతనిని 'వరము కోరుకొమ్ము' మనెను. అప్పుడు సైంధవుడు మహాదేవునితో 'నేను పంచపాండవులను వారి రథములతోపాటు యుద్ధములో జయించుదునుగాక' అని వరము కోరెను. అందుకు ఆ దేవుడు "అది నీకు సాధ్యముకాదు. పాండవులను జయించుటగాని వధించుటగాని నీకుశక్యముగాదు నీవు ఒకనాటి యుద్ధములో మాత్రము అర్జునునితప్ప తక్కిన నలుగురు పాండు పుత్రులను ముందుకు సాగనీయక వారించగలవు.

## అర్జున మహిమ

బదరికాశ్రమములో నారాయణునితో కలిసి తపస్సుచేసిన దేవేశ్వరుడైన నరుడే అర్జునుడు. అతనిని సమస్తలోకములు ఏకమై కూడ జయింపజాలవు. దేవతలకు గూడ అసాధ్యుడు. అతనికి దివ్యమై అసమానమైన పాశుపతాస్త్రమును నేను ఇచ్చినాను. ఇంతయేకాక అర్జునుడు లోకపాలకులనుండి వజ్రము మొదలైన దివ్యాస్త్రములను పొందెను."

"ఇప్పుడు నేను నీకు నర స్వరూపుడైన అర్జునునకు సహాయభూతుడైన నారాయణుని మహిమను గూర్చి వివరించెదను వినుము. "భగవంతుడైన నారాయణుడు దేవదేవుడు. అనంత రూపములు గలవాడు. ప్రపంచ మంతటను వ్యాపించియున్నాడు. దేవతలకు గురువు, సర్వసమర్థుడు. ప్రకృతి-పురుష స్వరూపుడు. అవ్యక్తుడు విశ్వరూపుడైయున్నాడు.

## మహాప్రళయ వర్ణనము

"యుగాంత కాలమునందు ప్రళయము సంభవించినప్పుడు భగవంతుడైన నారాయణుడే. ప్రళయాగ్ని రూపమునుధరించి, పర్వత-వన-సముద్ర-ద్వీప సహితమైన సమస్త ప్రపంచమును దహించివేయును. పాతాళమునందు నివసించు నాగులను గూడ భస్మముచేయును. అట్టి ప్రళయాగ్నిచేత సర్వప్రపంచము భస్మమైన తరువాత ఆకాశము నందు అనేక వర్ణములతో చిత్రవిచిత్రముగా నేర్పడిన మహామేఘములు వ్యాపించి యుండును. భయంకరములైన ఉరుములతో మేఘములు మెరుపులతో మెరియుచు అన్నిదిక్కులకు వ్యాపించి పోవును. అన్నివైపులను మహావర్షము కురియును. ఆ వానచే ప్రళయకాలాగ్ని చల్లారిపోవును. ఆయగ్నిని అతికట్టు మహామేఘములు మహాసర్పాకారముతో పెద్ద జలధారలను విడుచుచు ప్రపంచమంతటిని ముంచి వేయును.

అప్పుడు అంతటను ఏకాకారముగా జలమయమైన సముద్రమొక్కటే యెటుచూచినను కనపడును అందులో సమస్తచరాచర జగత్తు కనపడకుండ పోవును. చంద్రసూర్యులు, వాయువుగూడ విలయము చెందును. గ్రహనక్షత్రాదులు లేకుండపోవును.

"కృత-త్రేతా-ద్వాపర-కలియుగములు ఒక్క 'చతుర్యుగి,' అనబడును. అట్టిచతుర్యుగి సహస్రములు, అనగా నాలుగు వేల యుగములకు ఒక మహాయుగమని పేరు. దానియంతమునందు పైన చెప్పబడిన మహాప్రళయము ఏర్పడి ప్రపంచమంతయు జలమయమగును. భూమియంతయు జలములో మునిగియుండును.

"అప్పుడు నరనారాయణులలో నొక్కడగు భగవంతుడైన శ్రీహరి యొక్కడు మాత్రము మిగిలియుండి ఆ యేకార్ణవజలమునందు శయనించుటకుగాను రాత్రికాలమునకు తగిన యంధకారమును సృజించును. అది తమోగుణమయమగు మహారాత్రి యనబడును. ఆభగవానునకు వేయికన్నులు, వేయిపాదములు వేయిశిరస్సులు ఉన్నవి. ఆయన సర్వ ప్రపంచమునందు అంతర్యామియైన పురుషుడుగా నున్నాడు. ఆ భగవానుడు అతీంద్రియుడై నప్పటికిని తాను శయనించవలెనను నిచ్ఛచేత, వేయిపడగలతో భయంకరాకారము గల ఆదిశేషుని తనకు శయ్యగా చేసికొనును. ఆ సర్పరాజు అతి ప్రచండములైన సహస్రసూర్యుల సమూహము ఒక్కచోట చేరినట్లు మహాతేజస్సుతో విరాజిల్లుచుండును. ఆతేజస్సు అనంతము, అసమానము, ఆ సర్పరాజు శరీరకాంతి,మల్లె పువ్వులు, చంద్రుడు, ముత్యాలహారము, ఆవుపాలు, తామరతూడు, తెల్లకలువలతో సమానముగా ఉజ్జ్వలమైయుండును. అట్టి ఆదిశేషుని తనకు శయ్యగా చేసికొని శ్రీమన్నారాయణమూర్తి ప్రళయ సముద్రమునందు యోగనిద్రలో శయనించియుండును. ఇది తమోగుణముయొక్క ఆధిక్యము చేత ప్రపంచ ప్రళయము ఏర్పడుపరిస్థితి.

"ఆతరువాత సత్వగుణాధిక్యము ఏర్పడుచు అప్పుడు మరల ప్రపంచసృష్టికి ఆరంభమగును భగవంతుడు యోగ నిద్రనుండి మేల్కొనును. ఆయనకు ఈసమస్త ప్రపంచము అప్పుడుశూన్యముగా కనపడును. అట్లున్న ఆభగవన్నారాయణమూర్తి విషయమై మహర్షులు జలము ఆభగవంతుని శరీరము కనుకజలమునకు నారము అనిపేరు వచ్చెను. ఆనారమే భగవంతునకు 'ఆయనము '(గృహము) అయ్యెను. లేదా, ఆజలముతోనే ఏకమై ఆయనయున్నాడు, అని కూడ అర్థము చెప్పవచ్చును. ఈ కారణము చేత ఆభగవానునకు నారాయణ అను పేరు ఏర్పడినది.

(సశేషము)



## మైలారం గ్రామానికి విద్యుచ్ఛక్తి

అక్టోబరు 29 వ తేదీన మెదకుజిల్లా గజ్వేల్ సమితిలోని మైలారం గ్రామంలో విద్యుదీకరణకు ప్రారంభోత్సవం చేస్తూ జిల్లా కలక్టరు శ్రీ ఎస్. పేముల 1961 తరువాత 415 గ్రామాల్లో విద్యుదీకరణ చేయబడిందని అన్నారు.

సమితి అధ్యక్షులు శ్రీ ఎమ్. రంగారెడ్డి ప్రసంగిస్తూ ముమ్మర పథకంపై ఎంపిక చేయబడిన 65 గ్రామాల్లో విద్యుదీకరణను త్వరలో పూర్తి చేయుటానికి ఏర్పాట్లు చేయివలసిందని అధికారులను కోరారు. సిద్దిపేట, ఆర్. డి. ఒ. శ్రీ ఎమ్. సూర్యనారాయణ మాట్లాడుతూ ముమ్మర పథకం క్రింద రూ. 52 లక్షల ఖర్చుతో 65 లక్షల ఖర్చులో 65 గ్రామాలను చేపట్టడం జరిగిందనీ యీ కార్యక్రమం మూడు సంవత్సరాల్లో పూర్తవుతుందనీ తెలియజేశారు.

## నల్గొండ జిల్లా నీటిపారుదల విషయాల సంఘం సమావేశం

నల్గొండ జిల్లా కలక్టరు అక్టోబరు 30 వ తేదీన నల్గొండలో నాగార్జున సాగర్ ఎడమకాల్వ నల్గొండ జిల్లా స్థాయి నీటి పారుదల విషయాల సంఘసమావేశానికి అధ్యక్షత వహిస్తూ ఎడమ కాల్వ ఆయకట్టు రోడ్డు బృహత్పథకం చివరిదశలో ఉందని తెలియజేశారు.

నాగార్జునసాగర్ ఎడమకాల్వ సూపరింటెండింగ్ ఇంజనీరు శ్రీ విఠల్‌రావు ప్రసంగిస్తూ ఎడమకాల్వ క్రింద 2,82,000 ఎకరాలు యింతవరకు భూమి ప్రాంతీయకరణ జరిగినట్లూ, 2,80,000 ఎకరాలు సాగుకు సిద్ధం చేయబడినట్లూ చెప్పారు. జిల్లా రెవిన్యూ అధికారి మాట్లాడుతూ అక్రమ సాగుబడి విధానం తొలగించడానికి ప్రజలు సహకరించాలని కోరారు.

## హరిజనులకు పాడిపశువుల పంపకం

కడప జిల్లా దండు హరిజన కాలనీలోని 45గురు హరిజనులు పాడి పశువులను పొందారు. షెడ్యూల్డు కులాలు, తరగతుల సహకార గృహ నిర్మాణ సంఘం వారు యీ పంపిణీ చేశారు. ర్థిక సహాయ కార్యక్రమం క్రింద ఇవ్వబడిన యీ సహాయం,గు వారు తమ ఇళ్ల నిర్మాణానికై తీసుకొన్న రూ. 1800 ల ఋణాన్ని తీర్చుకొనడానికి ఉపయోగపడుతుంది. పాడిపశువులను పొందిన హరిజనులు మైదుకూరు సంయుక్త పాల సరఫరా కేంద్రానికి పాలను సరఫరా చేస్తారని తెలియ జేస్తూ జిల్లా కలక్టరు శ్రీ సుశీల్ కుమార్ యింకా యిలాంటి పథకాలను జిల్లాలోని యితర హరిజన, గిరిజన కాలనీ నివాసులకు కూడా లభ్యమయ్యేట్లు చూస్తామని హామీనిచ్చారు.

## దేవపూర్‌లో హరిజన దినోత్సవం

ఆదిలాబాద్ జిల్లా, ఉట్నూరు పంచాయతీ సమితిలోని దేవపూర్‌లో అక్టోబరు 30 వ తేదీన హరిజన దినోత్సవం జరిగింది. సమితి అధ్యక్షుడు శ్రీ ఆత్రం లింగు అధ్యక్షత వహించారు. శ్రమదానం, బాలల ప్రదర్శన యింకా పెరటితోటల పెంపకంలో పోటీ నిర్వహింపబడ్డాయి. మండలి అభివృద్ధి అధికారి శ్రీ కె. సుదర్శనం, విస్తరణ శాఖ సిబ్బంది యీ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## నిజామాబాద్‌లో 3 రోజుల పాటు శిక్షణ తరగతుల నిర్వహణ

నిజామాబాద్‌లో అక్టోబరు 29 వ తేదీ నుండి 31 వరకు రాష్ట్ర విద్యావిషయిక పరిశోధన, శిక్షణా మండలి వారు రాష్ట్ర మంత్రటా అమలు జరిగే శిక్షణ కార్యక్రమం క్రింద ప్రధానోపాధ్యాయులకూ, నిర్వహణాధికారి సిబ్బందికీ 3 రోజులపాటు శిక్షణ తరగతులను నిర్వహించారు.

వృత్తి విద్యాశాఖాధిపతి శ్రీ హనుమారెడ్డిగారు ఎవాల్యుయేషను శాఖ లెక్చరర్ శ్రీ ఎమ్. గోవర్ధనరావు శిక్షణ కార్యక్రమాన్ని నిర్వహించారు.

## గజ్వేల్ సమితిలో క్రీడోత్సవాలు

మెదకు జిల్లా గజ్వేల్ సమితిలో అక్టోబరు 29 వ తేదీనుండి 31 వరకు మండలి స్థాయి క్రీడోత్సవాలు నిర్వహింపబడ్డాయి. ఆర్.డి.ఒ. శ్రీ ఎమ్. సూర్యనారాయణ స్వాగతోపన్యాసం యిచ్చి బహుమతులను పంచిపెట్టారు.

గజ్వేల్ పంచాయతీ సమితి అధ్యక్షులు శ్రీ ఎమ్. లింగారెడ్డి సభకు అధ్యక్షత వహించారు. జిల్లా విద్యాశాఖ విస్తరణాధికారి శ్రీ డి. ఎన్. రెడ్డి సభను ప్రారంభించారు.

## మోటారు ట్రాన్స్‌పోర్టు సహకార సంఘానికి రూ 20,000లు మంజూరు

నిజామాబాద్ జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ కె. ఆర్ రాజారెడ్డి, నవంబరు 4వ తేదీన నిజామాబాదులో మోటారు ట్రాన్స్



నౌకాదళ ప్రధానాధికారి అడ్మిరల్ ఖొహిలీ ఇటీవల వైజాగ్ వచ్చినపుడు
విశాఖ పోర్టు ట్రస్ట్ చైర్మన్ శ్రీ బి. కె. రావు ఔటర్ హార్బరుగురించి వివరిస్తున్న దృశ్యం.

పోర్ట్ సహకార సంఘానికి ప్రారంభోత్సవం చేస్తూ ప్రభుత్వం, రెండు లారీల కొనుగోలుకు నికర ధనంగా 20,000 రూపాయలను యీ సంఘానికి మంజూరు చేసినట్లు తెలియజేశారు.

సభకు అధ్యక్షత వహించిన శాసన సభ్యులు శ్రీ వి. చక్రధరరావు ప్రసంగిస్తూ యిట్లాంటి సహకార సంఘాలు బలహీన వర్గాల నిమిత్తమై హెచ్చుగా స్థాపించవలసిన ఆవశ్యకతను నొక్కి వక్కాణిస్తూ మరి పది లారీల కొనుగోలుకు యీ పథకం క్రింద నిధులు మంజూరు చేయాలని కోరారు. మండలి విభాగ సహకార అధికారి శ్రీ జి. పట్టాభి, విస్తరణాధికారి శ్రీ కె. రాజమల్లు సభలో ప్రసంగించారు.

## సీతారామపురంలో హరిజన దినోత్సవం

శ్రీకాకుళం జిల్లా సారవకోటలోని సీతారామపురం గ్రామంలో సమితి అధ్యక్షులు శ్రీ డి. నారాయణరావు అధ్యక్షతన హరిజన దినోత్సవం నిర్వహించబడింది. మండలి అభివృద్ధిశాఖాధికారి శ్రీ ఆర్. దానయ్య మండలి సహాయ పౌరసంబంధ అధికారి శ్రీ పి. కృష్ణమూర్తి, ఉపాధ్యాయులు శ్రీ ఎన్. విజయరామమూర్తి ఉపన్యసించారు. విద్యావిషయిక విస్తరణాధికారి శ్రీ డి. భీమరావు సభలో పాల్గొన్న సభ్యులకు కృతజ్ఞతలందజేశారు.

## మూడు హరిజన కాలనీలకు ప్రారంభోత్సవం

మెదక్ జిల్లా కలెక్టరు, శ్రీ ఎస్. పేములు యిటీవల మెదక్ జిల్లా ములుగు, నెమటూరు, చౌడరపల్లిలలో మూడు హరిజన కాలనీలకు ప్రారంభోత్సవం చేస్తూ ప్రభుత్వం అమలు జరుపుతున్న అభివృద్ధి పథకాలద్వారా ప్రయోజనం పొందాలని హరిజలను ఉద్బోధించారు. తమ పిల్లలకు విద్య నేర్పాలని ఆయన హితవు చెప్పారు.

ప్రతి హరిజన కాలనీలో రోడ్డు,నిర్మించడానికి రు. 10,000 లు బావులు త్రవ్వడానికి రు. 10,000 లు మంజూరు చేశానని వెల్లడించారు.

సమితి అధ్యక్షుడు శ్రీ రంగారెడ్డి ప్రసంగిస్తూ తాలూకాలో మరికొన్ని హరిజన కాలనీలు నిర్మించాలని విజ్ఞప్తి చేశారు. డిప్యూటీ రిజిష్ట్రారు శ్రీ యస్. వీర్రాజు ప్రసంగిస్తూ యీ జిల్లాకు 1581 యిండ్లతో కూడిన 45 కాలనీలు కేటాయించారని అన్నారు. జిల్లాకు కేటాయించిన రు. 28 లక్షలలో యిప్పటి కప్పుడే రు. 24 లక్షలు ఖర్చు చేశారని ఆయన వెల్లడించారు.



నెల్లూరుజిల్లా గ్రంథాలయసంస్థ అధ్యక్షుడు శ్రీ హరిశ్చంద్రరెడ్డి నవంబరు 19న ప్రజాళికా వారోత్సవాల సందర్భంగా ఏర్పాటైన సభలో ప్రసంగించారు. జిల్లాకలెక్టరు శ్రీ కె. ఓబయ్య (కుడివైపునుంచి రెండవవారు) అధ్యక్షత వహించారు

## నాలుగు హాస్టల్ భవనాల నిమిత్తం రూ. 3.70 లక్షలు కేటాయింపు

పశ్చిమ గోదావరి జిల్లాలో హరిజన విద్యార్థులకు త్వరలోనే తగిన హాస్టల్ సౌకర్యాలు లభిస్తాయని జిల్లా కలక్టరు శ్రీ జి. కుమారస్వామిరెడ్డి యిటీవల జిల్లా పరిషత్తు స్థాయి సంఘం సమావేశంలో ప్రసంగిస్తూ అన్నారు. ఏలూరు, భీమవరం, గణపవరం, చింతలపూడిలలో నాలుగు హాస్టళ్ళు ఏర్పాటు చేయ డానికి రు. 3.70 లక్షలు ఖర్చు చేస్తారని ఆయన అన్నారు. రు. 1.41 లక్షల ఖర్చుతో మంచినీటి బావులు త్రవ్వడం ద్వారా గిరిజనులకు మంచినీటి వసతులు కల్పిస్తారు. గత సంవత్సరం జిల్లాలో కరువు నిరోధక సహాయక కార్యక్రమాల క్రింద రు. 1.48 కోట్లు ఖర్చు చేశారని కలక్టరు అన్నారు.

కొబ్బరి తోటలు, మత్స్య పరిశ్రమాభివృద్ధికి మొగల్తూరు సమితిలో మంచి వనరులు ఉన్నాయని కలక్టరు అభిప్రాయ పడ్డారు.

జిల్లా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ అల్లూరి బాపినీడు ప్రసంగిస్తూ ఎగువ ప్రాంతాలలో మంచి నీటి సౌకర్యాలు కల్పించాలని కోరారు. శాసన మండలి సభ్యులు శ్రీ ఎర్రా నారాయణస్వామి ప్రసంగిస్తూ సమితి ఆర్థిక వనరులను ఎక్కువ చేయడానికి ఎక్కువ ఉత్పత్తి దాయకమైన పథకాలను అమలు జరపాలని విజ్ఞప్తి చేశారు.

## పొదుపు దినోత్సవం

కరీంనగర్ జిల్లా డి. ఆర్. ఒ. శ్రీ లలిత్ మాథుర్ అక్టోబరు 31న కరీంనగర్‌లో ప్రపంచ పొదుపు దినోత్సవానికి పారంభోత్సవం చేశారు.

పార్లమెంటు సభ్యుడు శ్రీ సత్యనారాయణరావు ప్రసంగిస్తూ పొదుపును గూర్చి గ్రామీణప్రాంతాలలో విస్తృతంగా ప్రచారం చేయాలని ప్రజా ప్రతినిధులకు విజ్ఞప్తి చేశారు.

పోస్టాఫీసుల సూపరింటెండెంటు శ్రీ జి. సత్యమూర్తి ప్రసంగిస్తూ జిల్లాలో ఉన్న 72 సబ్ పోస్టాఫీసులు, 593 బ్రాంచి పోస్టాఫీసులలో సేవింగ్ బ్యాంకు సౌకర్యాలు ఉన్నాయని అన్నారు. కరీంనగర్ పట్టణంలో రెండు రోజులలో రు. 68,000/-ల తో 330 అకౌంట్లు ప్రారంభించారని తెలియజేశారు.

## మోపూరులో చేనేత సహకార భవనానికి ప్రారంభోత్సవం

నెల్లూరు జిల్లా కలెక్టరు శ్రీ కె. ఓబయ్య అక్టోబరు 7వ *తేదీన వెంకటాచలం బ్లాకులోని దక్షిణ మోపూరు గ్రామంలో* రూ. 1,25,000ల ఖర్చుతో నిర్మించబడిన చేనేత సహకార భవనానికి ప్రారంభోత్సవం జరిపారు. చేనేత సహకార సభ్యులు ఆర్జించిన

లాభాలతో భవన నిర్మాణ ఖర్చును భరించడం జరిగింది. ఈ సందర్భంలో ఏర్పాటైన సభకు సమితి అధ్యక్షులు శ్రీ ఆర్. దశరథ రామిరెడ్డి అధ్యక్షత వహించారు. గ్రామంలో రక్షిత నీటి సరఫరా సౌకర్యం కల్పించవలసిందని గ్రామ సర్పంచ్ శ్రీ పి. దశరథ రామయ్య కలెక్టరును అభ్యర్థించారు.

వాణిశ్రీ జిల్లా పరిషత్తు హైస్కూలును, బాలురహాస్టల్‌ను కూడా కలెక్టరు సందర్శించారు. ఈ స్కూలులో లేబొరేటరీలు, లైబ్రరీ, రీడింగు రూం లు ఏర్పాటు చేయడానికి రెండు కొత్త గదులు నిర్మించ వలసిన అవసరం ఎంతైనా వుందని హైస్కూలు కమిటీ అధ్యక్షులు శ్రీ యన్. చెంచయ్య కలెక్టరుకు తెలిపారు.

కలెక్టరు చేనేత సహకార సంఘానికి చెందిన అద్దకపు విభాగాన్ని కూడా సందర్శించారు. జిల్లా సహకార శాఖాధికారి శ్రీ కె. యస్. స్వామి, జిల్లా పరిషత్తు కార్యదర్శి శ్రీ కె. సూర్య నారాయణ కూడా కలెక్టరు వెంట ఈ విభాగాన్ని సందర్శించారు. కాన్‌పూర్ కాలవ నిర్మాణాన్ని అమలు జరపవలసిందని సమితి అధ్యక్షుడు కలెక్టరును కోరారు.

## కృష్ణా జిల్లా స్పోర్ట్స్ కౌన్సిల్ సమావేశం

కృష్ణా జిల్లా రెవిన్యూ ఆఫీసరు శ్రీ యన్. నారాయణ అధ్యక్షతన కృష్ణా జిల్లా స్పోర్ట్సు కౌన్సిలు సమావేశమైంది.

లోకసభ సభ్యులు, ఆంధ్రప్రదేశ్ స్పోర్ట్సు కౌన్సిలు అధ్యక్షులు అయిన శ్రీ యం. ఆర్. కృష్ణ ప్రసంగిస్తూ వివిధ జిల్లాల్లో ప్రజలకు ఆటలు నేర్పేందుకు మొబైల్ కోచింగ్ విభాగం ఆరంభించబడిందని తెలిపారు. గుంటూరులోని రీజినల్ కోచింగ్ సెంటర్ వివిధ ఆటలను గురించి నేర్పేందుకు ఇతర జిల్లాలకు కూడా ఉపకరించగలదని ఆయనచెప్పారు. ఆటలను ప్రోత్సహించడానికి ఆర్థిక వనరులు ఏర్పడడానికి వీలుగా జీవితభీమా సంస్థ నుంచి రుణాలు సేకరించి వివిధ పట్టణాలలో సినిమా థియేటర్లు నిర్మించవచ్చునని ఆయన సలహా యిచ్చారు.

గ్రామీణ సహకార సంస్థల నుంచి వనరులు సేకరించవచ్చునని మైలవరం పంచాయితీ అధ్యక్షులు శ్రీ కోమటి భాస్కరరావు సూచనచేశారు.

గౌరవ కార్యదర్శి శ్రీ శివకుమార్‌లాల్, ఆంధ్రప్రదేశ్ స్పోర్ట్సు కౌన్సిల్ కార్యదర్శి శ్రీ ఎ. యన్. ఎ. ప్రసాద్, సభ్యులు శ్రీ నరసింహారావుగారలు కూడా సమావేశంలో పాల్గొన్నారు.

## తోట్లవల్లూరులో మార్కెటింగ్ సమాచార కేంద్రం ప్రారంభం

కృష్ణాజిల్లా తోట్లవల్లూరులో మార్కెటింగ్ సహకార సంఘానికి సంబంధించిన సమాచార కేంద్రానికి అర్థగణాంకశాఖ డైరెక్టరు శ్రీ డి. రంగరామానుజమ్ ప్రారంభోత్సవంచేస్తూ గత పాతికేళ్ళగా యీ సంఘం విజయవంతంగా పనిచేస్తున్నందుకు అభినందించారు. ప్రజలకు, సంఘ సభ్యులకు ఆయా సమాచారాలను అందజేయడంలో యీ సమాచార కేంద్రం అమితంగా తోడ్పడుతుందని ఆయన అన్నారు.

ఈ కార్యక్రమానికి జిల్లా అర్థగణాంకశాఖ అధికారి శ్రీ టి. గోపాలకృష్ణమూర్తి అధ్యక్షత వహించారు. జిల్లా పౌర సంబంధాధికారి శ్రీ పి. రామకృష్ణ ప్రసంగించారు. సంఘం అధ్యక్షులు శ్రీ సూరపనేని వెంకటరామారావు ముందుగా శ్రీ రంగారామానుజమ్‌కు స్వాగతం చెప్పారు. శ్రీ ఎ. సీతారామశర్మ వందన సమర్పణ చేశారు.

## రంపచోడవరం గిరిజన స్కౌట్ శిబిరం ముగింపు

రంపచోడవరంలో 9 రోజులపాటు గిరిజన విద్యార్థుల నిమిత్తం నిర్వహించబడిన స్కౌటు శిబిరం ముగింపు కార్యక్రమం సందర్భంగా అక్టోబరు 7వ తేదీన తూర్పుగోదావరి జిల్లా కలెక్టరు శ్రీ సి. ఎస్. రంగాచారి మాట్లాడుతూ రాష్ట్రంలోని కోస్తా ప్రాంతంలోగల మొత్తం 33 స్కౌటు విభాగాలలోను 12 స్కౌటు విభాగాలు, 3 బాలికల గైడ్ విభాగాలూ యీ జిల్లాలోనే పని చేస్తున్నాయని తెలియజేశారు.

ఈ శిబిరంలో పాల్గొన్న గిరిజన విద్యార్థులకు కలెక్టరు సర్టిఫికెట్లు అందజేశారు. శిబిర నిర్వాహకుడు శ్రీ రేణుకాప్రసాద్ మాట్లాడుతూ యిక్కడ శిక్షణ పొందిన మొత్తం 48 మంది విద్యార్థులూ రంపచోడవరం, మారేడుమిల్లి, అడ్డతీగల, రాజవొమ్మంగి బ్లాకులకు చెందిన గిరిజన విద్యార్థులని తెలియజేశారు.

వీరిలో 32 మందిని తిరుపతిలో రాష్ట్ర స్థాయిలో జరిగే స్కౌటు కార్యక్రమానికి పిలుస్తున్నట్లు పేర్కొన్నారు.

ముందుగా కలెక్టరు, సమాజవికాస వారోత్సవ కార్యక్రమంలో ఒక భాగంగా జరిగిన సంక్షేమ శాఖ, మహిళా సంక్షేమ శాఖ వారి కోచ్ సెంటర్‌లు నిర్వహిస్తోన్న బాలికల హాస్టలులోని విద్యార్థినులకు వస్త్రాలను పంపిణీ చేశారు.

## వెనుకబడిన ప్రాంతాల సౌభాగ్యానికి నాగార్జున సాగర్ జలాలు

కేంద్ర పార్లమెంటరీ వ్యవహారాల మంత్రి శ్రీ కె. రఘురామయ్య అక్టోబరు 9న గుంటూరు జిల్లా కరిచేడులో రైతుల సమావేశంలో ప్రసంగిస్తూ ప్రకాశం జిల్లాలోని కందుకూరు డివిజన్ వరకు నాగార్జున సాగర్ జలాలను తెచ్చే ఆశ కనిపిస్తున్నదని అన్నారు. ఈ జిల్లాలోని వెనుకబడిన ప్రాంతాల సమస్యలను ఈ జలాలు తీర్చగలవని తద్వారా బీద ప్రజల ఆర్థిక పరిస్థితులు మెరుగు పడగలవనీ ఆయన అన్నారు.

మాజీ మంత్రి శ్రీ ఎన్. చెంచురామానాయుడు యీ సభకు అధ్యక్షత వహించారు.

PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVT. OF ANDHRA PRADESH, AT THE GOVT. CENTRAL PRESS HYDERABAD
PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION, PUBLIC RELA TIONS & TOURISM ANDHRA PRADESH, HYDERABAD.

